అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు...

# రహదారి భద్రత - మనందరి బాధ్యత




## ఆగండి !

రోడ్డు ప్రమాదముల వలన...
ప్రతి సంవత్సరం

**మనదేశంలో -**
సుమారు 1 లక్షా 50 వేల మందికి పైగా చనిపోతున్నారు.
సుమారు 6 లక్షల మంది గాయపడుతున్నారు.

**మన రాష్ట్రంలో** : 14 వేల మంది పైగా చనిపోతున్నారు. 80 వేల మంది క్షతగాత్రులు అవుతున్నారు.

**ఆలోచించండి!**

- కుటుంబంలో పెద్దలు మరణిస్తే పిల్లలకు దిక్కెవరు ?
- యుక్త వయస్సులో పిల్లలు మరణిస్తే ఆ తల్లిదండ్రుల రోదన ఎవరికి అర్థం అవుతుంది ?
- అంగవైకల్యం ఏర్పడి, ఉపాధి కోల్పోతే ఆ కుటుంబం పరిస్థితి ఏమిటి ?

**ఈ అనర్థానికి ముఖ్య కారణం...**

- నూటికి తొంభై శాతం మానవ తప్పిదాలే
- అజాగ్రత్తగా రోడ్డును ఉపయోగించడం
- నిర్లక్ష్యంగా వాహనములు నడుపడం
- నిబంధనలు పాటించకపోవడం

**సురక్షితమైన డ్రైవింగ్ అంటే...?**

- రహదారి నిబంధనలను తెలుసుకొని పాటించటం
- ప్రమాదం జరగకూడదు అనే ధ్యేయంతో ప్రవర్తించడం
- పరిసరాలు మరియు వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా మీ డ్రైవింగ్‌ను మార్చుకొనుట

## ముఖ్యమైన నిబంధనలు :

★ చిన్నవయస్కులకు, డ్రైవింగ్ లైసెన్సు లేని వారికి వాహనము ఇవ్వవద్దు. ★ వాహనమును రోడ్డుకు ఎడమప్రక్కన నడుపవలెను. ★ నాలుగు లేన్ల రోడ్లలో వాహనములు, నెమ్మదిగా వెళ్ళు వాహనములు ఎడమప్రక్క లేన్‌లో వెళ్ళవలెను. ★ వాహనములను కుడి ప్రక్క నుండి ఓవర్‌టేక్ చేయవలెను. ★ ఇతరులకు అసౌకర్యం కలిగించునట్లు, రోడ్డు సరిగా కనిపించనప్పుడు, రోడ్డు మలుపులలో, రోడ్డు జంక్షన్‌లో వాహనమును ఓవర్‌టేక్ చేయరాదు. ★ఎదురుగా వాహనము వచ్చునప్పుడు ఓవర్‌టేక్ చేయవద్దు. ★ రోడ్డు జంక్షన్‌లలో, జీబ్రా క్రాసింగ్‌ల వద్ద ఆగి, చూసి వెళ్ళండి. ★ లేన్ మారునప్పుడు, దిశ మారునప్పుడు, వాహనము నిలుపునప్పుడు సరియైన సంకేతములు చూపండి మరియు రియర్ వ్యూ మిర్రర్‌లో చూడండి. ★ ట్రాఫిక్ వ్యతిరేక దిశలో (వన్ వేలో) వాహనమును నడువవద్దు. ★ ప్రధాన రహదారుల మీద ఎల్లవేళలా వాహనములు నిలుపవద్దు. ★ మద్యం సేవించి వాహనము నడుపరాదు. (నడిపితే 6 నెలల వరకు జైలు శిక్ష) ★ సెల్‌ఫోన్ మాట్లాడుతూ వాహనములు నడుపరాదు. (జరిమానా మరియు జైలు శిక్ష). ★ డ్రైవర్ 8 గంటలకు మించి ఒకరోజులో డ్రైవింగ్ చేయరాదు. ★ అనారోగ్యముగా ఉనప్పుడు, అలసటగా ఉన్నప్పుడు వాహనము నడుపవద్దు. ★ డ్రైవింగ్‌లో నిద్రలేమి ప్రమాదాలకు మూలకారణం. ★ డ్రైవింగ్‌లో ప్రతి నాలుగు గంటలకు ఒకసారి ఆగి సేదతీరండి. ★ రోడ్డు మలుపు వచ్చుటకు ముందే వాహనము స్పీడు తగ్గించండి. ★ మోటారు సైకిల్‌పై ఇద్దరికి మించి ప్రయాణం ప్రమాదకరం. ★ కదులుచున్న బస్సును ఎక్కవద్దు. దిగవద్దు. ★ సీటు బెల్టు ధరించండి, ప్రమాదాలలో అది మిమ్ములను రక్షిస్తుంది.

### ద్విచక్రవాహనదారులు :

★ మోటారు సైకిల్ నడుపువారు హెల్మెట్ ధరించకపోవుట వలన తలకు గాయమై మరణించుచున్నారు. కావున హెల్మెట్ ధరించుట మీ రక్షణ కొరకే. ★ వాహనము నిలుపుటకు ముందు మరియు వెనుక బ్రేకులు ఒకేసారి ఉపయోగించండి. ★ ద్విచక్ర వాహనము ఇద్దరికి మాత్రమే, రోడ్డుపై వంకరటింకరగా నడుపరాదు. ★ రోడ్డుమీద ఇసుక, మట్టి, ఆయిల్ పడివుంటే ముందే మీ వాహనము స్పీడు తగ్గించండి. ★ డ్రైవింగ్ లైసెన్స్ లేకుండా వాహనం నడిపినచో జరిమానా లేదా జైలుశిక్ష.

### ఆటోలు / జీపులు :

★ఆటోలలో/జీపులలో పరిమితిని మించి ఎక్కువ మంది ప్రయాణికులను తీసుకొని వెళ్ళరాదు. ★ నేషనల్ హైవేలలో ఆటోలు తిరగరాదు. ★ ఆటోలలో డ్రైవరు ప్రక్కన ప్రయాణికులు కూర్చొనరాదు. ★ ఆటోలో కుడి ప్రక్కన రెండురాడ్లతో గాని, డోర్‌తో గాని మూసి ఉంచవలెను. ★ ఆటో రిక్షా హేండిల్ 40 డిగ్రీస్ కంటే ఎక్కువ తిరుగకుండా లాక్ చేసి ఉంచవలెను. ★ ఆటో ముగ్గురు ప్రయాణీకులకు లేదా ఆరుగురు స్కూలు పిల్లలకు మాత్రమే. ★ స్కూలు బ్యాగ్‌లు టిఫిన్ బాక్సులు ఆటో నుండి బయటకు వేలాడదీయరాదు.

### లారీ డ్రైవర్లు :

★ లారీలలో ప్రయాణీకులను తీసుకొని వెళ్ళరాదు. ★ పరిమితిని మించిన లోడును తీసుకొని వెళ్ళరాదు. ★ వాహనము నుండి ప్రక్కలకు పొడిగింపబడి ఉన్న లోడును తీసుకొని వెళ్ళరాదు. ★ వెనుక పొడిగింపబడి ఉన్న లోడునకు పగలు ఎర్రజెండా, రాత్రిపూట ఎర్రలైటు అమర్చవలెను. ★ నేషనల్ పర్మిట్ మరియు దూర ప్రయాణములు చేయు లారీలలో ఇద్దరు డ్రైవర్లు ఉండవలెను. ★ వెనుక భాగమున ఎరుపు రంగు రిఫ్లెక్టర్స్, లైట్లు అమర్చి ఉండవలెను.

### స్కూలు బస్సులు :

★ పరిమితికి మించి విద్యార్థులను తీసుకు వెళ్లరాదు. ★ బస్సు ప్రయాణంలో ఎల్లవేళలా ఒక టీచర్, క్లీనర్, పేరెంట్స్ కమిటీ మెంబర్ ఉండవలెను. ★ ప్రతి 3 నెలలకు ఒకసారి పేరెంట్స్ కమిటి బస్సు కండీషన్ తనిఖీ చేసి రిపేర్లు చేయించవలెను. ★ బస్సులో విద్యార్థుల జాబితా ప్రతిరోజూ ఉండవలెను. ★ డ్రైవర్ వయస్సు 60 సంవత్సరములు దాటి ఉండరాదు. ★ డ్రైవర్‌కు ప్రతి 3 నెలలకు ఆరోగ్య పరీక్ష స్కూలు యాజమాన్యం చేయించవలెను. ★ స్కూల్ బస్సు డ్రైవరు సిగరెట్, మద్యం మొదలగు వ్యసనములకు దూరంగా ఉండవలెను. ★ బస్సులో ఫస్ట్ ఎయిడ్ బాక్స్, మంటలను ఆర్పు యంత్రము ఉండవలెను.


మద్యం సేవించి వాహనాలు నడుపకండి


పాదచారులను గౌరవించండి


ద్విచక్ర వాహనం ఇద్దరికే


హెల్మెట్ విధిగా ధరించండి

డాక్టర్ సుందర్ వడ్డి
జిల్లా కమీషనర్, రవాణాశాఖ,
అనంతపురం జిల్లా.

చిరకాలం జీవించండి... మద్యం సేవించి వాహనాలు నడుపకండి...

చైతన్య మానవి

సంపాదకీయం...

# మహిళా హక్కులపై దాడిని ప్రతిఘటిద్దాం...

బిజెపి ఢిల్లీ పీఠాన్నెక్కడంతో మహిళల పరిస్థితి పెనం మీద నుండి పొయ్యిలో పడినట్లైంది. మోడీగారు హిందువుల ఓట్లతో అధికారంలోకి వచ్చారు గనుక ప్రతి మహిళా పదిమంది పిల్లల్ని కనాలని ఓ పీఠాధిపతి చెప్తాడు. మరో ఎంపీ శిరోమణి పిల్లల్ని కనమన్నాను గానీ 40 కుక్క పిల్లల్ని కనమనలేదుగా అంటుంది. సాధ్వీమ తల్లులు, స్వామీజీలు వారు కనిపెంచితే కష్టమేమిటో తెల్సేది. మన రాష్ట్ర ముఖ్యమంత్రి గారు మరో అడుగు ముందుకే వేసి చదువుకున్న యువత పిల్లల్ని కనటానికి సిద్ధపడటం లేదని, పిల్లల్ని కనకపోతే జపాన్‌లాగా వృద్ధుల దేశమై పోతుందని సశాస్త్రీయంగా వివరిస్తూ మిత్ర ధర్మాన్ని పాటించారు. ప్రతీ సంవత్సరం మన దేశంలో 2,50,000 మందికి పైగా మహిళలు ప్రసవసమయంలో చనిపోతున్నారు. ప్రతి లక్షమందికి 400 మందిచొప్పున చనిపోతున్నారని ఎన్ఎస్ఎస్ రిపోర్టులు తెలుపుతున్నాయి. అమెరికా కంటే 56 రెట్లు ఎక్కువ మరణాలకు మన దేశ మహిళలు గురవుతున్నారు. ప్రసవం అంటే స్త్రీకి పునర్జన్మ అంటారు. అధిక గర్భధారణ, గర్భ స్రావాలు స్త్రీల ఆరోగ్య స్థితిని దెబ్బతీస్తున్నాయి. బాల్య వివాహాలతో శరీరం సంపూర్ణంగా ఎదగకుండానే బిడ్డల్ని కంటున్న మహిళల స్థితి మరింత అధ్వానంగా వుంది. మన దేశంలో నిరక్షరాస్యులలో బాల్యవివాహాలు, అధిక గర్భధారణ క్రానిక్ సమస్యలు వున్నాయి. రాజస్థాన్, యుపి లాంటి రాష్ట్రాలలో గర్భధారణ నిష్పత్తి నాలుగు వుంటే అక్షరాస్యత వున్న కేరళలో రెండు కంటే తక్కువ వుంది.

ఒకరిద్దర్ని పెంచి పోషించడమే కష్టమైన స్థితిలో ఉన్నాం. అధిక సంతానాన్ని కంటే వారి పెంపకం, విద్య, ఆరోగ్యం తదితర సదుపాయాలు ప్రభుత్వాలు కల్పిస్తాయా. ఇప్పటికే 55 శాతం మహిళలు రక్తహీనతతో బాధపడుతున్నారు. పిల్లల్ని ఎంతమందిని కనాలి,గర్భం ధరించాలా, వద్దా అనే నిర్ణయం తీసుకునే హక్కు స్త్రీలకు వుండొద్దా ? దాన్ని కూడా సన్యాసులు, స్వామిజీలు, నాయకులే నిర్ణయిస్తారా ? ఈవిషయంలో అన్ని మతాధిపతుల దారి ఒక్కటే. ఇటీవలే ముస్లిం మతాధిపతులు ఎక్కువ మంది పిల్లల్ని కనమంటున్న భోదనలను స్వాగతిస్తూ మేము ఎప్పట్నించో చెపుతున్న విషయాన్ని మీరు కూడా చెపుతున్నారంటూ ఆనందాన్ని వెలిబుచ్చారు. అయితే ముస్లింలను అధిగమించేందుకు అని చెప్పటం బాగోలేదన్నారు. ఖాప్ పంచాయితీలను అనుమతించి వివాహ హక్కును నిరాకరించి హత్యలను కూడా సమర్ధిస్తున్న నేతలే పాలకులుగా ఉండటంతో పరువుహత్యలపై చట్టం చేయమని మహిళా సంఘాలు కోరుతున్నా పట్టించుకోవడం లేదు. ప్రేమికుల దినోత్సవం రోజున మోరల్ పోలీసింగ్ చేస్తూ ఇది పాశ్చాత్య సంస్కృతి అంటున్నారు. శకుంతల, దుష్యంతుల గాంధర్వ వివాహం, రుక్మిణి కృష్ణుల వివాహం ఏపెద్దల అనుమతితో జరిగింది.

వస్త్రధారణ మూలంగానే అత్యాచారాలంటున్నారు. సంస్కృతి సంరక్షణ పేరిట ఆంక్షలు విధిస్తున్నారు. మరి పురుషుల వస్త్రధారణ ఏమిటి? రాత్రి ఆరుగంటల తర్వాత బైటకు వెళ్ళడమెందుకు ? అంటున్నారు. భర్తను సుఖ పెట్టడమే భార్య ధర్మం అని, ఆమె గడప దాటనవసరం లేదని, భర్తే ఆమెకు సర్వ సుఖాలు సమకూరుస్తాడని ఉవాచిస్తున్నారు. ఇల్లు దిద్దుకోక ఉద్యోగాలెందుకని సన్నాయి నొక్కులు వినిపిస్తున్నారు. ఇండియాలో అత్యాచారాలు తప్ప భారత్‌లోకాదని కళ్ళకు గంతలుగట్టే యత్నం చేస్తున్నారు.

మధ్యయుగాల మౌఢ్యం వైపు మహిళలను నెట్టివేసే తిరోగమన వ్యాఖ్యానాలు అడ్డూఅదుపూ లేకుండా బహిరంగంగా సాగుతున్నాయి. ఆర్ఎస్ఎస్, హిందూ మహాసభలాంటి సంస్థలు తల్లిగా పిల్లల్ని పెంచడం, ఇంటిని చక్కదిద్దుకోవడం,భర్తకు సేవచేయడమే మన సంస్కృతని అదే మహిళల ధర్మమని సమానతా ధర్మాన్ని నిరాకరిస్తున్నారు. మంచిరోజులు వస్తాయని చెప్పిన మోడీగారు మౌనమే అర్ధాంగీకారమంటూ మహిళల పరాధీనతను స్వాగతిస్తున్నారు. మరో వైపు వారి వ్యూహకర్తలు ఈవాఖ్యలతో బిజెపికేమీ సంబంధం లేదంటారు. అర్ధాంగిని అర్ధాంతరంగా వదిలేసిన పురుషపుంగవులు, వారి పార్టీ మహిళల గురించి ఇంత కంటే భిన్నంగా ఆలోచిస్తారనుకోవటం మన తప్పేమో. కానీ ప్రమాణం చేసిన రాజ్యాంగం, స్రీ పురుష సమానతను చాటి చెపుతున్న రాజ్యాంగంపై వివక్షత లేని రాజ్యాన్ని నడుపుతామని ప్రమాణం చేసిన వారు అందుకు భిన్నంగా అడుగడుగునా ఆంక్షలు విధిస్తే చూస్తూ ఊరుకోవడమా ?

అభివృద్ధి జపం ఎంత చేసినా ఆడవాళ్ళకు స్వేచ్ఛ, సమానత్వ హక్కులు లేని సమాజం కుంటి నడక మాత్రమే సాగిస్తుందని ఎలుగెత్తి చాటుదాం ! మహిళా హక్కుల్ని పరిరక్షించుకోవడానికి పూనుకుందాం !

**సూక్తి :-** *కల్లోలంగా ఉన్న కొలనులో నిశ్చలమైన ప్రతిబింబం కనబడదు. అలాగే నిలకడలేని మనసులో శాంతి నిలబడదు.*

# చైతన్య మానవి

ఈ సంచికలో...






## అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఎ.పి. రాష్ట్ర కమిటీ

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
కల్పన ప్రింట్స్ రోడ్, కృష్ణలంక, విజయవాడ.
ఫోన్ : 94900 98620, 94900 98022
e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.**

వ్యాసం

# మార్చి 8 ఉద్యమ స్ఫూర్తితో ముందుకు

- కె. స్వరూపరాణి

అంతర్జాతీయ మహిళా దినోత్సవం 105వ సంవత్సరంలోకి అడుగుపెట్టింది. మహిళా దినోత్సవానికి శతాబ్ధకాలం దాటినా మహిళల అసమానత, దోపిడీ, అణచివేత అంతం కాలేదు. గత 2 దశాబ్ధాలుగా పాలకులు అనుసరిస్తున్న విధానాలు, ప్రపంచీకరణ నేపథ్యంలో జరుగుతున్న సామాజిక, ఆర్థిక దాడి స్త్రీ అస్తిత్వాన్ని నాశనం చేసే కుట్ర చేస్తున్నది. సామ్రాజ్యవాదం, ఫ్యూడల్ లక్షణాలతో కూడిన పెట్టుబడిదారీ విధానం, మత ఛాందసవాదం మహిళల వ్యక్తిత్వాన్ని దెబ్బతీయటానికి పూనుకుంటున్నాయి. ప్రపంచవ్యాప్తంగా స్త్రీలు తమ అస్థిత్వం కోసం అలుపెరుగని పోరాటం చేస్తున్నారు. సరిగ్గా నూరేళ్ళ క్రితం ఇదే రోజున మహిళా కార్మికుల తరపున కోపెన్‌హగన్‌లో క్లారాజెట్కిన్ వినిపించిన చైతన్య నినాదం క్రమంగా ప్రపంచ వ్యాప్తంగా విస్తరించి మానవజాతిలో సగానికి మేలుకొలుపుగా మారింది. 150 సంవత్సరాల క్రితం శ్రామిక మహిళలు ముఖ్యంగా బట్టల మిల్లు కార్మికుల యొక్క వీరోచిత పోరాటాలు నేటి మహిళా ఉద్యమానికి ఎంతయినా బలాన్ని, స్ఫూర్తిని ఈయక మానవు. నేడు మనం అనుభవిస్తున్న ప్రతి హక్కు, సౌకర్యం వెనక ఎంతోమంది మహిళల త్యాగాలు, పోరాటాల స్ఫూర్తి వుంది. స్వేచ్ఛ, సమానత్వం కోసం నినదించారు. ఆహారం, ఆరోగ్యం హక్కుకై పోరాడారు. ఉపాధి, గౌరవం కల్పించాలన్నారు. ఓటు హక్కు ఆర్థిక హక్కులు తమ హక్కులని సమ్మె సైరన్లు మ్రోగించారు. వివక్షత సహించమన్నారు.. దేనిలోనూ పురుషుల కన్నా తీసిపోమంటూ కదనరంగంలో నిలిచారు. పోరాటంలో ప్రాణాల్ని తృణ ప్రాయంగా విడిచారు. ఒక సబ్బు, షాంపూ, బ్లేడు అమ్మకపు వస్తువుగానో, వంటపాత్రలు, పిల్లలకి, భర్తకు ఏమి కావాలో అమర్చే వ్యక్తిగానో, ప్రేమ, త్యాగాలు, పగ, ద్వేషంలో నిత్యం రగలిపోయే సాధారణ పాత్రధారిగానో లేకపోతే హింస,




అత్యాచారాలకు గురయ్యే అబల కాదని చాటాయి అంతర్జాతీయ శ్రామిక మహిళా ఉద్యమాలు.

**నేపథ్యం :**

ప్రపంచ వ్యాప్తంగా జరిగిన వర్గపోరాటాలు కేవలం పురుషులు మాత్రమే చేసినవి కాదు. గతంలో జరిగిన విప్లవం, దాడులు, తిరుగుబాట్లు ఇప్పుడు పెట్టుబడిదారీ సమాజంలో సాగుతున్న వర్గపోరాటాల్లో మహిళలు భాగస్వాములుగా వున్నారు.

(1848) పారిస్ విప్లవంలో మహిళలు కీలక పాత్ర పోషించారు. 1871 పారిస్ కమ్యూన్‌లో ప్రభుత్వ రక్షణ కోసం వేలాదిమంది మహిళలు బారికేడ్ల వద్దే చనిపోయారు. అదే సమయంలో యూరప్, ఇంగ్లండ్‌లలో వచ్చిన పారిశ్రామిక విప్లవం కార్మికవర్గ జీవితాలను మార్చివేసింది. మహిళలు పారిశ్రామిక, కార్మిక వర్గ పోరాటాల్లో సమ్మెలు, నిరసనల్లో పాల్గొన్నారు. ఆధునిక కాలంలో నూతన పరిశ్రమలలో మహిళలకు అతి తక్కువ వేతనాలకి ఉపాధి కల్పించడం, కార్మికవర్గంలో కూడా మహిళల పట్ల సనాతన ఆలోచనల కారణంగా అనేక పరిశ్రమలలో మహిళలను చేర్చుకోలేదు.

1848 కమ్యూనిస్టు ప్రణాళికలో మార్క్స్ మరియు ఏంగిల్స్‌లు వర్గ పోరాటం, స్త్రీ విముక్తి రెండూ కలిసే జరగాలని స్పష్టంగా పేర్కొన్నారు. మొదటి ఇంటర్నేషనల్‌లో కొంతమంది ఛాందసవాదులు మహిళలను పురుషులతో సమానంగా చూస్తే కుటుంబాలు నాశనం అవుతాయని చేసిన వాదనను మార్క్స్, ఏంగెల్స్‌లు తీవ్రంగా వ్యతిరేకించారు.

1869లో లేమాన్స్‌లో సిల్క్ మహిళా కార్మికుల సమ్మెను సమర్ధిస్తూ మార్క్స్, ఏంగిల్స్‌లు మీటింగ్‌కు హాజరై ఇంటర్నేషనల్‌లో సభ్యత్వం కోసం తీర్మానం చేశారు. అయితే సాంప్రదాయవాదులు అడ్డుకున్నారు. మార్క్స్ మహిళల అణచివేత, దోపిడీకి వ్యతిరేకంగా తీవ్రంగా కృషిచేశారు. న్యాయబద్ధంగా సమానత్వం సాధించినా స్త్రీ విముక్తి సాధించాలంటే దీర్ఘకాలం పడుతుందని ఏంగిల్స్ వ్యాఖ్యానించారు. ఆ మాటలు ఈనాటికి నిజమనిపిస్తున్నాయి.

**బట్టలమిల్లు, కుట్టుపని మహిళా కార్మికుల పోరాటాలు :** అమెరికాలో కుట్టుపని మహిళలు చేసిన పోరాటాలు ప్రపంచ వ్యాప్తంగా మహిళల సమస్యలను తెరమీదకి తేవడంతోపాటు అనేక ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చారు.

**1857లో ప్రపంచంలో ఎక్కడా జరగనంత తీవ్రమైన పోరాటం మార్చి 8న న్యూయార్క్ నగరంలో వందలాది బట్టల మిల్లులలో పనిచేసే మహిళలు సమ్మెచేసారు. పని ప్రదేశాలలో సౌకర్యాలు, మెరుగైన వేతనాల పెంపు కోసం, పనిగంటలు తగ్గించాలని అమానవీయ ట్రీట్‌మెంట్‌కు వ్యతిరేకంగా, ఓటు హక్కుకై కదంతొక్కారు. సమ్మె కొనసాగుతున్న కాలంలోనే సంవత్సరం తరువాత మిల్లు పై అంతస్థులను మూసివేసి బయటకు రాకుండా గదులు వేసి కాల్పులు జరిపింది యాజమాన్యం. కాల్పులలో 13-25 సం॥రాల వయసున్న 146 మంది యువతులు చనిపోయారు. చివరికి మహిళల వీరోచిత పోరాటం ముందు కిరాతకమైన యజమానులు తలొగ్గక తప్పలేదు.**

**1857 పోరాటం :**

1857లో ప్రపంచంలో ఎక్కడా జరగనంత తీవ్రమైన పోరాటం మార్చి 8న న్యూయార్క్ నగరంలో వందలాది బట్టల మిల్లులలో పనిచేసే మహిళలు సమ్మెచేసారు. పని ప్రదేశాలలో మెరుగైన సౌకర్యాలు, వేతనాల పెంపు కోసం, పనిగంటలు తగ్గించాలని అమానవీయ చర్యలకు వ్యతిరేకంగా, ఓటుహక్కుకై కదంతొక్కారు. సమ్మె కొనసాగుతున్న కాలంలోనే సంవత్సరం తరువాత మిల్లు పైఅంతస్థులను మూసివేసి కార్మికులు బయటకు రాకుండా గదులు వేసి కాల్పులు జరిపింది యాజమాన్యం. కాల్పులలో 13-25 సం॥రాల వయసున్న 146 మంది యువతులు చనిపోయారు. చివరకు మహిళల వీరోచిత పోరాటం ముందు కిరాతకమైన యజమానులు తలొగ్గక తప్పలేదు. మహిళా కార్మికులతో ఒప్పందాలు కుదుర్చుకున్నారు. బేరసారాలలో, సంఘటిత పోరాటాలలో పురుషులకు ఏమాత్రం తీసిపోమని నిరూపించుకున్నారు. ఈ పోరాటానికి నాయకత్వం వహించిన రోజోష్కిని డెర్మన్ "కార్మికవర్గం తమను తాము బలమైన కార్మిక ఉద్యమం ద్వారా మాత్రమే కాపాడుకోగలరు" అన్నారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవానికి స్ఫూర్తినిచ్చిన ఘటన ఇది.

**1899 అంతర్జాతీయ కార్మిక 2వ మహాసభ :** 1899 జులై 19న పారిస్‌లో జరిగిన అంతర్జాతీయ రెండవ కార్మిక మహాసభలో క్లారా జెట్కిన్ మొదటిసారిగా మహిళల హక్కులపై ప్రసంగించారు. మహిళల పనిహక్కుని, తల్లీ బిడ్డల రక్షణ, జాతీయ, అంతర్జాతీయ కార్యక్రమాలలో మహిళల భాగస్వామ్యం పెంచాలని పిలుపునిచ్చారు.

1900లో అమెరికాలో కుట్టుపని మహిళలు అంతర్జాతీయ బట్టల మిల్లులలో పనిచేసే వారితో యూనియన్‌ని ప్రారంభించారు. బట్టల ఫ్యాక్టరీలలో పనిచేసే చోటు చీకటిగా, ప్రమాదకరమైన పరిస్థితిలో వుండేది. కార్మికులు మాట్లాడకూడదు, నవ్వకూడదు, పాట పాడకూడదు. కుట్టులో తేడా రాకూడదు. అదనపు పని తప్పనిసరి అయినా అదనపు వేతనం లేదు.

1903లో కార్మిక సంఘాలు, స్వతంత్ర మహిళా సంస్థలు మహిళల బాధలు, శ్రామిక మహిళల రాజకీయ, ఆర్థిక హక్కులకోసం ప్రచారం ప్రారంభించారు. 1903లో నేషనల్ ఉమెన్స్ లీగ్ సహాయంతో అనేక వర్గాల శ్రామిక మహిళల సంఘీభావంతో బట్టల మిల్లుల క్రూరమైన ట్రైరక్స్ మరియు ట్రయాంగి వెయిస్ట్ కంపెనీలకు వ్యతిరేకంగా 20,000 మంది వరుసగా అనేక పోరాటాలు సుధీర్ఘ కాలం చేశారు. 16-25 సం॥రాల యువతులు కనబడితే చాలు పోలీసులు అరెస్టు చేసి లాఠీచార్జీ చేసారు

1905-07 మధ్య రష్యాలో శ్రామిక మహిళలు ప్రసూతి సెలవు హక్కుపై బిడ్డకు పాలు ఇవ్వడానికి కొంత టైం ఇవ్వాలని, యాజమాన్యపు లైంగిక వేధింపులు ఆపాలని, వేతనాలు, ఇతర సౌకర్యాల కోసం తీవ్రమైన సమ్మెలు చేశారు.

1907 ఫిబ్రవరి 28న అంతర్జాతీయ మహిళా దినోత్సవానికి స్ఫూర్తినిచ్చిన న్యూయార్క్ నగరంలో అమెరికన్ సోషలిస్టు మహిళలు శ్రామిక వర్గంతో కలసి పోరాటం చేయాలని ప్రచారం చేశారు.

1910లో కోపెన్ హెగెన్‌లో సోషలిస్టు మహిళల 2వ అంతర్జాతీయ మహాసభలో జర్మన్ కార్మిక నాయకురాలు క్లారాజెట్కిన్ మహిళల సమస్యలు, వారి పోరాటాలకు స్ఫూర్తిగా మహిళా దినోత్సవం జరపాలని ప్రతిపాదించారు. సభకు హాజరైన 17 దేశాల ప్రతినిధులు అంగీకారం తెలిపారు. "ప్రపంచ వ్యాప్తంగా మొదటిసారిగా ఫిబ్రవరి 28, 1907లో సదస్సు జరిపారు. ఓటుహక్కు, వేతనాల కొరకు గొడ్డుచాకిరీ చేయించుకునే పద్ధతులకు స్వస్తిచెప్పాలని డిమాండ్ చేశారు.

యునైటెడ్ స్టేట్స్‌లో ఫిబ్రవరి చివరి ఆదివారం మహిళల సమస్యలపై రాజకీయపార్టీలు ప్రదర్శనలు చేయాలని సోషలిస్టు మహిళలు ఒత్తిడి చేశారు. బోల్షివిక్ పార్టీ సభ్యులైన అలెగ్జాండర్ కొల్లంతాయ్, కృపస్కయా, ఇనెస్సా అర్మండ్, క్లావిడానికొలివా వీరంతా శ్రామిక మహిళలు/స్త్రీవాద ఉద్యమాలతో కలిసి పనిచేశారు. రష్యాలో విప్లవం తర్వాత అధికారికంగా అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని సెలవు దినంగా ప్రకటించారు.

1917 అక్టోబరులో కొత్తగా ఏర్పాటైన సోవియట్ ప్రభుత్వం స్త్రీ సమానత్వం కోసం చట్టపరమైన చర్యలు చేపట్టింది. విడాకులు, గర్భ స్రావాన్ని చట్టం పరిధిలోకి తెచ్చి హక్కు కల్పించింది. సనాతన చర్చి పద్ధతిలో వివాహాలను రద్దుచేసి తల్లులు, పిల్లల బాధ్యత వారి సంక్షేమం ప్రభుత్వమే చేపట్టింది. స్త్రీ విముక్తి సాధించాలంటే సాంఘిక, ఆర్థిక స్థితి మారాలి. రష్యన్ ప్రభుత్వం మహిళల సమస్యలపై ప్రత్యేక దృష్టి పెట్టింది. ప్రపంచంలో అనేక దేశాల మహిళా ఉద్యమాలకు దిక్సూచి అయ్యింది.

1960 తర్వాత స్త్రీ వాద మహిళా ఉద్యమాలు ప్రపంచ వ్యాప్తంగా ఊపందుకోవడంతో మహిళల సమస్యలు వెలుగులోకి వచ్చాయి.

1970లో బ్రిటన్‌లో పెద్ద ఎత్తున మహిళా దినోత్సవాన్ని నిర్వహించడంతో మళ్ళీ ప్రపంచవ్యాప్తంగా ప్రాధాన్యత వచ్చింది. 1975 ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో మార్చి- 8న మహిళా దినోత్సవాలు జరపాలని పిలుపునివ్వగా ఆ

నిర్ణయాన్ని 150 దేశాలు బలపరిచాయి. మహిళల సమానత్వం, అభివృద్ధి ద్వారా మానవ హక్కులు అనుభవించే అధికారం దానితోపాటు స్వేచ్ఛ, శాంతి నెలకొంటాయి. స్త్రీలపై జరుగుతున్న అన్ని రకాల వివక్షత. అసమానతలను తొలగిస్తామని వివిధ దేశాలు ప్రకటన చేశాయి.

మహిళలు రాజకీయ పోరాటాల ద్వారా జాతి వివక్షత, వలస వాదం, బహుభార్యత్వం, ఇతర రూపాలలో వున్న అణచివేతలకు వ్యతిరేకంగా, ఆర్థిక సమానత్వం కోసం చేసే పోరాటాలు అంతర్జాతీయ పోరాటానికి స్ఫూర్తిగా నిలిచింది. 1985లో నాల్గవ ప్రపంచ సదస్సు ఆ దశాబ్దాన్ని మహిళా దశాబ్దంగా ప్రకటించింది.

1995 బీజింగ్‌లో మొదటిసారిగా 189 దేశాల ప్రతినిధులతో సదస్సు జరిగింది. సదస్సులో మహిళా సమస్యలు, అసమానతలు, ఆటంకాల గురించి తీసుకోవల్సిన చర్యల గురించి చర్చించింది. మహిళా ఉద్యమాలను ఉధృతం చేయాలని తీర్మానించింది. మహిళా సంఘాలు బీజింగ్ సదస్సులో మహిళా సమస్యలపై పెట్టిన తీర్మానానికి అనుకూలంగా భారత ప్రభుత్వ అధికారులు సమస్యల పరిష్కారానికి కృషి చేస్తామని సంతకం చేశారు..

1990 దశకం నుండే ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలు అమలు చేయటం వలన స్త్రీలు, దళిత, గిరిజన, వెనకబడి తరగతులు వీటి ప్రభావానికి తీవ్రంగా గురవుతున్నారు. ఈవిధానాలు నిరుద్యోగం, అభద్రత, వేతనాల తరుగుదల, ధరలపెరుగుదలకు దారితీస్తున్నాయి. ఈకాలంలో ప్రజలు మరింత దైన్య స్థితిలోకి నెట్టబడుతున్నారు. విద్య, వైద్యం,బాలల సంరక్షణ, రవాణా వంటివి ప్రైవేటీకరించబడుతున్నాయి. పేదలకు ఇచ్చే సంక్షేమ పథకాలలో కోత పెట్టడం వలన పేదలకు ఆహార భద్రత, ఇతర సేవలు నిరాకరించబడుతున్నాయి.

**తిరోగమన చర్యలు:** నూతనంగా ఏర్పాటైన బి.జె.పి ప్రభుత్వం మత ఛాందస వాదంతో మత ఉద్రిక్తతలు రెచ్చగొడుతున్నది. లౌకిక

***1992, 73వ రాజ్యాంగ సవరణ ద్వారా స్థానిక సంస్థలలో 33.3 శాతం నుండి నేడు 50 శాతం రిజర్వేషన్లు అమలు చేయటం వలన దాదాపు 14 లక్షల మంది మహిళలు పాలనా నిర్వహణలో ఉంటున్నారు. అయినా ఈనాటికీ పితృస్వామ్య భావజాలంతో ఇంటి సంరక్షణ బాధ్యత ఎవరు చూస్తారనే ప్రశ్న ఉదయిస్తున్నది. లక్షల మంది స్త్రీలు ప్రజాప్రతినిధులుగా ఆదేశాలు యివ్వడం, పాలనా వ్యవహారాలను పర్యవేక్షించడం చేస్తున్నారు. వీరిని డమ్మీలుగా వుంచి తెర వెనుక మగవాడే అధికారం చెలాయించే పరిస్థితి నేటికీ వుంది. విధాన నిర్ణయాలలో మహిళలకు రాజకీయ అధికారంలో వాటా పెంచాలని 1996 నుండి మహిళా సంఘాలు ఆందోళనలు నిర్వహిస్తున్నా మహిళా బిల్లు 19 సంవత్సరాలుగా పెండింగులో వుంది.***

సూత్రాలకే ముప్పు తెస్తోంది. నేడు భారతీయ సమాజంలో సంస్కృతి, సాంప్రదాయం పేరిట తిరోగమన విధానాలకు పెద్ద పీట వేయటం జరుగుతుంది. ఆడపిల్లల వస్త్రధారణపైన ఆంక్షలు పెడుతున్నారు. బయటకు ఎందుకు రావాలని ప్రశ్నిస్తున్నారు. కులాంతర వివాహాలు చేసుకున్న అమ్మాయిలను పరువు హత్యలు చేస్తున్నారు. ఇంటిని చక్కదిద్దుకోవాల్సిన మహిళలు ఉద్యోగాల పేరుతో బయటకు రావడమే అత్యాచారాలకు కారణమని ఆర్థిక స్వాతంత్ర్యాన్ని హరించేయత్నం జరుగుతుంది. నలుగురు పిల్లల్ని కనాలి, పదిమంది పిల్లల్ని కనాలి అంటూ స్త్రీలను వ్యక్తులుగా గాక యంత్రాలుగా ఆదేశాలిస్తున్నారు. లవ్‌జిహాద్ పేరిట ముస్లిం వ్యతిరేకతను నూరి పోస్తున్నారు.

**మహిళా రిజర్వేషన్ :** 1992, 73వ రాజ్యాంగ సవరణ ద్వారా స్థానిక సంస్థలలో 33.3 శాతం నుండి నేడు 50 శాతం రిజర్వేషన్లు అమలు చేయటం వలన దాదాపు 14 లక్షల మంది మహిళలు పాలనా నిర్వహణలో ఉంటున్నారు. అయినా ఈనాటికీ పితృస్వామ్య భావజాలంతో ఇంటి సంరక్షణ బాధ్యత ఎవరు చూస్తారనే ప్రశ్న ఉదయిస్తున్నది. లక్షల మంది స్త్రీలు ప్రజాప్రతినిధులుగా ఆదేశాలు యివ్వడం, పాలనా వ్యవహారాలను పర్యవేక్షించడం చేస్తున్నారు. వీరిని డమ్మీలుగా వుంచి తెర వెనుక మగవాడే అధికారం చెలాయించే పరిస్థితి నేటికీ వుంది. విధాన నిర్ణయాలలో మహిళలకు రాజకీయ అధికారంలో వాటా పెంచాలని 1996 నుండి మహిళా సంఘాలు ఆందోళనలు నిర్వహిస్తున్నా మహిళా బిల్లు 19 సంవత్సరాలుగా పెండింగులో వుంది.

ఇంత సుదీర్ఘకాలం పెండింగులో వున్న బిల్లు ఇదొక్కటేనేమో. 15వ లోక్‌సభలో మహిళా ప్రాతినిధ్యం 543 మందిలో 61 (11 శాతం) కాగా, రాజ్యసభలో 240కి 20 మంది (10 శాతం) మాత్రమే. రాజ్యసభలో 2010లో బిల్లు ఆమోదం పొందినా లోక్‌సభలో మహిళా బిల్లు ప్రవేశపెట్టక పోవడం మహిళా హక్కుల పట్ల పాలకపార్టీల కపటవైఖరి స్పష్టమవుతున్నది. మన కన్నా ఆఫ్రికాదేశాలలో రువాండా, ఉగాండా, సూడాన్, టంజానియాలలో మహిళల పాత్ర ఎక్కువగా వుంది. ప్రపంచంలో రువాండా అగ్రస్థానంలో నిలువగా అతిపెద్ద ప్రజాస్వామ్యం అని గొప్పలు చెప్పే మన దేశం 105వ స్థానంలో వుంది.

**అసంఘటిత రంగం :** పాలకులు నిత్యం మహిళా సాధికారిత గురించి ప్రసంగిస్తారు. సరళీకరణ విధానాలు అమలు తర్వాత అసంఘటిత రంగంలో పనిచేసే మహిళా కార్మికులు 94% పైగా ఉన్నారు. వీరికి ఉద్యోగ భద్రతగానీ, కనీస చట్టాలు, ప్రసూతి సెలవులు, వేతనాలు వంటి హక్కులు లేవు. ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలు వీరి శ్రమను కారుచౌకగా కొల్లగొడుతున్నారు. 36% మహిళా ఉద్యోగులున్న ఐటీ తదితర సర్వీసులలో ఉద్యోగాల కోత పడుతున్నది. జీతాలు భారీగా తగ్గిస్తున్నారు. ఎగుమతులు లేక చిన్న పెద్ద పరిశ్రమలలో ఉత్పత్తి ఆగిపోయింది. అనేక పరిశ్రమలు కార్మికులకు ఉద్వాసన పలుకుతున్నాయి. రియల్ ఎస్టేట్ రంగం తిరోగమనంలో

పడటంతో భవన నిర్మాణంలో పనిచేస్తున్న వేలాది మహిళా కార్మికులకు ఉపాధి తగ్గింది. గ్రానైట్, పలకల పరిశ్రమ, టెక్స్‌టైల్, రవాణా, స్టీల్ మొదలైన రంగాలు సంక్షోభాలెదుర్కొంటున్నాయి. అన్ని రంగాలలో గణనీయ సంఖ్యలో ఉద్యోగాలు కోల్పోతున్నది మహిళలే. కుటుంబం కోసం మహిళలు గృహకార్మికులుగా, హెల్త్ వర్కర్లు, అంగన్వాడి, ఆశ, మిడ్డేమీల్స్, హాస్పటల్స్, పారిశుధ్య కార్మికులు, బీడి, లేసు వర్కర్లుగా అతి తక్కువ వేతనాలతో పనిచేస్తున్నారు. సరళీకరణ విధానాల వలన ధనికులు-పేదల మధ్య వ్యత్యాసాలు పెరుగుతున్నాయి. భూమి, నీరు అడవులు వంటి సహజ వనరులు విధ్వంసానికి గురవుతున్నాయి. కార్మిక హక్కుల ఉపసంహరణ జరుగుతున్నది. దిగుమతులు, సబ్సిడీల కోతల వలన వ్యవసాయం, చిన్న పరిశ్రమలు కుప్పకూలుతున్నాయి. బహుళజాతి కంపెనీలకు ప్రభుత్వాలు దాసోహమంటున్నాయి. కార్మిక హక్కులపై దాడి తీవ్రమైంది. చట్టాల ఉల్లంఘన జరుగుతోంది.

శ్రమ దోపిడీతోపాటు లైంగిక వేధింపులకు గురవుతున్నారు. ఇంటా బయటా మహిళలపై వేధింపులు పెరిగాయి. మహిళలపై జరుగుతున్న నేరాలలో దేశంలో మన రాష్ట్రం రెండవ స్థానంలో ఉంది. పోరాడి సాధించుకున్న లైంగిక వేధింపుల చట్టం కాగితాలకే పరిమితమైంది. తప్పని సరిగా ప్రతి సంస్థలో మహిళలపై వేధింపులకు సంబంధించి కమిటీలు వేయాలని ఈచట్టంలో పొందుపరచబడింది. మహిళలు, బాలికలపైనా, బలహీన వర్గాల పైనా హింస పెరగడం వంటి ఘటనలు పెరుగుతున్నాయి.

సరళీకరణ విధానాలు అమలు తర్వాత అసంఘటితరంగంలోను, స్వయం ఉపాధి కార్మికులుగా, అస్థిరమైన పనులలోనూ మహిళలు పని చేస్తున్నారు. మన దేశంలోని సామాజిక పరిస్థితులపై ఆర్థిక సంక్షోభ ప్రభావం లెక్కల్లో చూపిన దాని కంటే తీవ్రంగా వుంది. సంక్షోభ ప్రభావం మహిళల సామాజిక, ఆర్థిక జీవనంపై ప్రభావం పడుతున్నది. మహిళలు సంఘటితమై యూనియన్లు ఏర్పరుచుకోవడం తక్కువ కనుక వారు సులభంగా ఉద్యోగాల నుండి తొలగించబడుతున్నారు. శ్రామిక మహిళలపైనే గాక ఏ వేతనం లేకుండా ఇంటి పనులు చేసే మహిళలపై కూడా సంక్షోభ ప్రభావం పడుతున్నది. పెరుగుతున్న ధరలతో పోటీ పడలేక మహిళలు తాము తీసుకునే ఆహారం తగ్గించుకోవాల్సివస్తోంది. కుటుంబ భారం మోసే మహిళలు తమ శరీరాలు వైద్య ప్రయోగాలకు మరియు గర్భాన్ని అద్దెకి (సరోగసీ) యివ్వడం వంటి చర్యలకు పాల్పడుతున్నారు. సంక్షోభ ఫలితాలు ప్రజలందరిపై ఒకే విధంగా లేదు. బాలికలు, మహిళలపై ఈప్రభావం అధికంగా వుంది. ఆర్థిక రంగం అభివృద్ధి పథంలో వున్నపుడు కూడా దాని ఫలితాలను చివరగా అందుకునే పేద వర్గాలు అది సంక్షోభంలో ఉన్నపుడు మాత్రం తీవ్రమైన చేదు ఫలితాలను ముందుగా చవిచూడాల్సి వస్తోంది. వేతనాలలో కోతలు, ఉపాధి అవకాశాలు లేకపోవటం సంక్షేమ పథకాల కోత, నిత్యావసర వస్తువుల కుదింపు, పౌర సేవలు కోల్పోవటం వంటి సమస్యలను ఎదుర్కొంటున్నారు. ఇతర సామాజిక, ఆర్థిక అంశాలకు లింగ వివక్షత కూడా తోడవటంతో ఆయా ప్రాంతాలు, వర్గాలు, వృత్తులను బట్టి కూడా మహిళలు నిర్లక్ష్యం చేయబడుతున్నారు.

మార్చి8 సందర్భంగా మహిళలు సాధించుకున్న హక్కులను రక్షించుకునేందుకు కలిసి ఉద్యమించాలి. లైంగిక వేధింపులు అరికట్టేందుకు అన్నిరకాల చర్యలు చేపట్టాలి. ఫాస్టు ట్రాక్ కోర్టులు ఏర్పాటు చేసి మహిళలపై జరుగుతున్న నేరాలను త్వరితగతిన విచారించాలి. నేరస్తులను శిక్షించాలి. మహిళలు పనిచేసే అన్నిచోట్ల మహిళా ఫిర్యాదు కమిటీలు ఏర్పాటు చేయాలి. కుల, మత వివక్షతలతో సాగే దాడులు, హత్యలను అరికట్టాలి. ఆడపిల్లలకు అన్ని స్థాయిలలో ఉచిత విద్య అందించాలి. ఉపాధి సదుపాయాలు మెరుగుపర్చాలి. ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలను మెరుగుపర్చి నాణ్యమైన వైద్య సదుపాయాలు అందుబాటులోకి తేవాలి. ఆడపిల్లలపై ఆంక్షలు పెట్టడాన్ని ప్రతిఘటించాలి. ఎంపిక హక్కును గుర్తించాలి. స్కీము వర్కర్లకు కనీసవేతనాలు అమలు పరచాలి. పాఠశాలలు, అంగన్‌వాడీ కేంద్రాలు, బహిరంగ కూడళ్ళలో మరుగుదొడ్ల నిర్మాణం చేపట్టాలి. గ్యాస్ సిలిండర్లు, నిత్యావసర వస్తువులపై మార్కెట్ నియంత్రణ కొనసాగాలి. సబ్సిడీల కుదింపును ప్రతిఘటించాలి.

ఈ కాలంలో పురుషులతో సమానంగా అన్ని రంగాల్లో ఊహించనంతగా మహిళలు ఎదిగారు. విద్య, సమాజం పట్ల అవగాహన పెరిగింది. చట్టాల్లో సమాన హక్కులు కల్పించబడ్డాయి. ఎన్నో నిర్బంధాలు, అణచివేతలను ఎదుర్కొని వీరోచిత ఉద్యమాలు నడిపారు. కదన రంగంలో ఎంతోమంది అసువులు బాసారు. అలాంటి పోరాట స్ఫూర్తిని రగిల్చిన మార్చి-8 మహిళా దినోత్సవం కూడా మార్కెట్ శక్తులకు కాసులు కురిపించే కార్యక్రమంగా మారుతోంది. శ్రామిక మహిళలు, మహిళా సమస్యలపై దృష్టి పెట్టకుండా సంబరాలు జరుపుకునే దినంగా మార్చి-8వ తేదీని ప్రభుత్వాలు మారుస్తున్నాయి. కార్మిక వర్గ స్ఫూర్తిని దెబ్బ తీయాలని ప్రయత్నించినా అంతే వేగంతో ఉద్యమాలు తీవ్రం అవుతున్నాయి. ఉద్యమాల్లో అలాంటి పోరాట స్ఫూర్తిని రగిల్చిన మార్చి-8 మహిళా దినోత్సవం ఫ్యాషన్ షోలు, పెరేడ్‌లు, కానుకలు, ఒక్క రోజు సంబరమూ కాదు. వ్యాపారాలకు ప్రచారపు రోజు అంతకన్నా కాదు. ఫ్యూడల్ ఆలోచనలతో వున్న వర్గ సమాజపు మూలాలను కదిలించి కార్మిక వర్గ పోరాటాలను ముందుకు తీసుకు వెళ్ళి సమ సమాజ స్థాపనకై జరిగిన సుదీర్ఘ పోరాటం. స్త్రీ స్వేచ్ఛ, సమానత్వం పొందే వరకు దోపిడీ, పీడన పేద, ధనిక అసమానతలు అంతం అయ్యేవరకూ ఈ పోరాటం కొనసాగుతుంది. శ్రామిక మహిళల సమస్యలపై సంఘటిత పోరాటాలు ఉధృతం కావాలి. ●

ధీర

# క్రికెట్ బ్యాట్ పట్టిన ఆఫ్ఘాన్ మహిళ

- వేములపల్లి సత్యవతి



**ఈ** రోజుల్లో యువతులు - మహిళలు ప్రవేశించని రంగం అంటూ ఏదీలేదు. దేశ రక్షణకు ఏర్పడిన ఆర్మీ త్రివిధ దళాలలో కూడా యువతులు ప్రవేశిస్తున్నారు. అత్యంత కష్టసాధ్యమైన సరిహద్దు భద్రతా దళాలలో కూడా మహిళలు పని చేస్తున్నారు. 2015 జనవరి 26న జరిగిన గణతంత్ర దినోత్సవాలలో త్రివిధ దళాల మహిళలు ఢిల్లీ పరేడ్‌లో పాల్గొని తమ సత్తా చాటారు.

అన్ని రంగాలలో క్రీడారంగం ఒకటి. క్రీడలలో (ఆటలలో) అనేక రకాలున్నాయి. వాలీబాల్, ఫుట్‌బాల్, హాకీ, కబడ్డీ, మారథాన్, స్కేటింగ్, బాక్సింగ్ (మల్లయుద్ధం), చదరంగం, ఈత పోటీలు మొదలగునవి. యువతులు జాతీయ, అంతర్జాతీయ క్రీడలలో పాల్గొని విజయకేతనం ఎగురవేశారు. మనదేశంలో క్రీడారంగంలో ప్రవేశించినది కేరళకు చెందిన పి.టి ఉష ఆద్యురాలు. ఆ తర్వాత వివిధ క్రీడలలో సైనా నెహ్వాల్, సానియామీర్జా, కోనేరుహంపి, గుత్తాజ్వాల, సింధు, కరణం మల్లీశ్వరీ మొదలగువారు స్వర్ణ, రజిత, కాంస్య పతకాలు పొందారు. ఈశాన్య రాష్ట్రాలకు చెందిన మేరీకోమ్ బాక్సింగ్‌లో పాల్గొన్న ఏకైక మహిళ. పతకాలు సాధించి భారత పతాకాన్ని ప్రపంచ పటంలో స్థానం సంపాదించింది. ఇన్ని రకాల ఆటలలో క్రికెట్‌కున్న క్రేజ్ ప్రత్యేకమని చెప్పక తప్పదు. గల్లీలలో బాలురు మూడు కర్రలు పాతి క్రికెట్ ఆడటం మనమంతా చూస్తున్నదే కదా! ఇదంతా నాణేనికి ఒకవైపున మాత్రమే. రెండోవైపు సూర్యరశ్మి కూడా శరీరానికి సోకకుండా ఆపాదమస్తకం నల్లని బురఖాలో మగ్గుతున్న మహిళా లోకం వున్నది.

బురదగుంటలో కమలం వికసించినట్లుగా పరదా ముసుగులోనుండి బయటకు వచ్చిన ఆణిముత్యాల్లాంటి మహిళలు ఉన్నారు. ఆలాంటి వారిలో దయానా 'బరక్‌జాయ్' ఒకరు. మేరు నగధీరురాలు. దయానా ఆఫ్ఘాన్‌లో క్రికెట్‌బ్యాట్ పట్టుకుని మైదానంలోనికి అడుగిడింది. ఆమెకు చాలా కాలంనుంచి ఆఫ్ఘాన్ మహిళల క్రికెట్ టీమ్‌ని తయారు చేసి జాతీయ ,అంతర్జాతీయ క్రికెట్ పోటీలలో పాల్గొనాలని బలీయమైన కోరిక వుంది. తన సంకల్పాన్ని సాకారం చేసుకోవటానికి మహిళల క్రికెట్ టీమ్‌ను తయారు చేసింది. 2011లో కువైట్‌లో జరిగిన 20-20 క్రికెట్ మ్యాచ్ టీమ్‌కు నాయకత్వం చేపట్టింది. ప్రపంచాన్నంతా ఇస్లామిక్ చేయాలన్న ఉగ్రవాదులలో ప్రధములు తాలిబన్లు. వాళ్ల చెరలో కొన్నాళ్లు ఆఫ్ఘాన్ చిక్కుకుంది. తర్వాత విముక్తి చెందింది. విముక్తి పొందిన తర్వాత బాలికలు బడులకు వెళ్లి చదువు కుంటున్నారు. మహిళలు పూర్వం తాము చేసిన ఉద్యోగాలలో చేరి పని చేస్తున్నారు. దయానా తన టీమ్‌తో కువైట్ వెళ్లటానికి సిద్ధమయింది. వీటిని తాలిబన్లు సహించలేక పోతున్నారు. వెంటనే తాలిబన్లనుంచి బెదిరింపులు, హెచ్చరికలు దయానాకు చేరినవి. ఖబడ్దార్ ! దానిలో పాల్గొంటే ప్రాణాల మీద ఆశ వదులుకోమని, అంతం చేస్తామని వార్తలందినవి. విధిలేక తాత్కాలికంగా కువైట్ వెళ్ళడం వాయిదా వేసుకుంది. క్రికెట్ కల దయానా మనసు నుంచి చెరిగిపోలేదు. కొత్తకొత్త మహిళా క్రికెటర్లను తయారు చేయటం మొదలు పెట్టింది. తన మాతృదేశంలోని బడులలో క్రికెట్ ఆడే బాలికలు పెద్దవారయ్యాక పెద్దపెద్ద పేరుమోసిన స్టేడియంలలో ఆడేరోజులు రావాలని ఆశిస్తున్నది. ఇప్పటికి ఆమె ఆఫ్ఘాన్‌లో 3700 మంది మహిళా క్రికెటర్లను తయారుచేసింది.

**బురదగుంటలో కమలం వికసించినట్లుగా పరదా ముసుగులోనుండి బయటకు వచ్చిన ఆణిముత్యాల్లాంటి మహిళలు ఉన్నారు. ఆలాంటి వారిలో దయానా 'బరక్‌జాయ్' ఒకరు. మేరు నగధీరురాలు. దయానా ఆఫ్ఘాన్‌లో క్రికెట్‌బ్యాట్ పట్టుకుని మైదానంలోనికి అడుగిడింది. ఆమెకు చాలా కాలంనుంచి ఆఫ్ఘాన్ మహిళల క్రికెట్ టీమ్‌ని తయారు చేసి జాతీయ ,అంతర్జాతీయ క్రికెట్ పోటీలలో పాల్గొనాలని బలీయమైన కోరిక వుంది. తన సంకల్పాన్ని సాకారం చేసుకోవటానికి మహిళల క్రికెట్ టీమ్‌ను తయారు చేసింది. 2011లో కువైట్‌లో జరిగిన 20-20 క్రికెట్ మ్యాచ్‌లో పాల్గొనేందుకు టీమ్‌కు నాయకత్వం చేపట్టింది.**

దయానా పాకిస్తాన్‌లో ఉన్నప్పుడు క్రికెట్ బ్యాట్ చేతపట్టింది. పట్టుదలతో శ్రమించి ఆ క్రీడలో నిష్ణాతురాలయింది. తన మాతృదేశానికి వచ్చి మహిళా క్రికెట్ టీమ్ తయారు చేసి పోటీలలో పాల్గొని మాతృదేశపు ఖ్యాతిని ప్రపంచానికి చాటాలని ఉవ్విళ్లూరింది. తాలిబన్ల భయంకర బీభత్సకాండను కళ్లారా కాంచుతూ, పత్రికల్లో వింటూ తన నిర్ణయాన్ని తాత్కాలికంగా మానుకుంది. ఆఫ్ఘాన్ పార్లమెంటరీ ఎన్నికల సమయంలో క్రికెట్ బ్యాట్ చేతబూని స్టేడియంలోనికి అడుగుపెట్టింది. ఆమె పెట్టిన అడుగు విజయ పథంలోకి నడవాలని మనమందరం కోరుకుందాము. ●

## సీరియల్ వర్జీనియా సమ్మె మరో అమ్మ (మేరీజోన్స్ ఆత్మకథ)



నేను 1891లో వర్జీనియాకు వెళ్ళాను. డైట్జ్ మైన్స్‌లో సమ్మె జరిగింది. సమ్మెలోవున్న కార్మికులు నా సహాయం కోరితే వెళ్ళాను. నార్టన్‌లో ట్రైన్ దిగిన తరువాత నా దగ్గరికి ఒకవ్యక్తి వచ్చి "మీరేనా మదర్‌జోన్స్" అని అడిగాడు.

అవునని బదులిచ్చాను.

అతను చాలా భయపడ్డాడు. 'మీరు ఇక్కడికి వస్తే మీతల బద్దలు కొట్టిస్తానని సూపరింటెండెంట్ హెచ్చరించాడు' అని చెప్పాడు.

నేను 'సూపరింటెండెంట్'ను చూడడానికి రాలేదు. మైనింగ్ కార్మికులను కలవడానికి వచ్చానని మీ సూపరింటెండెంట్‌కు చెప్పు' అని ధైర్యం చెప్పాను.అంతలోనే మాదగ్గరికి ఒక బక్కచిక్కిన కార్మికుడు వచ్చాడు. ఆ పక్కనే వున్న వ్యాగన్లను చూపిస్తూ 'అమ్మా! మీరు ప్రక్కనే వున్న వ్యాగన్లను చూశారా? అని అడిగాడు. ఆ వ్యాగన్లు బొగ్గుతో నిండివున్నాయి.

ఈ వ్యాగన్లను బొగ్గుతో నింపేందుకు కంపెనీతో కాంట్రాక్టు కుదుర్చుకున్నామనీ, తరువాత వ్యాగన్ల కింద మరొక అరను తయారు చేసిపెట్టి అదనంగా మరింత బొగ్గు నింపమని కంపెనీ ఒత్తిడి తెచ్చిందని చెప్పాడు.

"నా జీవితమంతా ఈ కంపెనీ కోసం ధారపోశాను. చివరికి ఇలా జీర్ణావస్థకు చేరాను." అని వాపోయాడు.

మాకు మీటింగ్ పెట్టుకోవడానికి హాలు దొరకలేదు. హాలు అద్దెకు ఇవ్వడానికి కూడా ఎవరికీ ధైర్యం చాలలేదు. చివరికి నల్లజాతివారు వారి చర్చిలో మీటింగు పెట్టుకోవడానికి అంగీకరించారు. ఇక మీటింగు మొదలవుతుందనగా వాళ్ళ చైర్మన్ వచ్చి మీటింగ్ జరపొద్దని, చర్చి వున్న స్థలం కంపెనీవాళ్ళు ఇచ్చిందని, మీటింగు జరిపితే స్థలం వెనక్కి తీసుకుంటామని యాజమాన్యం బెదిరించిందని చెప్పాడు.

నావల్ల పేదలు చర్చి స్థలాన్ని పోగొట్టుకోవడం ఇష్టంలేక నేనే సమావేశస్థలాన్ని నాలుగు రోడ్ల జంక్షన్‌కు మార్చాను. మీటింగ్ అయిన తరువాత ప్రజలు చెదిరిపోయారు. నాతో పనిచేస్తున్న డూడ్‌హడోను నాతోపాటు పోస్టాఫీసు దాకా రమ్మన్నాను. అతను లోవా నుండి వచ్చాడు. కొంచెం ఆందోళన పడుతూనే నాతో రావడానికి అంగీకరించాడు.

మేము రోడ్డు మీద నడుస్తున్నాము. 'మీ దగ్గర పిస్టల్ వుందా?' అని అతన్ని అడిగాను.

ఉందన్నాడు. 'మీకు హానీ జరగనివ్వను మిమ్మల్ని కాపాడుకుంటాను' అని స్థిరంగా చెప్పాడు. ఈ రకంగా ఆయుధాలు దాచిపెట్టుకోవడం చట్టవ్యతిరేకమని సున్నితంగా చెప్పాను. పిస్టల్‌ని కనిపించేటట్టు పెట్టుకోమన్నాను.

అంతలోనే రోడ్డు ప్రక్కనున్న ఒక పురాతన కొట్టం నుండి 8-10 మంది గన్‌మెన్‌లు అతనిమీదకు లంఘించి, 'దొరికావురా దగుల్బాజీ నాయకుడా' అంటూ ఒడిసి పట్టుకున్నారు. అక్కడినుండి దగ్గరలో వున్న పట్టణానికి మమ్మల్ని తీసుకుపోయి పబ్లిక్ నోటరీ దగ్గర విచారణ మొదలు పెట్టారు. అప్పటికే మేము అలసిపోయి వున్నాము. అప్పటికే అక్కడ ఆరితేరిన హంతకులున్నారు.

జనరల్ మేనేజర్ లోపలికి వచ్చాడు. వస్తూనే 'మదర్ జోన్స్, నాకు ఆశ్చర్యంగా ఉంది' అన్నాడు. ఎందుకని నేను అడిగాను. 'పిస్టల్ చేతపట్టిన మనిషితో కలిసి మీరు దేవునిదగ్గరికి వెళ్తూ ఉండడం వింతగా ఉంది' అన్నాడు.

"అది దేవాలయం కాదు. బొగ్గు కంపెనీ ఇల్లు. నీకు తెలీదా, సర్వశక్తిమంతుడైన ఆ భగవంతుడు ఇలాంటి చోటుకి ఎన్నడూ రాడ"ని నేను సమాధానం చెప్పాను.

అతను నవ్వాడు. సరే, కుక్కలూ నవ్వాయి. అతను జనరల్ మేనేజర్ కదా ! నా మీద వున్న ఆరోపణలు కొట్టివేయబడ్డాయి. కానీ పాపం డూడ్‌కి మాత్రం 25 డాలర్లు జరిమానా వేశారు. నేను ఆ డబ్బులు చెల్లిస్తాననే సరికి వాళ్ళు ఆశ్చర్యపోయారు. నా దగ్గర సరిపడా డబ్బులు వున్నాయి.

నేను ఒక గని కార్మికుని ఇంటికి వెళ్ళి, అతని భార్యను టీ ఇమ్మని కోరాను. సాధారణంగా గని కంపెనీవాళ్ళ సొంత పట్టణాల్లో పూటకూళ్ళవాళ్ళు నాకు తిండి పెట్టడానికి కూడా భయపడతారు. కానీ ఆవిడ మాత్రం నేను అక్కడున్నందుకు సంతోషించింది.

ఈ విచారణ జరుగుతున్న సమయంలో అక్కడున్న ఒక వ్యక్తి గని కార్మికుని ఇంటిదాకా నాకు తోడు వచ్చాడు. మొదట గని కార్మికుని భార్య అతన్ని లోపలికి రానివ్వలేదు. అతను నాతో వ్యక్తిగతంగా మాట్లాడాలని చెప్పిన తరువాత లోపలికి రానిచ్చింది. అతను అమ్మా! అని సంబోధిస్తూ మాట్లాడాడు. 'మీరు త్వరగా ఫైన్ కట్టడం చాల మంచిదయిందమ్మా. మీరు ఫైన్ కట్టకుండా కేసు అప్పీలుకు వెళ్తారని వాళ్ళు భావించారు. అలా జరిగితే మీ ఇద్దర్ని అరెస్టు చేసి గదిలో బంధించి ఆ రాత్రి కోక్ ఓవెన్‌లో వేసి కాల్చేయాలని ప్లాను వేశారు. తెల్లవారేసరికి మీరు కనిపించకపోతే, మీరు ఎక్కడికి వెళ్ళారో తెలీదని కట్టుకథలు అల్లి చెప్పవచ్చనుకున్నారు' అని తనకు తెలిసిన ఈ దారుణం వివరించాడు.

నిజంగా ఇలా చెయ్యాలని వాళ్ళు పథకాలు వేసారో లేదో నాకు తెలీదు. కానీ కార్మికులను బానిసత్వంలో బంధించి వుంచడానికి వాళ్ళకున్న అధికారాలకు హద్దులేవనే కఠోర సత్యం మాత్రం అర్థమైంది. ●

**సశేషం.**

కథ

# మూడు ముళ్ళూ- ఒక హృదయం

- కొండేపూడి నిర్మల

కనక దుర్గ పౌడ(్రాసుకుని, మల్లెపూలు పెట్టుకుని ముస్తాబై గుమ్మంలో నుంచుంది.

ఆ కుర్రాడు ఇటే చూస్తున్నాడు. బండి చెడిపోయిందేమో, ఈడ్చుకుంటూ పోతున్నాడు. చూపు బండి మీద లేదు. దుర్గ మీద వుంది.

దుర్గ విషాదంగా నవ్వింది. ఎందుకంటే ఆ కుర్రాడు తన అందం వంక అందరిలా ఆసక్తిగా చూడలేదు. అనుమానంగా చూసినట్టనిపించింది. అలా చూసినందుకు మనసు చివుక్కుమంది.

"ఒక్క నిమిషం ఆగండి.." గుమ్మం దాటి వచ్చి అతని వెంట నడిచి అడిగింది.

ఆగాడు, ఆశ్చర్యంగా చూశాడు.

ఎందుకలా చూస్తున్నావని అడిగితే బావుండదని, ".. నల్లా ఎప్పుడు బాగు చేస్తారు? నీళ్ళు బైటినుంచి తెచ్చుకోలేక అవస్త పడుతున్నా..." అంది.

"నల్లా ఏమిటి, మీరు నన్ను చూసి ఎవరో అనుకున్నట్టున్నారు." అన్నాడు.

"అయితే మీరు సూర్యారావు గారబ్బాయి కాదా ?" అంది.

"సూర్యారావెవరు?.." తెల్లబోయాడు.

"ఇంటి ఓనరు.." అంది చిరాగ్గా...

"ఏ ఇంటి ఓనరు..." మతిపోయినట్టు చూశాడు.

కనక దుర్గకి కావలిసింది అదే.... తుప్పు వదిలి పోయింది వేధవకి అనుకుని, అప్పుడు అంది తాపీగా,

"సరెలెండి... సూర్యారావుగారబ్బాయి... గోవిందరావు లా కనిపిస్తేనూ"

ఆ అబ్బాయి ఆగలేదు. చక చక బండి తోసుకుంటూ వెళ్ళిపోయాడు.

దుర్గ లోపలికి వెళ్ళి అద్దంలో చూసుకుని అనుకుంది, బానె వున్నానే.. మరి వాడెందుకని అలా అనుమానంగా చూశాడు. తెలిసిపోతోందా..? హయ్యో అనుకుని కూలబడింది. పమిట కొంగుతో చెమట తుడుచుకుని మళ్ళీ గుమ్మం కనిపించేలా లోపలి అరుగు మీద కూచుంది. ఈ మధ్య ఎందుకో చెమట బాగా పడుతోంది.

ఒకప్పుడు తన ఊరి గుమ్మంలో ఇదే పౌడరు రాసుకుని, మల్లె పూలు పెట్టుకుని భర్తకోసం ఎదురుచూసేది. క్యాంపులు.. క్యాంపులు అంటూ వూళ్ళమ్మట తిరిగి నెలకోసారి దర్శనం ఇచ్చే ఆ భర్త ఇప్పుడు అసలే కనిపించడు.. గతించి ఏడాదయింది.. కాబట్టి అతని కోసం తను ఎదురు చూడక్కర్లేదు. చూస్తే గీస్తే చావు కోసమే ఎదురు చూడాలిట, అత్తగారు చెప్పింది..

ఒకే రోగంతో కొడుకు అంత చప్పున పోవడమూ, కోడలు ఇంకా ఆరోగ్యంగా వుండటం ఆవిడకి చాలా కష్టంగా వుంది... సాయంత్రమయే సరికి పనంతా పూర్తి చేసుకుని, స్నానం చేసి, తెల్ల చీర కట్టుకుని, మల్లె పూలు పెట్టుకుని గుమ్మంలో నుంచునే అలవాటుకి నాలుగేళ్ళుగా శరీరం కట్టుబడిపోయింది. కనక దుర్గ కి ఎదురు చూడ్డమంటే ఎందుకో ఇష్టం అంతే. ఎదురు చూపులో ఆశ వుంది. అవమానం లేదు. ఫలితంలో నిరాశ వుండొచ్చు.

"ఎందుకా నుంచోవడం ? మొగుడే లేకపోయాక మల్లె పూలేమిటి?... చి.. ఛీ .. హవ్వ.. మన వల్ల కాదు.. ఇది పరువు సమస్య.. " అంటూ ఇంట్లో చాలా గలాటా కూడా అయింది. మొగుడిమీద ఏ మాత్రం ప్రేమ లేని ఆడది కాబట్టే అలా ఏమీ జరగనట్టు వుండగలుగుతోంది అనుకున్నారు. మరి అలాంటి దాని పోషణ ఎవరు చూస్తారు? ఆస్తి ఎందుకిస్తారు?. పొమ్మందామా.. అనుకున్నారు, అనుకున్న ఆర్నెల్లకే ఏ కుట్రా బైట పడకుండా పకడ్బందీగా పంపేశారు. రెండేళ్ళ వైవాహిక జీవితంలో పెంచుకున్న అనుబంధం ముక్కలై పోయినా, తెంచుకోలేని అలవాట్లు కొన్ని మిగిలాయి, అందులో ఒకటి ఈ ఎదురు చూపు. అలాంటి అలవాటుతోనే కనక దుర్గ ఇప్పుడు గుమ్మంలో నుంచుని వుంది.

అలా కాళ్ళు నొప్పెట్టేదాకా నుంచుని, నుంచుని తను చూడ్డానికి ఎలా కనిపిస్తుందో ఎదుటి వాళ్ళ కళ్లలో చదువుతుంది.

ఎవరైనా పోకిరీ వేషం వేస్తే కోపగించుకుంటుంది. చూసీ చూడనట్లు వెళ్ళిపోతే గాయపడిపోతుంది.

అనుమానంతో కనక చూశారో ఆవేశంతో వణికిపోతుంది. ఎలాగోలా వాడిని చవటగా నిరూపించి పంపుతుంది.

తను చిత్రంగా ప్రవర్తిస్తున్నట్టు దుర్గక్కూడా అర్ధమవుతూనే వుంది. అర్ధం కాకపోతేనే బావుండేది. అర్ధం అవుతున్న కొద్దీ అసహనం పెరిగిపోతోంది.

అసహనం పెరక్కూడదని డాక్టరు గారు చెప్పారు. తప్పనిసరిగా అసహనానికి గురయితే ఏ మందు వేసుకోవాలో రాసి ఇచ్చారు. ఆటో దిగిన వెంటనే వెతుక్కుంటే చీటీ కనిపించలేదు. ఎలా జారిపోయిందో తెలీడం లేదు. పర్సు దులిపింది, కట్టుకున్న బట్టలు దులిపింది.. చీటీ పోయింది. ఇంక దొరకదు. మళ్ళీ డాక్టరు దగ్గరికి వెళ్ళాలి. క్యూలో కూచోవాలి. ఆయన రక రకాల ప్రశ్నలతో సహనం తినేసి, అప్పుడు మనశ్శాంతిగా వుండటానికి ఇంకో పొడుగాటి చీటి రాసిస్తాడు. ఆ చీటీతో దుకాణానికి వెడితే వాడు ఎగాదిగా చూస్తాడు. కళ్ళతో పక్కవాడికి సైగ చేస్తాడు. ఆ పక్క

విషయం తెలిసిన రోజే అత్తగారు నగలు వొలిచి తీసుకుంది. శవాన్ని కూడా ఒంటరిగా వదిలేయ్యరు. తనని వదిలేశారు. ఆఖరి మరిది ముక్తసరిగా ఈ వూరికి తీసుకొచ్చి ఇక్కడి గది అద్దెకి మాట్లాడి ఇంటివాళ్ళకి మూడు నెల్ల కిరాయి చేతికిచ్చి వెళ్ళి పోయాడు.స్నానం చేసి వచ్చి చూస్తే, బల్ల మీద క్యారియరు, ఒక కవరు కనిపించాయి.. తెరిచి చూస్తే పదివేల రూపాయలున్నాయి. నుంచున్న పళం గా కూలబడిపోయింది. అదేమిటి వైద్యం కోసం కదా వచ్చింది, వారం రోజులు వుండి వెళ్ళిపోవడం కాదా? శాశ్వతంగా ఇక్కడే వుండాలా? అనుకుంటే కళ్ళు తిరిగాయి. లేచేసరికి మంచంలో వుంది.

వాడు పెదవులు కదలకుండా ఏదో చెబుతాడు. తను ఇదంతా ఏమీ తెలీనట్టు భరించాలి. లేకపోతే ఏదో కల్పించుకుని పోట్లాట వేసుకుని మనసు చల్లబరచుకోవాలి.

మెట్ల మీదుగా కాళ్ళు రెండూ బార్లా జాపుకుని గోడకానుకుని కూచుంది. తెల్లటి ఇస్త్రీ చీర మాసిపోతుందేమో అనుకుంది కానీ, మార్చడానికి బద్ధకం వచ్చింది. గోడ వత్తిడికి నలుగుతున్న మల్లెపూల వాసన...

విషయం తెలిసిన రోజే అత్తగారు నగలు వొలిచి తీసుకుంది. శవాన్ని కూడా ఒంటరిగా వదిలెయ్యరు. తనని వదిలేశారు. ఆఖరి మరిది ముక్తసరిగా ఈ వూరికి తీసుకొచ్చి ఇక్కడి గది అద్దెకి మాట్లాడి ఇంటివాళ్ళకి మూడు నెల్ల కిరాయి చేతికిచ్చి వెళ్ళి పోయాడు. స్నానం చేసి వచ్చి చూస్తే, బల్ల మీద క్యారియరు, ఒక కవరు కనిపించాయి.. తెరిచి చూస్తే పదివేల రూపాయలున్నాయి. నుంచున్న పళంగా కూలబడిపోయింది. అదేమిటి వైద్యం కోసం కదా వచ్చింది, వారం రోజులు వుండి వెళ్ళిపోవడం కాదా? శాశ్వతంగా ఇక్కడే వుండాలా? అనుకుంటే కళ్ళు తిరిగాయి. లేచేసరికి మంచంలో వుంది.

"ఖంగారు పడకండి, మనం అంతా ఒకటే....జబ్బు తగ్గాక ఇళ్ళకి వెళ్ళిపోతాం, అదేలెండి వాళ్ళు రానిస్తేనే..." నవ్వింది ఒక నడివయసు అమ్మాయి.

జబ్బు అంటోదేమిటి, తన గురించి తెలిసిపోయిందా... ఆమెకి కూడా అదే వుందా? భగవంతుడా - అంటు గట్టిగా ఏడ్చింది.

"అయ్యో అలా ఏడవకండి, మనం ధైర్యం గా వుండాలి. లేకపోతే మందులు పనిచెయ్యవు" అంది.

కవరేదో ఇచ్చినట్టు వున్నారు కదా, మా వాళ్ళకంటే నయమే... ధైర్యం చెప్పింది...

అప్పుడు గుర్తొచ్చింది కనకదుర్గకి, అన్నట్టు నా పొలం, బ్యాంకు బ్యాలన్సు ఏం తేల్చారు?- ఆ మాటే కార్డు రాసి పడేసింది. ఎవరిదగ్గరనించీ జవాబు లేదు. చూసి చూసి ఇంటికెళ్ళి సూటిగా అడుగుదామనుకుంది.

తను వెళ్ళిన రోజు ఆడపడుచుకి నిశ్చితార్థం జరుగుతోంది. అంటే అసలు సంబంధం కుదిరినట్టు కూడా తనకు చెప్పలేదన్నమాట.

"నువ్వెప్పుడొచ్చావే? శలవు దొరికిందా?" భుజంచుట్టు చెయ్యేసి పెరటిలోకి తీసుకెళ్ళింది అత్తగారు.

ఆడపడుచు భయం భయంగా చూసింది.

"ఇప్పుడు మీ మర్యాదల కోసం నేను రాలేదు, నా పొలం, బ్యాంకు బాలెన్సూ ఇప్పించండి. పోతాను." కాఫీ కప్పు పక్కకి తోసి మరీ అంది.

అదేంమ్మాట తల్లీ, నువు పరాయిదానివా? నీ ఆస్తి ఎక్కడికీ పోదు. అవతల నీ ఆడపడుచుకి పెళ్ళివారొచ్చి కూచున్నారు. ముహూర్తానికి టైమవుతోంది. మా తల్లివి కదూ, కొంచెం ఓపిక పట్టు.... "గడ్డం పట్టుకుని బతిమలాడింది అత్తగారు. ఆవిడ లౌక్యం బాగానే అర్థం అవుతోంది." పరాయి దాన్ని కాకపోతే అలా వదిలేస్తారా? నేనేం తప్పు చేశానో చెప్పండి...."ఉద్వేగం ఎక్కువై మాట జీరగా వచ్చింది.

"సరి సరి ఇప్పుడి గొడవేమిటీ? శుభమా అని అవతల శుభకార్యం జరుగుతూంటే...." మామ గారు ఏదొ చెప్పబోయాడు. "ఇంటికోడల్ని నన్ను పిలవకుండా నిశ్చితార్థం చేస్తారా? ఎలా చేస్తారో చూస్తాను, రానివ్వండి వాళ్ళని..." అత్తగారి చేతులు విదిలించుకుని ముందుగదిలోకి దూసుకుని వచ్చేసింది.

అందరికీ వొణుకొచ్చినట్టయింది.

"తను మా పెద్ద తోటికోడలండీ.. బావగారు పోయిన దగ్గర్నించీ... కొంచెం మతి సరిగ్గా లేదు. మందులు వాడుతున్నాం..."

పరిచయం చేసింది, మరిది భార్య.

దుర్గ ఏదో చెప్పబోయింది... కానీ మాట నోట్లోంచి బైటికి వచ్చే లోపు వచ్చిన వాళ్ళలో చిన్న పిల్ల కుర్చీలోంచి దూకి పడ్డమూ, అందరూ హడావిడిగా ఆ పిల్లని సముదాయించడంలో పడిపోయారు. ఇదే అదనుగా అత్తగారు,

"రా తల్లీ, మందు వేసుకోలేదు కదా.. ఒక ముద్ద అన్నం తిను, పొద్దున్న కూడా ఏమీ తినలేదు" అంటూనే దుర్గ చెయ్యి పట్టుకుని తీసుకెళ్ళబోయింది.

"నేనింక ఆగ దల్చుకోలేదు. వారంలోగా ఏ విషయం తేలాలి. మళ్ళీ వచ్చేసరికి.." అంది స్థిరంగా.

అత్తగారు గబగబ తల ఆడించి లోపలికెళ్ళిపోయింది.

దుర్గకింక ఏంచేయాలో తోచలేదు. కల్లో నడుస్తున్నట్టు బైటికొచ్చి నడుస్తోంది.

ఎంతలో ఎంత తేడా? ఎంత వంచన? ఏమి సాధించాలని వచ్చి, ఏమి చూసింది? అర్థం కాలేదు.

"అమ్మగారూ ఆటో కావాలా?" ఆటో వాడు వెంట పడ్డాడు.

వద్దు-అన్నట్టుగా తల వూపింది.

వాడు అంత దూరానికి వెళ్ళగానే అప్పుడు మళ్ళీ పిలిచింది.

"ఇదిగో నిన్నే పిలిస్తే వినిపించదా? వెళ్లమంటే వెళ్ళిపోవడమేనా? అని ఎగిరింది.

వాడు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.."ఎక్కడికమ్మా?"

"కనిపించడంలా? చేతిలో సూట్కేసుతో ఇంకెక్కడికి పోతారు.. స్టేషనుకి పోనివ్వ?"

'ఏ వూరికండీ?' వాడు వదిలేట్టు లేదు.

'గోదారికి సరేనా?' అంది.

"ఇవాళ లేటవుతుందమ్మా? బండి ఎక్కడో పట్టాలు తప్పిందని ఇందాకా నా ఆటోలోనే ఇంటికి వెళ్ళారు ఒకళ్ళు" అన్నాడు. దుర్గ మాట్లాడలేదు, ఎటో చూస్తూ కూచుంది. కళ్ళు ఏడ్చినట్టుగా వున్నాయి.

ఆటో వాడి మనసు కీడు శంకించింది.

"ఇంట్లో చెప్పే వస్తున్నారా అమ్మా?" అడిగాడు.

"ఆహా ఇంట్లో వాళ్ళే గెంటేస్తున్నారయ్యా.. చాలా ఇంకా ఏమైనా కావాలా?" అక్కసు వెళ్ళగక్కింది.

"ఏం పని చేస్తారమ్మా?" మాటల్లో పెట్టదల్చుకున్నాడు.

"ఇక్కడ ఆపు" అని చివాల్న దిగిపోయి, యాభై రూపాయల నోటు చేతిలో కుక్కి చిల్లర తీసుకోకుండానే నాలుగడుగులు వేసిందో లేదో...

"ఎక్కడికే దుర్గీ.. ఇటొచ్చావు? నీకు వరంగల్లులో ఉద్యోగం వచ్చిందని మీ తోటికోడలు చెప్పిందిలే.." అంటు తగులుకుంది మల్లికాంబ పిన్ని.

హమ్మో ఈవిడా ఆవలించకుండానే పేగుల్లెక్కపెడుతుందిగా అనుకోలేదు కనక దుర్గ.

ఇవాళ అన్నిటికీ కలిపి కక్ష తీర్చుకోవాలనుకుంది, అంచేత,

"ఏమిటి పిన్నీ...చిన్న పిల్లని పిలిచినట్టు దుర్గీ ఏమిటి, దుర్గీ... కనకదుర్గా శ్రీ వత్సల అనలేవూ.. "కసురుకుంది.

"ఏమోనమ్మా.. నాకవన్నీ తెలీదు చిన్నప్పటినుంచీ ఇదే కదా అలవాటు...." చిన్నబుచ్చుకుంది పాపం.

దుర్గకి శాంతిగా అనిపించింది.

**వ్యాధిగ్రస్తుల్ని అక్కున చేర్చుకోండి అని సమాచార స్రవంతి చెబుతోంది. కుటుంబాలు మాత్రం మనుషుల్ని తరిమి వేస్తున్నాయి.**

**దుర్గకి భర్త ద్వారా రావాల్సిన పొలము, బ్యాంకు బాలన్సూ రావడం లేదు. ఇచ్చిపోయిన వ్యాధి మాత్రం వడ్డీతో సహా ముదురుతోంది.**

**ప్రేమించి చేసుకున్న పెళ్ళి కాబట్టి అది వంక పెట్టి పుట్టింటి వాళ్ళు పలకరు.**

"అదే అంటున్నా.. తెలుసుకోవాలి కదా, చిన్నప్పుడు వున్నట్లు కాలం ఇప్పుడు వుందా.. అంతా మారిపోయింది. సర్వనాశనం అయిపోయింది. దుర్గకి ఏడుపు పొంగుకొచ్చింది.

మల్లికాంబ పిన్నికి ఏమీ అర్థం కాలేదు.

కనక దుర్గకి ఎప్పటినుంచో అసలేమీ అర్థం కావడం లేదు.

'వ్యాధిగ్రస్తుల్ని అక్కున చేర్చుకోండి' అని సమాచార స్రవంతి చెబుతోంది. కుటుంబాలు మాత్రం మనుషుల్ని తరిమి వేస్తున్నాయి.

దుర్గకి భర్త ద్వారా రావాల్సిన పొలము, బ్యాంకు బాలన్సూ రావడం లేదు. ఇచ్చిపోయిన వ్యాధి మాత్రం వడ్డీతో సహా ముదురుతోంది.

ప్రేమించి చేసుకున్న పెళ్ళి కాబట్టి అది వంక పెట్టి పుట్టింటి వాళ్ళు పలకరు.

ప్రేమ కూడానా? ఇంకా నయం... ప్రేమ ఎక్కడుంది? ప్రేమ వున్నదయితే మల్లెపులు పెట్టుకుంటుందా? పైగా ఆస్తి అంటు వెంటపడుతోంది చూడండి.. ఇంకా ఎక్కడి ఆస్తి, తన భర్త రోగానికే అయింది కదా చాలా.. అది ఎవరు పెడతారనుకుంటుంది? అత్తింటి వాళ్ళు ఆస్తి ఎగ్గొట్టడం కోసం చూస్తున్నారు.

కనక దుర్గకి దేనికోసమైనా ఎదురుచూడ్డమంటే చాలా ఇష్టం. అయితే దేనికోసం ఎదురుచూడాలో తెలీడం లేదు.

పిచ్చెత్తిపోతోంది, పిచ్చెత్తినట్లుగానే ప్రవర్తిస్తోంది.

పాపం పిచ్చిది అనుకుంటున్నారంతా..... ●

---

## కరెంట్ కవితలు

**1. ఆధారే దారి**

ప్రతి పనికీ ఆధార్ కార్డు
పరోక్షంగా సామాన్యుడికి మోకాలడ్డు..
మంచిదే ఒక సోషల్ సెక్యూరిటీ అంకె
కూడదు అన్ని సమస్యలకీ పరిష్కారం
అంటూ రంకె
అన్నిటికీ ఆధార భూతమై(తే)చేర్చు నా
ఒడ్డు

**2. బావుటా**

మతాన్ని మడత పెట్టు
కులాన్ని కుళ్ళ గొట్టు
విజ్ఞాన సర్వస్వాని మూట గట్టుకో
ఆత్మ విశ్వాసపు బావుటా ఎగరేసుకో
మూఢనమ్మకాలు మూల నెట్టు

**3. గాడ్ 'సే'**

ఊరుకుంటే నేడు గాడ్సేకు ఒక ఆలయం
వదిలేస్తే రేపు ఊరికొక తీవ్ర వాదుల
నిలయం
నైతిక విలువలు పతనానికి పరాకాష్ఠ
విలువలను మతాల వలువలుగా
చూస్తే నష్టం
జాతిపితను ఏమీ చేయజాలదు ఈ
విషవలయం

**- డాక్టర్ రమణ యశస్వి**

మణిపూసలు

# రాధాబాయ్ సుబ్బరాయన్

- వకుళాభరణం లలిత

1917లోనే స్త్రీల ఓటు హక్కుకోసం మహిళా సదస్సు జరిగింది. ఆనాటి సెక్రటరీ ఆఫ్ స్టేట్, వైస్రాయ్‌ని మహిళలకు ఓటు హక్కు కావాలని కోరారు. ఈ అభ్యర్థన ప్రపంచాన్నే ఆశ్చర్యంలో ముంచింది. భారతదేశ మహిళా చైతన్యానికి ఇది ఒక గీటురాయి. దేశ రాజకీయాల్లో భాగస్వామ్యాన్ని పంచుకోవాలని భారతీయ మహిళలు ఉర్రూతలూగారు. ఇది మహిళా ఉద్యమంలో కాక వాళ్ల చరిత్రలో సంక్షేమంలో ఒక మైలురాయి. దీని మూలంగా చట్టబద్ధమైన హక్కు పూర్తి స్వాతంత్ర్యం సిద్ధించిందని కాదు.

రాధా సుబ్బరాయన్ మొదటి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సులో పాల్గొన్న ఏకైక మహిళా ప్రతినిధి. ఈ సమావేశానికి బేగమ్‌షానవాజ్, రాధా సుబ్బరాయన్ పేర్లు ప్రకటితమైనాయి. భారతీయ, ఆంగ్ల రాజకీయ దురంధరుల జాబితాలో వీరిరువురి పేర్లు రావటం హర్షదాయకం. ఆవిధంగా రాధా సుబ్బరాయన్ మహిళా హక్కుల సాధనలో ప్రధానపాత్ర పోషించింది. ఈ హక్కుల సాధనలో ఆమె పాటుపడ్డం గర్వించదగ్గ విషయం. తెల్లకాగితంలో అన్ని కోరికలను నెరవేరుస్తామని హామీ ఇవ్వలేదు. దాంతో స్త్రీలకు సంపూర్ణంగా ఓటు హక్కు ఇస్తారన్న నమ్మకం ఆమెకు లేదు.

ఓటు హక్కును వినియోగించుకునే స్త్రీల సంఖ్య చాలా తక్కువ. సెక్రటరీ కమీషన్ సిఫారసు చేసిన సంఖ్య చాలా తక్కువ. ఈ తక్కువ సంఖ్యను అధిగమింప చేయాలని రాధా సుబ్బరాయన్ ఎంతో ప్రయత్నించారు. మొదటి, రెండో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సుకు ఏకైక ప్రతినిధిగా ఉండి కష్టపడి తన లక్ష్యాన్ని సాధించడానికి కృషిచేశారు. అయితే తెల్లకాగితంలో ధియన్ కమిటీ సిఫారసులు అమలు జరగలేదు. దానికి ఆమె ఎంతో బాధపడ్డారు. ప్రత్యేక కమిటీ కానీ, పార్లమెంటు కానీ అనుకున్నది ఇవ్వలేదు. సంపూర్ణ సమానత్వం ఇవ్వలేకపోయినా, కొంతవరకైనా ఓటు వేసే అవకాశాన్ని ఇవ్వాలి.

తర్వాతి కాలంలో ఓటు విషయంలో, ప్రధాన మహిళా విభాగాలనుంచి మిగిలిన ప్రతిపాదనలతోపాటు వయోజన ఓటు హక్కు కోసం, కనీసం పట్టణాల వరకైనా అమలు జరపాలని మహిళలు కోరారు. ఈ ప్రతిపాదన మూలంగా గ్రామాల్లో ఉన్న స్త్రీలకు ఏమాత్రం ఉపకరించదు. అప్పుడు ఈ ఓటు హక్కుకు విలువలేదు. నియోజకవర్గాల్లో ఎక్కువమంది ఓటర్లు ఉండి తీరాలి. లేకుంటే వాళ్లకు తీరని నష్టం జరుగుతుంది.

స్త్రీలు ఈ ఓటు హక్కుకోసం పట్టుపట్టాలి. ఇందులో కులం, మతం అనే తేడా ఉండకూడదు. ఈ విషయంలో స్త్రీలు పురుషులకన్నా ముందంజలో ఉన్నారు. ఏ రాష్ట్ర ప్రభుత్వం కూడా కుల మతాలను బట్టి ఓటుహక్కు వినియోగించుకోవాలని చెప్పదు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ విషయంలో సరైనా అంచనా వేయలేదు.

ఆ తరువాత జరిగిన ఎన్నికల్లో స్త్రీల పాత్ర మరువరానిది. రాధా సుబ్బరాయన్ కూడా ఈ విషయంలో తన వంతు కృషి సల్పింది. జనాభాలో సగం ఉన్న స్త్రీలు ఎంతో ముఖ్యమైన పాత్ర నిర్వహించారు. భావి రాజ్యాంగ శాసనానికి సంబంధించి ఇంకా ముఖ్యమైన పాత్రే నిర్వహిస్తారు. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు ప్రతినిదిగా సమాఖ్య నిర్మాణ మైనార్టీ కమిటీ సభ్యురాలిగా ఆమెను ఆనాటి లార్డ్ ఛాన్సలర్, చైర్మన్ ఫెడరల్ స్ట్రక్చరల్ కమిటీ ఎంతో మెచ్చుకున్నారు. లార్డ్‌లోధియన్, ఆర్.వి. బట్లర్, ఆనాటి అండర్ సెక్రటరీ ఆఫ్ స్టేట్ షార్ ఇండియా ఆమెను ఎంతో మెచ్చుకున్నారు.

రాధా సుబ్బరాయన్ 1892లో మంగుళూరులో జన్మించారు. ఆమె తండ్రి రావుసాహెబ్ కె. రంగారావు గొప్ప సంస్కర్త. బ్రాహ్మణుడైనా అన్ని కులాల సమానత్వాన్ని వాంఛించిన సంస్కర్త. అణగారిపోయిన కులాలను పైకి తెవటానికి ఎంతో కృషి చేశాడు. ముగ్గురు అక్కాచెల్లెళ్లలో రాధాబాయి మంగుళూరులోనే చదువుకున్నారు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో చదివి బి.ఎ. పట్టా పుచ్చుకున్నారు. తర్వాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో సోమర్‌విల్లీ కాలేజిలో ఉన్నత విద్యనభ్యసించారు.

రాధా సుబ్బరాయన్ మొదటి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సులో పాల్గొన్న ఏకైక మహిళా ప్రతినిధి. ఈ సమావేశానికి బేగమ్‌షానవాజ్, రాధా సుబ్బరాయన్ పేర్లు ప్రకటితమైనాయి. భారతీయ, ఆంగ్ల రాజకీయ దురంధరుల జాబితాలో వీరిరువురి పేర్లు రావటం హర్షదాయకం. ఆవిధంగా రాధా సుబ్బరాయన్ మహిళా హక్కుల సాధనలో ప్రధానపాత్ర పోషించింది. ఈ హక్కుల సాధనలో ఆమె పాటుపడ్డం గర్వించదగ్గ విషయం. తెల్లకాగితంలో అన్ని కోరికలను నెరవేరుస్తామని హామీ ఇవ్వలేదు. దాంతో స్త్రీలకు సంపూర్ణంగా ఓటు హక్కు ఇస్తారన్న నమ్మకం ఆమెకు లేదు.

బ్రాహ్మణ యువతిగా వుండి, బ్రాహ్మణేతర వ్యక్తిని వివాహం చేసుకోవడం దక్షిణ భారతదేశంలో చాలా విడ్డూరంగా ఉండింది. కుమారమంగళం జమీందారు సుబ్బరాయన్‌ను వివాహం చేసుకున్నారు. ఆయన కొన్నాళ్లు మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్నారు. మంత్రివర్గం 1940లో పదవి నుంచి తొలగినప్పుడు, ఆయన మంత్రి అయ్యారు. ఆయనకు జైలు శిక్ష విధిస్తే, రాధా సుబ్బరాయన్ కూడా జైలుకు వెళ్లారు.

మొదటినుంచి రాధా సుబ్బరాయన్ మంచి వక్త. ఇరవయ్యేళ్ళ వయస్సులో ఆమె చదివిన కళాశాలలో 'పురుషుల బాధ్యతలపై' ఉపన్యాసం ఇచ్చారు. స్త్రీల హోదా పెంచడానికి సహకరించమని వారిని కోరారు. స్త్రీల సమస్యలపై ఆమెకు ఎంతో అవగాహన ఉంది. ఆమె మాట్లాడుతుంటే ఎంతో హుందాతనం కన్పించేది.

రాజకీయ రంగంలో ప్రముఖ స్థానం పొందటమేకాక, ఆమె సంఘ సేవకురాలు కూడా. మద్రాసు విశ్వవిద్యాలయం సెనెట్ సభ్యురాలిగా సిండికేట్ సభ్యురాలుగా కూడా ఎంపిక అయ్యారు. 12 సంవత్సరాలపాటు సభ్యురాలిగా ఉండి సేవలందించారు. అనారోగ్య పరిస్థితివల్ల ఆ పదవి నుంచి విరమించుకున్నారు. ఎన్నో మహిళా సదస్సుల్లో పాల్గొన్నారు. రెడ్‌క్రాస్ బాలల సంక్షేమ కమిటీకి 10 సంవత్సరాలు చైర్మన్‌గా పనిచేశారు.

శిశు సంక్షేమ కమిటీ తరపున 1934లో జెనీవాలో ప్రాతినిధ్యం వహించారు. అంతర్జాతీయ శ్రామిక సదస్సులో భారతదేశ ప్రతినిధిగా పాల్గొన్నారు. భూపేంద్రనాథ్ మిశ్రా ఆమెను ఎంతో కొనియాడారు. 1935లో అంతర్జాతీయ శ్రామిక సదస్సుకు ఆరోగ్యం సహకరించక హాజరు కాలేకపోయింది. 1936లో భారతదేశాన్ని వదిలి స్విట్జర్లాండ్‌లోని శానిటోరియంకు వెళ్లారు. స్త్రీలకోసం ఆమె పోరాడిన తీరు నిజంగా గర్వకారణం. ఆరోగ్యం కుదుటపడ్డ తర్వాత మద్రాసు శాసనసభ సభ్యురాలిగా సేవలందించారు.

రాధా సుబ్బరాయన్ ఒకవ్యక్తే కాదు. ఒక శక్తి. స్త్రీల కోసం, వాళ్ల హక్కులకోసం, ముఖ్యంగా ఓటు హక్కుకోసం ప్రాతినిధ్యం వహించిన మొదటి మహిళ ఆమె. స్త్రీలు పురుషులకన్నా ఏమాత్రం తీసిపోరన్న వాస్తవాన్ని ప్రపంచ దృష్టికి తెచ్చిన మహిళ ఆమె. ఆమె సేవ, పట్టుదల, కార్యదీక్ష అనితర సాధ్యమైనవి. ఆమె జీవితం మహిళా లోకానికి స్ఫూర్తి దాయకం. ●

---

శ్రమజీవి

# గూడేల్లో మగ్గుతున్న బతుకులు

-ఎం. ఆంజనేయులు

**కూరలో తిరగమోత మాడితే వచ్చే మిరప ఘాటుకి ఇరుగు పొరుగువారితో సహా ఇంట్లో వాళ్లు ఏం... తల్లి పొగబెట్టావా అంటూ దీర్ఘాలు తీస్తారు. తుమ్ములు, దగ్గులతో ఉక్కిరిబిక్కిరవుతారు. రెండు నిముషాల ఘాటునే భరించడానికి ఇంత కష్టంగా ఉంటే పనిగంటలకు మించి పని చేసే మిర్చి తొడేల కార్మికుల పరిస్థితి ఎంత దయనీయం. రెక్కాడితేగాని డొక్కాడని కుటుంబాలు. పని ప్రాంతంలో కనీస సౌకర్యాలు కూడా ఉండవు. అయినా బతుకుబండి నడవాలంటే ఆ ఘాటులోనే పనిచేస్తున్నారు. తమకు మౌలిక వసతులు కల్పించాలని అడుగుతున్నారు. పట్టించుకోని యాజయాన్యంపై సిఐటియు ఆధ్వర్యంలో పోరాటానికి ఉద్యుక్తులవుతున్నారు. ఆ అమ్మతల్లుల కథనం మానవి కోసం...**



ఆసియాలోనే గుంటూరు మిర్చి యార్డుకు ఎంతో ప్రాధాన్యత ఉంది. ప్రభుత్వానికి, వ్యాపారులకు కోట్ల రూపాయల ఆదాయం వస్తుంది. కానీ కార్మికులకు మాత్రం సరైన వేతనాలు ఇవ్వకుండా కడుపులు మాడ్చుతున్నారు. నగరంలోని మిర్చియార్డు పరిసర ప్రాంతాల్లో వేలమంది మిర్చి తొడేలు తీసే కార్మికులు పనిచేస్తున్నారు. పెదకాకానీ, గుజ్జన గుళ్ల, వింజనంపాడు, తెనాలి నుంచి కూడా కూలీలు రోజూ ప్రయాణించి ఇక్కడికి వస్తున్నారు. వివిధ రకాల మిర్చికి తొడాలు తీసినందుకు కెజి సీజన్‌లో ఒక రకంగా, అన్‌సీజన్‌లో మరో రకంగా వేతనాలు ఇస్తున్నారు. ఇటువంటి విధానం ఉమ్మడి రాష్ట్రంలోనూ ఎక్కడా లేదు. వరంగల్, ఖమ్మం సంవత్సరం పొడవునా ఒకే రకరమైన కూలీ అమలవుతుంది. అంతేకాక సమాజ సూత్రం ప్రకారం పెరుగుతున్న ధరలు, అవసరాలకు అనుగుణంగా వేతనాలు పెరుగుతాయి. కానీ గూడేల్లో పనిచేసే కూలీలకు మాత్రం వేతనాలు ఇటీవల భారీగా తగ్గించారు. గూడేల్లో అంతా మహిళా కార్మికులే పనిచేస్తున్నారు. వారికి కనీసం మరుగుదొడ్ల సౌకర్యం లేదు. కొన్ని గూడేల్లో మంచి నీరు కూడా లేదు. తాటాకు పందిళ్లలో ఏర్పాటు చేసిన గూడేం కూలి రెండు సంవత్సరాల క్రితం ఎలీషమ్మ అనే మహిళా కార్మికురాలు మృతి చెందింది. కెవిపి కాలనీలో ఒక గూడెంలో మరుగుదొడ్డి సౌకర్యం లేకపోవటంతో బహిర్భూమికి వెళ్లిన మరో మహిళా కార్మికురాలు పాముకాటుకు గురై మృతిచెందింది. కార్మికులు నిత్యం మిర్చి కోరులో పనిచేయటంతో దగ్గు వల్ల ఊపిరితిత్తులు పాడై అనేక ఆరోగ్య సమస్యలు ఎదుర్కొంటున్నారు. తొడాలు తీసి ఇంటికి వెళుతున్న తమకు ఆర్టీసీ బస్సులో కోరు వస్తుందంటూ ఎక్కించుకోవట్లేదని, బస్సులు ఆపట్లేదని కార్మికులు వాపోతున్నారు. దీంతో సుదూర ప్రాంతాలకు ఆటోలే దిక్కవుతున్నాయి. ఆటోల్లో ప్రయాణిస్తుంటే రోజుకు యాభై నుంచి అరవై వరకు ఛార్జీలకే ఖర్చవుతుందని చెబుతున్నారు. తొడాల తీసిన మిర్చిని కొలిచేటప్పుడు రెండు మూడు కేజిలు తేడా వస్తుందని ఆరోపిస్తున్నారు. ఇంత జరుగుతున్నా సంబంధిత అధికారులు మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తున్నారని కార్మిక నాయకులు ఆరోపిస్తున్నారు.

మిర్చి తొడాల రంగంలోనే నగరంలో సుమారు ఐదు వేల మందికిపైగా మహిళా కూలీలు పనిచేస్తున్నారు. వారికి కనీస వేతనాలు లేవు. కార్మికులుగా గుర్తింపూ లేదు. రోజుకో విధంగా, గూడెంకో రకంగా కూలి అమలు చేస్తూ కార్మికుల శ్రమను దోచుకుంటున్నారు. సీజన్‌లో తేజా రకానికి రూ. 25, బాడిగ రకానికి 15 ఇస్తారు. సీజన్ జనవరి నుంచి మే వరకు ఉంటుంది. ఇటీవల గూడేల యజమానులు కుమ్మక్కై తేజాకు రూ.18, బాడిగకు రూ.10 అమలు చేస్తామని యజమానులు ప్రకటించటంతో కార్మికుల్లో ఆగ్రహం కట్టులు తెంచుకుంది. స్వయంగా వారే పని మానేసి రోడ్డుపైకొచ్చి మూడు గంటలపాటు రాస్తారోకో చేశారు. దీనికి సిఐటియు ఇతర కార్మిక సంఘాలూ మద్దతు తెలిపాయి. దీంతో దిగొచ్చిన యజమానులు రెండు రూపాయలు పెంచి చేతులు

దులుపుకున్నారు. తర్వాత కాలంలో సిఐటియు కార్మికుల్ని చైతన్య పరిచి సంవత్సరం మొత్తం ఒకే రకమైన కూలి ఇవ్వాలని, కూలి రేట్లు పెంచాలని, గూడేల్లో మరుగుదొడ్లు, మంచినీరు వంటి సౌకర్యాలు కల్పించాలని, గుర్తింపు కార్డులివ్వాలనీ పలు డిమాండ్లతో ప్రచారం చేపట్టి ఈనెల 16న బంద్‌కు పిలుపునిచ్చింది. సుమారు 150 గూడేల కార్మికులు బంద్ పాటించారు. అనంతరం కలెక్టరేట్ ఎదుట ధర్నా నిర్వహించారు. ధర్నాలో కార్మికుల బాధలు స్వయంగా వారి మాటల్లోనే....

**అనారోగ్యం బారిన పడుతున్నాం**

అంజలి, మహిళా కార్మికురాలు



మాది ఒంగోలు. అక్కడ పనులేమీ దొరక్క ఇక్కడికి వలస వచ్చాం. గుంటూరు సమీపంలోని లాల్‌పురంలో అద్దె ఇంట్లో ఉంటున్నాం. భర్త మిర్చియార్డులో కూలీగా చేస్తున్నాడు. నేను మిర్చి తొడాలు తీసే పని చేయటం వల్ల అనారోగ్యం వస్తుంది. జలుబు చేసి నిత్యం గొంతునొప్పి , ఎలర్జీలు కూడా వస్తున్నాయి. ఒక సారి ఆసుపత్రి పాలయితే వేలకు వేలు ఖర్చవుతున్నాయి. సీజన్‌లో నాకు రూ. 150-200 వస్తున్నాయి. అన్‌సీజన్‌లో పూట గడవటమే కష్టంగా ఉంది. కనీసం మూడొందలు లేకుండా పనిచేయలేము.

**కనీస వేతనాలు ఇవ్వాలి**

**వాణి,** మహిళా కార్మికురాలు

మా గూడెంలో బాడిగ రకం మిరపకాయపై రూ. 12 కంటే ఎక్కువ ఇవ్వనంటున్నారు. సీజన్‌లో రూ. 15 పైగా కూలి ఇచ్చారు. ప్రస్తుత సీజన్‌లోనే రూ. 12కు కుదిస్తే అన్‌సీజన్‌లో భారీగా తగ్గించే అవకాశం ఉంది. మాకు ఇద్దరు పిల్లలున్నారు. వారు చదువుకుంటున్నారు. ఉదయం నుంచి సాయంత్రం వరకు గూడేల్లో కోరులో తొడాలు తీసినా రూ. 200కు మించి రావట్లేదు. అద్దె ఇళ్లలో ఉంటున్నాం. భర్త కూడా కూలిపనే చేస్తున్నాడు. ఒక్కరోజు బద్ధకించినా కుటుంబం గడవటం కష్టంగా ఉంటుంది. సంవత్సరం మొత్తం ఒకే కూలి ఇవ్వాలి. బాడిగ రకానికి రూ. 15, తేజాకు 25 కూలి ఇవ్వాలి.

**కూలీల బాధలు వర్ణనాతీతం**

**కరీమూన్,** కృష్ణబాబు కాలనీ గూడెం

మహిళా కార్మికులు ఐక్యంగా ఉంటేనే సమస్యలు పరిష్కారం అవుతాయి. మా గూడెంలో కేజీకి రూ. 8 మాత్రమే ఇస్తున్నారు. పక్క గూడెంలో రూ. 12 ఇస్తున్నారు... కూలి పెంచమంటే... చేస్తే చెయ్యండి లేకపోతే మానెయ్యండి అంటూ యజమాని బెదిరిస్తున్నాడు. అత్యంత కష్టమైన ఈ పనికి కూడా పోటీ పెరిగింది. దీంతో యజమానులు ఎవరిష్టం వచ్చినట్టు వారు కూలి ఇస్తున్నారు. ముఠా కూలీలు చెయ్యాల్సిన పని కూడా మేమే చెయ్యాల్సి వస్తుంది. లారీల నుంచి బస్తాలు దించుకోవాలి. వృద్ధ మహిళలు, గర్భిణులు, పసి పిల్లల తల్లులూ ఉన్నారు. బస్తాలు మోసేటప్పుడు వారు పడే బాధలు వర్ణనాతీతం. మహిళలు కష్టపడి పనిచేసి డబ్బులు కూడబెడుతుంటే భర్తలు మద్యానికి బానిసలై మొత్తం ఖర్చు చేస్తున్నారు. ఆడవాళ్లు వంటింటికే పరిమితం కాదు అని నేడు మహిళలు నిరూపించారు. సిఐటియు అండతో కూలి పెంచుకునే వరకు పోరాటం కొనసాగిద్దాం.

**బస్సులు ఆపట్లేదు**

ఝూన్సీ, కార్మికురాలు



సుదూర ప్రాంతాల నుంచి ఇక్కడికొస్తున్నాం కానీ, రాత్రిపూట పని ముగిసిన తర్వాత మిర్చియార్డు వద్ద ఆర్‌టిసి బస్సులు ఆపట్లేదు. బస్సులో కోరు వస్తుందని అందుకే ఆపట్లేదని కండక్టర్లు సమాధానం ఇస్తున్నారు. దీంతో చేసేది లేక ఆటోల్లో ప్రయాణించటంతో ఛార్జీలకు ఎక్కువగా ఖర్చవుతుంది. తేజా కాయలు తొడాలు తీయటం చాలా కష్టం గతంలో సీజన్‌లో కేజీకి రూ. 26 వరకు ఇచ్చారు. కానీ ఈ సంవత్సరం రూ. 20 మాత్రమే ఇస్తున్నారు. బాడిగ ఇతర రకాల మిర్చిపై కూడా భారీగా కూలీ తగ్గించారు. ఆరోగ్యాన్ని కూడా లెక్క చేయకుండా పనిచేస్తున్నాం. మాకు న్యాయమైన కూలి ఇవ్వాలి.

ఆరోగ్యం

# మైగ్రెయిన్ తలనొప్పి
## చికిత్సకన్నా నివారణ సులభం

-డా|| కె. భారతి సాగర్

తలనొప్పి అనేది మనందరికీ సాధారణంగా వచ్చే ఒక లక్షణం. కానీ కొన్ని సార్లు ఇది శరీరంలోని తీవ్ర వ్యాధులకు కూడా సంకేతం. తలనొప్పిలో చాలా రకాలున్నాయి. అయితే మనం ఈ సంచికలో మహిళల్లో అతి సాధారణంగా వచ్చే మైగ్రెయిన్ తలనొప్పి గురించి తెలుసుకుందాం.

తలనొప్పిని సాధారణంగా ప్రాథమికంగా వచ్చేది, ఇతర వ్యాధులకు అనుబంధంగా వచ్చేదని రెండు రకాలుగా వర్గీకరించారు. మైగ్రెయిన్ అనేది ప్రాథమిక (ప్రైమరి) తలనొప్పిగా వస్తుంది. మైగ్రెయిన్ అనేది సంక్లిష్టమైన నరాలకు సంబంధించిన వ్యాధి. ఈ వ్యాధిలో తలనొప్పితోపాటు వాంతి వచ్చినట్లుండడటం, వాంతి రావటం, వెలుతురుని, శబ్దాలను భరించలేకపోవటం ఉంటాయి. పురుషులకన్నా స్త్రీలలో ఇది ఎక్కువగా వస్తుంది. (2:1 నుండి 3:1వరకు ఉంటుంది) సుమారు 60% మంది రోగులలో కుటుంబ చరిత్ర ఉంటుంది. ఈ వ్యాధి రావటానికి ముందు సుమారు 80% మందిలో ఎటువంటి లక్షణాలు ఉండవు. కానీ 20%మందిలో ... (వ్యాధి రావటానికి ముందే వ్యాధి వస్తుందని సూచించే లక్షణాలు) ఉంటుంది. ఈ తలనొప్పి బాల్యంలో లేదా శైశవదశలో లేదా యౌవన దశలో మొదలుకావచ్చు.

వ్యాధి లక్షణాలు అందరిలో ఒకేలాగా ఉండవు. ఒక్కొక్కరిలో ఒక్కోలాగా ఉంటాయి. ఒకే రోగిలో కూడా వివిధ సమయాలలో వివిధ రకాలుగా ఉండవచ్చు. సాధారణంగా అందరిలో కనిపించే లక్షణం మాత్రం తలనొప్పి. శరీరంలోని నాడీ వ్యవస్థ, జీర్ణ క్రియ వ్యవస్థలలో డిస్టర్బెన్స్ వలన తలనొప్పితోపాటు వివిధ ఇతర లక్షణాలు కలుగుతాయి.

ఈ తలనొప్పి రావటానికి గల కారణాలను అర్థం చేసు కోవటానికి ముఖ్యంగా రెండు ఊహాజనిత సిద్ధాంతాలను ప్రతిపాదించటమైనది. ఒకటి వాస్కులర్ లాయరీ (రక్త ప్రసరణ వ్యవస్థకు సంబంధించినది), రెండు న్యూరో జెనిక్ థియరీ. మెదడులో తాత్కాలికంగా అస్తవ్యస్తమయ్యే నాడీకణాల క్రియవలన మైగ్రెయిన్ అటాక్ మొదలవుతుంది. తలనొప్పి మొదలవటానికి 'పి' అనే సబ్‌స్టాన్స్ సెన్సరీ గాంగ్లియాలో విడుదల కావటం కారణంగా గుర్తించారు. ఈ 'పి' కారకం ట్రైజెమినల్ నాడిని ప్రేరేపించి తద్వారా నొప్పికి కారణం అవుతుంది. అలాగే నార్ ఎడ్రినైరిక్ నాడుల ద్వారా వచ్చే ప్రేరణ వలన తలలోని రక్తనాళాల సంకోచం, వ్యాకోచం జరిగి తలనొప్పి అధికమవుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే బాహ్య లేదా అంతర్గత ప్రేరకాల వలన బ్రెయిన్‌లోని కొన్ని వ్యవస్థలు ఉత్తేజితమై ఏర్పడే ఒక సంక్లిష్ట పరిస్థితి వలన మైగ్రెయిన్ అటాక్ మొదలవుతుంది.

మైగ్రెయిన్ వ్యాధితో అనుబంధంగా వచ్చే నాడీ వ్యవస్థలో మార్పులను బట్టి దీనిని మూడు రకాలుగా విభజించారు. హెమిప్లీజిక్ మైగ్రెయిన్, బేసిలార్ మైగ్రెయిన్ మరియు ఆప్తాల్మో ప్లీజిక్ మైగ్రెయిన్. మైగ్రెయిన్ అటాక్ 72 గంటలకన్నా ఎక్కువగా ఉంటే దానిని 'స్టాటస్ మైగ్రెయినోసస్'అని అంటారు.

### మైగ్రెయిన్ వ్యాధిని ప్రేరేపించే కారకాలు

**హార్మోన్ స్రావాలలో మార్పులు :-** స్త్రీలలో ఈస్ట్రోజెన్ హార్మోన్ స్రావాలలో మార్పుల వలన మైగ్రెయిన్ వస్తుంది. ఎక్కువమంది స్త్రీలలో నెలసరి వచ్చే ముందుకానీ వచ్చిన తరువాత కానీ ఈ అటాక్ వస్తుంది. నెలసరి



వచ్చేముందు లేదా వచ్చిన వెంటనే ఈస్ట్రోజెన్ స్రావం ఒక్కసారిగా అధికమొత్తంలో తగ్గిపోతుంది. దీని వలన మైగ్రెయిన్ వస్తుంది. కొంత మంది స్త్రీలలో గర్భధారణ సమయంలోనూ మరియు మెనోపాజ్ సమయంలోనూ ఈ అటాక్ వస్తుంది. ఇంకొంతమందిలో గర్భ నిరోధక మాత్రలు వాడేటప్పుడు లేదా మెనోపాజ్ సమయంలో వాడే హార్మోన్ మాత్ర వాడేటపుడు వస్తుంది. కొంతమందిలో మాత్రం ఈ మందులు వాడుతున్నపుడు మైగ్రెయిన్ తగ్గుతుంది.

**ఆహారం :-** ఎక్కువ కాలం నిలువ ఉంచిన చీజ్ (జున్ను), ఉప్పు అధికంగా కలిపిన ఆహార పదార్థాలు, ప్రోసెస్ చేసిన నిలువ ఆహారం లాంటివి ఉత్ప్రేరకంగా పనిచేస్తాయి. అలాగే ఉపవాసం ఉండటం, ఒకపూట మీల్స్ చేయకపోవటం లాంటివి కూడా మైగ్రెయిన్‌ని కలుగచేస్తాయి.

**ఆహారంలో కలిపేవి :-** కృత్రిమ తీపి పదార్థ ఆస్పార్టమ్, ఆహారం నిలువ ఉండటానికై కలిపే మోనోసోడియం, గ్లూటామేట్ మొదలైనవి మైగ్రెయిన్‌ని ట్రిగ్గర్ చేస్తాయి.

**డ్రింక్స్ :-** ఆల్కహాల్, ముఖ్యంగా వైన్ అధికంగా కెఫిన్ ఉన్న డ్రింక్స్.

**మానసిక వత్తిడి :-** పని ప్రదేశం లేదా ఇంటిలోవత్తిడి.

**సెన్సరీ స్టిములి :-** అధిక ప్రకాశవంతమైన లైట్లను లేదా సూర్యుని వెలుగుని చూడటం,

అధిక శబ్దంతో సంగీతం వినటం, కొన్ని రకాల వాసనలు, పెర్‌ఫ్యూమ్‌లు, పెయింట్లలో కలిపే ద్రవాలు, సిగరెట్ పొగలాంటివి.

**నిద్ర :-** సరిగా నిద్ర పోకపోవటం లేదా అధికంగా నిద్రపోవటం, జెట్‌లాగ్.

**భౌతిక కారణాలు :-** తీవ్రమైన శారీరక అలసట, అధిక సెక్సువల్‌చర్యలు.

**వాతావరణం :-** వాతావరణంలో మార్పు వచ్చినపుడు లేదా గాలి పీడనంలో మార్పు వచ్చినపుడు.

**మందులు :-** గర్భ నిరోధక ఔషధాలు, హృద్రోగంలో వాడే నైట్రోగ్లిసరిన్' లాంటివి.

**మైగ్రెయిన్ అటాక్ వచ్చే ముందు లక్షణాలు:-** చూపు మందగించటం, కళ్ళ ముందు వివిధ ఆకారాలను, మెరుపులను చూడటం, అరికాళ్ళు, చేతులలో సూదులు గుచ్చినట్లుండటం, మాట తీరులో తేడా రావటం.

**మైగ్రెయిన్ అటాక్ వచ్చినపుడు లక్షణాలు:-**

తలనొప్పి ఒక పార్శ్వంలోగాని, తల మొత్తంగాని వస్తుంది. నొప్పి పోట్లుగా గానీ రక్త నాళాలు కొట్టుకుంటున్నట్లుగా కానీ అనిపిస్తుంది. వాంతులవటంకానీ, వాంతివచ్చినట్లుగా కాని ఉంటుంది. చూపు మసకగా అనిపిస్తుంది. తల తిరుగుతున్నట్లుగా కానీ ఉంటుంది. కొన్ని సార్లు స్పృహతప్పవచ్చు. మైగ్రెయిన్ అటాక్ తగ్గిన తరువాత శరీరంలో శక్తిలేనట్లు నిస్సత్తువగా అనిపిస్తుంది. మైగ్రెయిన్ అటాక్ ఒకసారి వచ్చిన తరువాత కొన్ని గంటల నుంచి కొన్ని రోజుల వరకు ఉంటుంది.

**చికిత్స :-** క్రమం తప్పకుండా మైగ్రెయిన్ వస్తున్నపుడు డాక్టర్ని సంప్రదించవలసి ఉంటుంది. నొప్పి వచ్చే టైమ్‌ని, నొప్పికి సంబంధించిన విషయాలను ఒకడైరీలో రికార్డు చేయవలసి ఉంటుంది. ఇలా చేయటం వలన ఏ కారణాల వలన వస్తుందో తెలుసుకొని దానిని నివారించటానికి అవకాశం ఉంటుంది. ఉదాహరణకి నెయ్యితో తయారు చేసిన నిలువ పదార్థాలను తిన్నప్పుడు వెంటనే తల తిరిగినట్లు, తలనొప్పి వచ్చినట్లు అనిపిస్తే తరువాత నుంచి వాటిని ఆహారంలో తొలగించవలసి ఉంటుంది. అలాగే కొంతమందికి నెలసరికి ముందు చల్లగాలి తాకినపుడు, గాలి చెవులలోకి వెళ్ళినపుడు మైగ్రెయిన్ ట్రిగ్గర్ అవుతుంది. అందుకని చలికాలంలో, ముఖ్యంగా నెలసరి వచ్చేముందు చలి నుంచి కాపాడుకునే ఏర్పాట్లు చేసుకోవాలి. అలాగే ఫ్యాన్ గాలికి కాని, ఎ.సి.కి గానీ నేరుగా పడుకోకూడదు. నేల చల్లగా ఉన్నపుడు కూడా కాలునేలకి తగలంగానే అటాక్ ప్రారంభమవచ్చు. దీనిని నివారించటానికి ఇంట్లో కూడా చెప్పులు వేసుకోవాలి. అలాగే మైగ్రెయిన్‌కి గురయ్యే వ్యక్తులు తీసుకున్న ఆహారం జీర్ణమైన తరువాతనే తరువాత ఆహారం తీసుకోవటం చేయాలి. ఆల్కహాల్‌ని మానివేయాలి. తగినంత నిద్ర ఉండేలా చూసుకోవాలి. సిగరెట్ తాగుతున్న వ్యక్తులకు లేదా ప్రదేశాలకు దూరంగా ఉండాలి. పెర్‌ఫ్యూమ్‌ను వాడకూడదు. ఇలా వ్యాధిని ప్రేరేపించే కారకాలను గుర్తించి వాటిని నివారించు కోగలిగితే విజయవంతంగా మైగ్రెయిన్ అటాక్‌ని నివారించవచ్చు.

***వ్యాధి లక్షణాలు అందరిలో ఒకేలాగా ఉండవు. ఒక్కొక్కరిలో ఒక్కోలాగా ఉంటాయి. ఒకే రోగిలో కూడా వివిధ సమయాలలో వివిధ రకాలుగా ఉండవచ్చు. సాధారణంగా అందరిలో కనిపించే లక్షణం మాత్రం తలనొప్పి. శరీరంలోని నాడీ వ్యవస్థ, జీర్ణ క్రియ వ్యవస్థలలో డిస్టర్బెన్స్ వలన తలనొప్పితోపాటు వివిధ ఇతర లక్షణాలు ఉంటాయి.***

మైగ్రెయిన్‌కి చేసే చికిత్స రెండు విధాలుగా ఉంటుంది. అటాక్ వచ్చిన తురవాత నొప్పిని తగ్గించటానికి ఇచ్చే మందులు, రెండు మైగ్రెయిన్ రాకుండా నివారించటానికి వాడే మందులు. నొప్పిని, మైగ్రెయిన్ అటాక్‌ని నిష్ఫలంచేయటానికి నొప్పి నివారణ మందులు పారాసెటమల్, ఆస్పిరిన్ లాంటివి, అటాక్ ఒక మోస్తరుగా ఉన్నపుడు ఇస్తారు. వీటితోపాటు వాంతులు తగ్గించటానికై మెటాక్లోప్రమైడ్, డోమ్‌పెరిడైన్ లాంటివి వాడతారు.

ఒకమోస్తరుకన్నా ఎక్కువ నొప్పి/ అటాక్ ఉన్నపుడు ఎర్గోటామైన్, ట్రిప్లాన్స్ వాడతారు. నొప్పి చాలా ఎక్కువగా ఉన్నపుడు నార్కొటిక్ ఇంజెక్షన్స్ ఇస్తారు. ట్రిప్టాన్స్‌లో.. నారా ట్రిప్టాన్, ఎలెట్రిప్లాన్ లాంటివి ఉన్నాయి. వీటిలో కొన్ని ఇంజెక్షన్స్‌గా, నాసల్ స్ప్రేలుగా కూడా దొరుకుతాయి.

మైగ్రెయిన్ రాకుండా నివారించటానికి బి-.... బ్లాకింగ్ వెజెంట్స్, కాల్షియం చానల్ బ్లాకర్స్, మెతి సెర్జిసూడ్, సైప్రోహెప్టాడిన్ లాంటివి వాడతారు. అయితే ఈమందులను నిరంతరంగా ఇవ్వకుండా కొంతకాలం ఇచ్చి చూస్తారు. రోగి ఈ మందులకు రెస్పాండ్ అయితే వైద్యులు వాటిని క్రమ క్రమంగా తగ్గిస్తారు.

మైగ్రెయిన్ అటాక్ నెలలో కనీసం నాలుగుసార్లు వస్తున్న, వచ్చిన అటాక్ 12 గంటలను మించి ఉన్నా నొప్పిని తగ్గించే మందులు సరిగా పని చేయకుండా ఉన్నా వైద్యులు రోగికి ఈ మందులను సూచిస్తారు. వీటిలో వయసు, మిగతా ఆరోగ్య పరిస్థితిని బట్టి ఎవరికి ఏ మందుని ఇవ్వాలనే దానిని నిర్ధారిస్తారు. ఉదాహరణకి స్త్రీలలో నెలసరి వచ్చే ముందు నొప్పి వస్తోందనుకుంటే అప్పుడే నివారణ మందులు సూచిస్తారు. అలాగే రోగి వయస్సు 60 సంవత్సరాలుండి సిగరెట్ తాగే అలవాటుంటే లేదా గుండెకు సంబంధించిన ఆరోగ్య సమస్యలుంటే బి బ్లాకర్స్ వాడతారు.

మైగ్రెయిన్ ఉన్న చాలా మంది మందులు వేసుకుని గడిపేస్తుంటారు. మైగ్రెయిన్ తరచూ ఎక్కువ నొప్పితో వస్తుంటే వైద్యులను సంప్రదించి తగిన ప్రణాళికతో మైగ్రెయిన్ వ్యాధిని ఎదుర్కొనటం ద్వారా సరియైన చికిత్సని పొందగలుగుతారు. లేదంటే ఇతరత్రా ఆరోగ్య సమస్యలు కొని తెచ్చుకున్న వారవుతారు. దేని వలన మైగ్రెయిన్ వస్తుందో గమనించి దానిని నివారించుకోవటం ఉత్తమం. ●

# లింగ వివక్షత - దృష్టి కోణాలు

ప్రపంచంలో ఎక్కడైనా విభిన్న సామాజిక తరగతులున్న చోట ఏ విషయంలోనయినా ఏకాభిప్రాయం ఉండటం కష్టమయిన విషయం. అందులోను ఎన్నో భాషలు, మరెన్నో కులాలు, మతాలూ, రకరకాల ప్రాంతాలున్న భారతదేశంలో ఏ ఒక్క విషయంపై ఏకాభిప్రాయం ఉండటం కష్టమే. కానీ ఇక్కడ మనం కులాల మధ్యో, మతాల మధ్యో, ప్రాంతాల మధ్యో ఉన్న వివక్షతను గురించి చర్చించడంలేదు. అన్ని కులాలు, మతాలు అన్ని ప్రాంతాలలో ఉన్న లింగ వివక్షతను గురించి చర్చిస్తున్నాం. గత కొన్ని రోజుల క్రితం శ్రీ నరేంద్ర మోదీ గారు భారతదేశంలోని ఆడపిల్లల భ్రూణ హత్యల గురించి మాట్లాడుతూ అదొక మానసిక రుగ్మత అని చెప్పుకొచ్చారు. "మనం ఇటువంటి పద్ధతులు అవలంభిస్తూ మనలను 21వ శతాబ్ధపు పౌరులుగా చెప్పుకోలేం" అన్నారు. ఇది భారతదేశంలో ఆడపిల్లల భ్రూణహత్యలు ఎంత అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నాయో, లింగ వివక్ష ఎంత ఎక్కువగా వ్యాపించి వుందో తెలియ జేస్తున్నది.

గత మూడు దశాబ్ధాలుగా పెరిగిన అక్షరాస్యత, విద్య, ఆర్ధిక పురోగతి, పట్టణీకరణ, లింగ వివక్షను తగ్గించి ఉంటాయని అనుకోవడం సహజం. లింగ వివక్షతలో కొంత పెరుగుదల ఉన్నప్పటికీ తరుగుతున్న బాలికల సంఖ్య, పెరుగుతున్న మహిళలపై దాడులు లింగ వివక్షతను రూపుమాపే మన గమ్యం ఇంకా చాలా దూరంలో ఉందన్న విషయాన్ని తెలియజేస్తున్నది. భారతదేశంలోని సగ భాగం పౌరులు గౌరవప్రదమైన జీవితాన్ని గడిపేందుకు ఇంకా శ్రమించవలసే ఉంది. ఈ లింగ వివక్షతని మనం రెండు కోణాల నుండి పరిశీలిద్దాం. ఒకటి కొడుకు పుట్టాలన్న కోరిక, రెండు అమ్మాయిలు 'తగిన' విధంగా దుస్తులు ధరించడం. 2001 నుండి 2011 మధ్యకాలంలో (0-6 సం॥ శిశువుల సంఖ్య ప్రతి వెయ్యిమంది అబ్బాయిలకి 927 నుండి 914కి పడిపోయింది. ఈ తరుగుదలను అర్ధం చేసుకునేందుకు లోక్ సర్వే ఒక సర్వేని చేపట్టి 'మీ కుటుంబంలో అమ్మాయిల కన్నా అబ్బాయిలకే ప్రాధాన్యమిస్తారా? అని ప్రశ్నించింది.

***వస్త్రధారణకి సమాధానం రాబట్టేందుకు రూపొందించిన ప్రశ్నాపత్రంలో ఇంట్లో గొడవలు జరగకుండా ఉండేందుకు 'మీ ఇంట్లో' అని అడగకుండా మీ పక్కింటి అమ్మాయి "ఏ రకమయిన వస్త్రధారణ చేస్తే మీకు తగిన వస్త్రధారణ అనుకుంటారని అడిగాం. అందుకు ఇచ్చిన సమాధానంలో పాంట్, షర్టు పొట్టి నిక్కరు లాంటివి చేర్చాం. 77% మంది పాంట్, షర్ట్ తగిన వస్త్రధారణ కాదనుకుంటే, 92% పొట్టి ఫాంట్స్ (షార్ట్స్) తగవనుకున్నారు. అయితే ఇందులో పల్లెల్లో నివసించేవారికి, పట్టణాలలో నివసించేవారికీ అభిప్రాయంలో తేడా ఉంది.***

ఇందుకు సమాధానంగా 34% మంది మగపిల్లలనే కోరుకుంటారని సమాధానమిచ్చారు. ఈ ప్రశ్న కొంచెం సున్నితమయినది. కొంతమంది మనసులో కోరుకున్నా సామాజికంగా వెనుకబాటు ఆలోచనలను ఒప్పుకునేందుకు సిద్ధంగా ఉండరు. అందుకని బయటకు చెప్పరు. అందువలన ఈ శాతం మరింత ఎక్కువే అని మనం గమనించాలి. ఈ లోటును సరిచేసేందుకు మేం ఒక ప్రశ్నా పత్రం ఇచ్చి పేరు చెప్పక్కర్లేదని చెప్పాం. ఈ పద్ధతిలో చూసినపుడు 48% మగపిల్లలు కావాలని కోరుతున్నారు. కొడుకు పుట్టాలని కోరుకునే వారు అన్ని కులాలలోనూ, అన్ని మతాలలోనూ, అన్ని ప్రాంతాలలోనూ, అన్ని తరగతులలోనూ అధికంగా ఉన్నారు.

**కులాల వారీ తేడాలు :**

రాష్ట్రాల వారీగా చూసుకున్నా మరే ఇతర సామాజిక సమస్యలపైనైనా బేధాభిప్రాయాలు ఉన్నాయి గాని ఈ విషయంలో అందరిదీ ఏకాభిప్రాయమే. అత్యధికంగా హర్యానాలో (78%) ఢిల్లీలో (65%) ఉన్నారు. ఈ రెండు రాష్ట్రాలలోనే మౌఖికంగా అడిగినప్పుడిచ్చిన సమాధానానికి, ప్రశ్నాపత్రంలో గుర్తింపు తెలియకుండా నింపిన సమాధానాలకూ గరిష్టంగా వ్యత్యాస ముంది. అంటే అబ్బాయిలకే ప్రాధాన్యత వున్నా బహిరంగంగా ఒప్పుకొనేందుకు సిద్ధంగా లేరన్న మాట! మధ్యప్రదేశ్ (59%), ఉత్తరప్రదేశ్ (58%), పంజాబ్ (55%) మగపిల్లలే కావాలని కోరుకున్నవారు ఆ తరువాతి స్థానంలో ఉన్నారు. ఈ విషయంలో కేరళ (15%) అట్టడుగున వున్నది. ఈ ప్రశ్నా పత్రం ఫలితాలకీ, జనాభాలో స్త్రీ, పురుష నిష్పత్తికి చాలా దగ్గరి పోలికుంది. అంటే ఈ ఫలితాలు అక్కడి ప్రజల మనోభావాలను ప్రతిబింబించినట్టే కదా!

ఈ లింగ వివక్షత మొదటిలో అబ్బాయి కావాలన్న కోరికతో మొదలయినా తరువాతి కాలంలో రకరకాల రూపాలను సంతరించుకుంటున్నది; తగిన జీవిత భాగస్వామి అనీ; వివక్షత రూపాంతరం చెందుతున్నది. ఇవి జీవితాలను మార్చేసే

ఎన్నికలు. ఈ వివక్షతకి మరో రూపం మహిళలు ఏం ధరించాలో నిర్ణయించే సామాజిక వ్యవస్థ.

వస్త్రధారణకి సమాధానం రాబట్టేందుకు రూపొందించిన ప్రశ్నావత్రంలో ఇంట్లో గొడవలు జరగకుండా ఉండేందుకు 'మీ ఇంట్లో' అని అడగకుండా మీ పక్కింటి అమ్మాయి "ఏ రకమయిన వస్త్రధారణ చేస్తే మీకు తగిన వస్త్రధారణ అనుకుంటారని అడిగాం. అందుకు ఇచ్చిన సమాధానంలో ఫాంట్, షర్టు పొట్టి నిక్కరు లాంటివి చేర్చాం. 77% మంది ఫాంట్, షర్ట్ తగిన వస్త్రధారణ కాదనుకుంటే, 92% పొట్టి ఫాంట్స్ (షార్ట్స్) తగవనుకున్నారు. అయితే ఇందులో పల్లెల్లో నివసించేవారికి, పట్టణాలలో నివసించే వారికీ అభిప్రాయంలో తేడా ఉంది. పల్లెలోని వారు 85% ఈ వస్త్ర ధారణకి అంగీకరించకపోగా 60% పట్టణ ప్రజలు ఇందుకు వ్యతిరేకించారు. పట్టణాలలో కూడా అధిక ఆదాయాలలోని కుటుంబాలవారు కుల, మతాల ప్రసక్తి లేకుండా ఈ రకమయిన మహిళల వస్త్రధారణకు సుముఖత చూపారు. పట్టణాలలో అట్టడుగు ఆదాయ వర్గంలో 65% స్త్రీలు ఫాంట్స్ వేసుకోవడం తగిన వస్త్రధారణ కాదని అనుకోగా 50% అత్యధిక ఆదాయం గలవారు అదే అభిప్రాయం వెలిబుచ్చారు.

వస్త్రధారణలో స్త్రీల పట్ల వెలిబుచ్చిన ఈ మితవాద భావాలు పట్టణాలలోని గరిష్ట ఆదాయాలున్న వర్గంలో చాలా తక్కువగా వున్న విషయం మనల్ని ఆశ్చర్యపరచదు. ఎందుకంటే వీరు ఈ రకమయిన పాశ్చాత్య నాగరిత తమ సామాజిక స్థాయిని పెంచుతుందని భావిస్తారు. మగపిల్లల విషయంలో లాగానే వస్త్రధారణ విషయంలో కూడా రాష్ట్రాలలో తేడాలున్నాయి. గోవాలో 23% మంది మహిళలు ఫాంట్స్ వేసుకునేందుకు ఇష్టపడకపోగా ఒరిస్సాలో 61% ఇష్టపడలేదు. హర్యానాలో 88% ఆంధ్రాలో 88%, బీహార్‌లో 86% మంది తమ అభిప్రాయాలను వెల్లడించేందుకు ముందుకు రాలేదు. ముంబాయిలో 28% మంది మాత్రమే మహిళలు ఫాంట్లు వేసుకొవడం తగిన వస్త్రధారణ కాదన్నారు. ఇదే అభిప్రాయాన్ని 61% దిల్లీ వాసులు, 54% కలకత్తా వాసులు వెల్లడించారు.

**సిగ్గుచేటయిన వాస్తవం :**

లింగ వివక్షత అన్నది భారతదేశ సామాజిక వ్యవస్థలో అత్యంత సిగ్గుచేటయిన విషయం. ఇది కేవలం అసమానత్వం, అన్యాయమే కాదు. ఏ సమాజమయినా సగం జనాభా సామాజిక వివక్షతకు బలి అవుతుంటే ఆ సమాజ భవిష్యత్ ప్రశ్నార్ధకంగానే ఉంటుంది. పట్టణ జనాభాలో కొంతమంది దుస్తుల విషయంలో కొంత ఉదారంగా ఉన్నా 'కొడుకు'ల విషయంలో మాత్రం పరిస్థితి అలా లేదు. ఈ వైఖరి భారత సమాజంలో ఎంతో లోతుగా వేళ్ళూనుకొని ఉంది. ఒక్క ఆర్థికాభివృద్ధి మాత్రమే తక్కువ మంది అమ్మాయిలు కావాలనుకొనే భావనను తొలగించలేరన్నది మనకు స్పష్టంగా తెలుస్తున్నది. ఈ వివక్షతను ఆ మూలాగ్రం తొలగించాలంటే సామాజిక వ్యవస్థలోనే కొన్ని మౌలికమయిన మార్పులు చేయాల్సి ఉంటుంది. అలా చేయనంత కాలం 'అబ్బాయే కావాలన్న 'ఆలోచనలో మార్పు కనుచూపు మేరలో కానరాదు.

రచయితలు : మెగాన్ ఎస్. రీడ్
డెనిసెల్వీనియాలోని సెంటర్ ఫర్ ఎడ్వాన్స్ స్టడీలో రీసెర్చి

కోఆర్డినేటర్ : దెవేష్ కపూర్
సి.ఎ.యస్.ఐ డైరెక్టర్

అనువాదం : కె. ఉషా రాణి

# మమ'కారం' - ఓ యాతనావస్థ

మనిషి జన్మకి
రెండే రెండు అతికష్టమైన
క్లిష్టమైన యాతనావస్థలట !
ఒకటి చేతనావస్థ
తల్లి గర్భం నుండి విడివడి
భూమి పైకి రావడం !

రెండు
తిరిగి శరీరం నుండీ
పంచప్రాణాలూ విడివడి
అచేతనావస్థని పొందడం !!

నడుమ జీవితమంతా
కర్మఫలమంటారు కొందరు
జ్ఞానవైరాగ్య సిద్ది కోసమే
ఈ తపన అంటారు మరి కొందరు

జీవితం
కష్టసుఖాల సమాహారం
సంసారం మహాసాగరం
ఎదురీత తప్పదంటారు అందరూ
కానీ
మాతృత్వం మరీ క్లిష్టమైనది

ఒప్పుకోవాలి అందరూ
నడుమ ఈ బంధాలు తెంచుకోవడం
ఎంత కష్టం ?
పేగు తెంచుకొని పుట్టిన బిడ్డకి
ఆ ఒడుపు నేర్పాడు ఆ పైవాడు
అమ్మ కెందుకు తెలియదో ఈ తత్వం ?
ముడివేసిన బంధాల్నీ విప్పలేదు
పేగు తెంచుకున్న
మమకారపు బంధాల్నీ తెంచుకోలేదు
మాతృత్వపు మమకారం ఓ యాతనావస్థ !!

– ఆర్. దుర్గా ప్రసన్న

# క్లస్టరు పాఠశాలల సాకుతో
# బడులను మూసి బాలికల భవితను దూరం చేస్తారా?

-కె విజయగౌరి

ఏదేశంలోనైనా, ఏరాష్ట్రంలోనైనా జాతి నిర్మాణానికి విలువలు కలిగిన విద్యార్థులను తయారు చేయాలంటే విద్యా వ్యవస్థ, విద్య అందుబాటులో ఉండాలని తెలిసికూడా ఆంధ్ర ప్రదేశ్‌లో ఊరూర పాఠశాలలను మూసివేయడానికి రాష్ట్ర ప్రభుత్వం పూనుకుంది. ఇప్పటికే అధికారికంగా సర్వేలు, గణాంకాలు పూర్తి చేశారు. వచ్చే విద్యా సంవత్సరం నుండి అమలుకు సిద్ధపడింది. 10 కి.మీ. దూరంలోగల పాఠశాలలన్నింటినీ ఒకచోటకు కేంద్రీకరించి ఒకే పాఠశాల ఏర్పాటుచేస్తారు. అవే క్లస్టరు పాఠశాలలు. గ్రామాలలో బడులు మూసేస్తారట. రాష్ట్రంలో 32,729 ప్రాథమిక పాఠశాలలు, 5,038 ప్రాథమికోన్నత పాఠశాలలు ఉన్నాయి. వీటన్నింటినీ 10కి.మీ. దూరంలోనికి కేంద్రీకరణ చేస్తేరట. ముందుగా రాష్ట్రంలో 3 జిల్లాలు అయిన విజయనగరం, చిత్తూరు, కడప జిల్లాల్లో పైలట్ పథకంగా నిర్వహిస్తామని ఆర్.సి. నం. 63, 1056/ఎస్ఎస్ఎ ఉత్తర్వుల ద్వారా ప్రభుత్వం స్పష్టం చేసింది.

ఆంధ్రప్రదేశ్‌లో అత్యంత వెనుకబడిన జిల్లాగా గల విజయనగరం మీద పాలకుల కళ్లు పడ్డాయి. నవంబరు నెల నుండే క్లస్టరు పాఠశాలలపై చర్చ జరుగుతుంది. తీవ్రమైన వ్యతిరేకత వచ్చింది. ఆజిల్లాల్లో ఇప్పటికే పోరుబాట పట్టారు. ఎందుకంటే గ్రామంలో ఉన్న బడికే వెళ్ళి చదువుకునే పరిస్థితులు ఉన్నాయి తప్ప 10కి.మీ దూరం పాఠశాలలకు వెళ్లే పరిస్థితులు లేవని ప్రజలు ఇప్పటికే చెబుతున్నారు. విజయనగరం జిల్లా అక్షరాస్యత 58.4%. అందులో స్త్రీ అక్షరాస్యత 49%. ఇప్పటికి ఇంకా 51% సాధించాలి. క్లస్టరు పాఠశాలలు ఏర్పాటుతో బాలికల విద్య ప్రమాదంలో పడబోతోంది. బాలికలు విద్యకు మరింత దూరం అయ్యే ప్రమాదం పొంచి ఉంది. ఎందుకంటే?

**1. ప్రజల భౌగోళిక, ఆర్థిక, సామాజిక పరిస్థితులు :-** విద్య అభివృద్ధి జరగాలంటే జిల్లాల్లోగల పారిశ్రామిక, వ్యవసాయ, ఉపాధి రంగాలపై ఆధారపడి ఉంటుంది. ఇప్పటికే పిల్లలు రకరకాల పనులు చేయనిదే ఇల్లు గడవని పరిస్థితులు చూస్తున్నాము. చదువుకోవాలనే ఆసక్తి ఉన్నా అననుకూల పరిస్థితులు ఉన్న కారణంగానే మహిళల్లో నిరక్షరాస్యత, బాలికలు విద్యకు దూరంగా ఉండటం గుర్తించిన అనేక విద్యా కమిషన్లు, కేంద్ర ప్రభుత్వం 1968 తరువాత గ్రామ గ్రామాన బడి ఉండాలని, 1కి.మీ. నుండి 2కి.మీ. దూరంలో బడిఉండాలని ఏర్పాటు చేసాక చదువుకునే పిల్లల సంఖ్య పెరిగింది. విద్యా హక్కు చట్టం కూడా గ్రామ గ్రామాన బడులు ఉండాలని, 6-14 సంవత్సరాల పిల్లలందరికీ నిర్బంధ ఉచిత విద్య అందివ్వాలని చట్టంలో సారాంశం. ఆ ఊరిలో బడి ఉంది గనుక చదువుకోగలిగే అవకాశం ఉంది. 10కి.మీ. దూరం పంపాలంటే సహజంగానే అనేక సమస్యలు ఆడపిల్లలను వెంటాడుతాయి.

మారుమూల గ్రామాల్లో పిల్లలంతా డ్రాపవుట్స్‌గా ఉన్నారు. అటువంటి ప్రాంతాలలో బడులు కావాలని ప్రజలు అడుగుతుంటే ప్రభుత్వం మాత్రం బడులను మూసే ఉద్యమంలో ఉంది. దీనితో బాలికలకు విద్య దూరం అవుతుంది.

**2. పెరిగిన బాలికల నమోదు :-** ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజన పథకం అమలుచేయడంతో గణనీయంగా నమోదు పెరిగింది. మొత్తం నమోదులో బాలికల నమోదు బాగా పెరిగింది. ఉన్న బడిని మూస్తే బాలికలకు ప్రత్యేక అవసరాలకు ఇబ్బందులు పడే పరిస్థితులు ఉన్నాయి.

**3. మధ్యాహ్న భోజనపథకం నిర్వాహకుల పొట్టకొడతారు :-** ఈ రాష్ట్రంలో ప్రభుత్వ పాఠశాలల్లో 2003, జనవరి1 నుండి ఈ పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం మంచి ఫలితాలను ఇచ్చింది. దీనివలన ఎన్‌రోల్‌మెంటు బాగా పెరిగింది. అందులో ఆడపిల్లల నమోదు బాగా పెరిగింది. పథకంలో కొన్ని బలహీనతలు ఉన్నప్పటికీ మా ఊరు పిల్లలు, మా పిల్లలు అని స్వంతం చేసుకుని వండి పెడుతున్నారు. పంచభక్ష పరమాన్నాలు పెట్టకపోయినా సమయానికి వేడి పదార్థాలు అందివ్వగలుగుతున్నారు. రోగాలకు తావులేని వేడి పదార్థాలు పెడుతున్నారు. కాని ఈనాడు క్లస్టర్ విధానాన్ని అమలుచేస్తే ఇటువంటి కార్మికులందరినీ ఇండ్లకు పంపించేస్తారు. వెనువెంటనే టెండర్లను ఇస్కాన్ లాంటి సంస్థకు అప్పగిస్తారు. ఆ సంస్థ పాచిపోయిన భోజన పాకెట్లను మొబైల్ వ్యానుల ద్వారా పాఠశాలల్లో పడేస్తుంది. కార్మికుల జీతాలు ఇవ్వక్కరలేదు. మధ్యాహ్నభోజనాన్ని ప్రభుత్వం చూడక్కరలేదు. ఈ విధంగా విద్య నుండి బాధ్యతను వదులుకోవడానికి ఈ విధానాలు తెస్తుంది. విజయనగరం లాంటి జిల్లాలో ఈ పథకాన్ని నమ్ముకుని సుమారు 7వేల మంది కార్మికులు పనిచేస్తున్నారు.

*(తరువాయి 29వ పేజీలో)*

కథ

# పితృత్వం

- మల్లీశ్వరి



గత పదిహేను రోజులుగా నా మనసులో ఉన్న సందేహాన్ని డాక్టర్ కన్‌ఫాం చేసింది. నేను గర్భవతిని అని. రెండో నెల నిండుతోందని. ఆ వార్త వినగానే నాకు గర్వంగా అన్పించింది. నేనో అద్భుతాన్ని ఆవిష్కరించబోతున్నాను కదాని.

అప్పట్నుంచీ నా భర్త చంద్రశేఖర్ నన్ను మరింత అపురూపంగా చూడసాగాడు. దాంతో నేను ఓ ప్రత్యేకమైన వ్యక్తిని అన్న భావం బలపడుతుండేది.

దానికి తోడు ఏ పుస్తకం చదివినా, టివి చూసినా సినిమా చూసినా మాతృత్వపు గొప్పదనం గురించి, ఆడవాళ్ళు తమ బిడ్డల కోసం చేసే త్యాగాల గురించి రకరకాల సంఘటనలు వుండేవి. అవి మనసుని ఉత్సాహభరితం చేసేవి. నాకు ఏడో నెల నిండింది... యింకో నెలాగి చేసే ప్రయివేటు లెక్చరర్ ఉద్యోగానికి కొన్నాళ్ళు శెలవు పెట్టాలనుకున్నాను.

అలాంటి సమయంలోనే క్రమంగా నాలో మార్పు రావడం ప్రారంభమయింది. విచిత్రంగా ఆ మార్పుని వేరెవరో గుర్తించి చెప్పలేదు. నాకు నాకే తెలుస్తోంది. యిదివరకులా పుట్టబోయే బిడ్డని తలచుకుంటే మాతృగర్వంతో పులకరింతలు రావడంలేదు. సరికదా, బిడ్డని నేను సక్రమంగా పెంచగలనా ? అని భయం పట్టుకుంది.

ఎందుకంటే పిల్లల పెంపకం మీద నాకు కొన్ని స్థిరమయిన అభిప్రాయాలున్నాయి. పిల్లల్ని కొట్టకూడదు. మంచి మాటలతో వారికి క్రమశిక్షణ నేర్పాలి. మనమే వారి ప్రపంచంలోకి వెళ్లి వారి కష్టసుఖాలని అర్థం చేసుకుని తదనుగుణంగా మెలగాలి... మొదలైనవి.

నారు పోసిన వాడే నీరు పోస్తాడన్న మూఢనమ్మకం నాకు లేదు. ఆలోచించేకొద్దీ పిల్లల్ని పెంచడం అంత సులువు కాదు అన్న విషయం నాకు బోధపడింది.

ఉదయం యింట్లో పనులు చేసుకుని కాలేజికి వెళ్లి అక్కడ పిల్లల్ని సక్రమంగా తీర్చిదిద్దే కార్యక్రమం నిర్వహించి మళ్లీ సాయంత్రం యింటికొచ్చి ఇంటి పనులు ముగించి వ్యక్తిగత సరదాలకి సమయం ఉండటం లేదే అని బాధపడుతున్న ఈ తరుణంలో తమ బిడ్డకి జన్మనిస్తోంది. సరిగా పెంచలేమోనని భయం కలిగేది.

ఈ భయం నాలో ఆత్మవిశ్వాసం లోపించడంవల్ల కలిగిన భయం కాదు. పిల్లల్ని పెంచడం ఎంత క్లిష్టతరమైన బాధ్యతో గుర్తించడం వలన కలిగిన భయం.

ఎవరితోనన్నా చర్చిస్తే "యింత చిన్న విషయానికా? లోకంలో అందరూ కనడం లేదా? నువ్వొక్కదానివే కంటున్నావా?" అని వేళాకోళం చేస్తారని తెలును. ఈ దిగులు మనసులో అంతర్గతంగా పెరిగిపోతుండగా ఓ రోజు పక్కింటి గీత వచ్చింది. తను కలెక్టరాఫీసులో క్లర్కుగా చేస్తోంది. వాళ్ళాయన పేరుమోసిన బ్యాంక్‌లో మేనేజర్‌గా చేస్తున్నాడు. వాళ్ళకి నాలుగేళ్ళ బాబు ఉన్నాడు. గీత కూడా యిప్పుడు గర్భవతి.

వాళ్ళ దాంపత్యం చాలా అన్యోన్యంగా సాగుతున్నట్లుగా అందరికి అన్పించేది. వాళ్ళ బాబు మేనర్స్ చూస్తే చాలా ముచ్చటేస్తుంది. బయటకి వస్తే ఎంతో బుద్ధిగా, అల్లరి చేయకుండా వుంటాడు. క్లాసులో వాడిదే ఫస్ట్ ర్యాంక్ అట. గీతని లోనికి ఆహ్వానించి సోఫాలో కూర్చోమన్నాను. "ప్రశాంతీ! రేపు రాత్రికి సిటీ కేబుల్‌లో మావారి గురించిన పరిచయ కార్యక్రమం టెలీకాస్ట్ అవుతుంది. లయన్స్ క్లబ్‌వారు ఈ మధ్య ఈయనకు అవార్డ్ యిచ్చారు కదా ! అందుకని ఈ ప్రోగ్రాం ఎరేంజ్ చేశారు. నేనూ బాబు కూడా వున్నాం'అని మొహమాటపడుతూ చెప్పింది.

తప్పకుండా చూస్తానని చెప్పి పంపించాను.

మర్నాటి రాత్రికి చందుని కూడా కూర్చోబెట్టి ఆ కార్యక్రమం చూపించాను. అందులో ఆయన ఎంతో గంభీరంగా భార్యా, బిడ్డల మీద అవ్యాజునురాగంతో మాట్లాడారు. తను సాధించిన ఈ విజయం వెనుక వున్నది తన భార్యేనని, యింటి పనులూ, బయటి పనులూ, బాబు పెంపకం, వాడి చదువూ తన భార్య చూసుకోవడం వల్లే తను యిదంతా సాధించానని ఆయన ఒక్క మాటలో క్రెడిట్ అంతా భార్యకే యిచ్చేశాడు. ఇతను ఒక్కడే కాదు. సమాజంలో విజయం సాధించిన చాలా మంది మగాళ్లకి యింటి పనులూ, బిడ్డల పెంపకం గురించి ఏమీ తెలీదు. అదంతా భార్యలే చూసుకుంటారని యిలాంటి కార్యక్రమాల్లో ప్రముఖులు చెప్పగా వింది. అప్పట్నుంచీ మరీ దిగులు ఎక్కువైంది. యిపుడు చందూ విజయం సాధించాలంటే యివన్నీ నేనొక్కదాన్నే చూసుకోవాలి. 'మరి నువ్వు విజయం సాధించాలంటే' ? అని నా మనసు ఓ కొంటె ప్రశ్న వేసిందంటే తప్పు నాది కాదు.

చివరకు ఓ రోజు ఆపుకోలేక నా సందేహాలన్నీ చందూకి చెప్పాను. యివన్నీ కొత్తగా అన్పించాయో ఏమో తెల్లమొహం వేశాడు. చివరికి తేరుకుని "మరి లోకంలో అందరూ మాతృత్వపు గొప్పదనం గురించి చెబుతున్నారుగా ! తల్లి క్రమశిక్షణలో పెరిగిన

పిల్లలే గొప్ప వాళ్ళవుతారని. ఎంతోమంది చదువులేని వాళ్ళూ మూఢనమ్మకాలతో వుండేవాళ్ళు.. వాళ్ళే చలాగ్గా, అలవోగ్గా ముగ్గురు, నలుగురు పిల్లల్ని పెంచుతున్నారు. నువ్వు పెంచలేవా? నువ్వే సందేహాలు పెట్టకోకు. నీలో ఆ శక్తి ఉంది" అన్నాడు.

చందూ చెప్పినంత సేపూ నిజంగానే నాకేవో అతీత శక్తులు వచ్చి పడిపోయినట్లుగా అన్పించింది. యిక ఆ తర్వాత వ్యతిరేక ఆలోచనల్ని పారదోలి మా యిద్దరి జీవితాల్లోకి కొత్త శోభని తీసుకువచ్చే చిన్నారికోసం ఎదురు చూడటం ప్రారంభించాను.

నా డెలివరీ టైమ్‌కి అమ్మ యిక్కడికి వచ్చింది. హాస్పిటల్లో సుఖప్రసవం అయి పాప పుట్టింది. మూడో రోజునే యింటికి వచ్చేశాం.

పాప పుట్టిన వెంటనే చందూ నా దగ్గరికి వచ్చి "అందరూ పాప నీ పోలికే అంటున్నారు"అని అలిగినట్లు మొహం పెట్టాడు. అది చూసి నవ్వొచ్చింది. అంతే.. యిక అదే మనస్ఫూర్తిగా నవ్వడం.. తర్వాత అంతా కంగారూ, భయాలతోనే రోజులు గడుస్తున్నాయి. పాపని ఎత్తుకోవడం, మాటి మాటికీ పక్క తడుపుతుంటే మార్చడం, వాటిని వుతకడం యివన్నీ అమ్మా, నేనూ చేసేవాళ్ళం. దానికి తోడు యింటిపని అంతా చేయాల్సి రావడంతో అమ్మకి కూడా కష్టంగానే ఉండేది. బాగా అలిసిపోయేది.

అందుకే చాలా వరకూ పాప పనులు నేనే చేసుకోవాలనుకునేదాన్ని. కానీ పగలంతా నిద్రపోయే పాప రాత్రయ్యేసరికి మేలుకుని అయిందానికీ, కాని దానికీ రాగాలు తీసేది. ఒకోసారి ఎందుకేడుస్తుందో తెలీక బెంబేలెత్తిపోయేదాన్ని.

రాత్రుళ్ళు నిద్ర చాలక కంటి కురుపులు లేచాయి. డెలివరీ అయ్యాక వచ్చే కొన్నిరకాలయిన శారీరక మార్పుల వల్ల డిప్రెసివ్‌గా ఉండేది. మాతృ గర్వ, పులకరింతల స్థానంలో నిస్సహాయత, భయం చోటు చేసుకున్నాయి.

పాపకి చిన్నమెత్తు యిబ్బంది కూడా కలగకుండా చూసుకోవడానికి సర్వశక్తులూ ఒడ్డాల్సివస్తోంది.

ఓరోజుఅర్ధరాత్రి పన్నెండింటి వరకూ యిలాంటి పనులతోనే అలిసిపోయి అపుడే నిద్రలోకి జారాను. యింతలో పక్కనే ఉయ్యాల్లో ఉన్న పాప కయ్యిన రాగం అందుకుంది. చెవులకి ఏడుపు వినబడుతోంది. కళ్ళు విడివడటంలేదు. వళ్ళంతా నిస్సత్తువుగా వుంది. లేవాలనుకుంటున్నాను లేవలేకపోతున్నాను... ఆ పరిస్థితికి తలలోని రక్తనాళాలు చిట్లిపోతాయా అన్నంత టెన్షన్‌గా ఉంది. నిద్ర ఎంత విలువైందో తెలిసివస్తోంది.

పాప ఏడుపు మరింత అధికం అయింది. నెమ్మదిగా కళ్ళు విప్పి పక్కకి చూశాను. అమ్మ ఆదమరిచి నిద్రపోతోంది. రెండు మూడు సార్లు పిలిచాను. నిద్రలో వినబడలేదామెకి.

పక్కగదిలోంచి చందూ లేచి రావడం మూసుకుపోతున్న నా కళ్ళకి అస్పష్టంగా కన్పించింది.

'ప్రశాంతి...'నా బుగ్గమీద తడుతూ లేపబోయాడు. లేవలేకపోయాను....చందూ గది నుంచిబైటకి బయటికి వెళ్ళిపోయాడు.

పాప ఏడుపు మరింతగా పెరిగింది. మూసుకున్న నా కంటి చివర్ల నుంచి నిస్సహాయంగా కన్నీరు జారింది. ఆ సమయంలో ఆ అసహాయస్థితిలో పాప ఏడుపు చటుక్కున ఆగింది.

డెట్టాల్ సోప్ వాసన ముక్కుపుటాలని తాకింది.

అపుడు ఓ అమృత హస్తం నా తలని మృదువుగా నిమిరింది. ఓ ఆత్మీయమూర్తి ఒడిలో పాప కాళ్ళూ చేతులు విదిలిస్తూ ఆడుకుంటోంది. ఆ ఆపద్బాంధవుడు నా చందూ. తన గంభీర కంఠంతో లాలిపాట మొదలుపెట్టాడు.

"నా చిన్నారి తల్లికీ బంగారు వడ్డాణమూ...

నా చిట్టి పాపకీ ముత్యాల హారమూ...

ఆపాట పాపకో నాకో తెలీదు.. ఆదమరిచి నిద్రపోయాను.

అంతే! ఆరోజు నుంచీ వాళ్ళిద్దరి మధ్యా ఓ కొత్త అనుబంధం రూపుదిద్దుకుంది. అలా ఆ రోజు పాపని ఒడిలోకి తీసుకున్న చందూ మరెన్నడూ ఆ బాధ్యతని వదిలిపెట్టలేదు. ఈ పని నేను చేయొచ్చా లేదా అన్న ఆహాన్ని వదిలి సమస్త సేవలూ పాపకి చేశాడు.

ఇద్దరం ఉద్యోగాలు చేస్తున్నాం. యిద్దరం ఇంటిపనులు చేసుకుంటాం. చివరికి యిద్దరం కలిసి పాపని పెంచుతున్నాం. . యిది మా ముగ్గురి మధ్యా మరింత ఆత్మీయతని పెంచింది.

ఇపుడు ఏ పనీ కష్టంగా లేదు. అన్నీ యిష్టంగా ప్రతి క్షణాన్నీ ఆనందకరంగా మలుచుకుంటున్నాం.

నాకిపుడు అన్పిస్తోంది. పిల్లల్ని తల్లి మాత్రమే కనగలదు. కానీ ఎవరైనా, తండ్రయినా చక్కగా పెంచొచ్చు అని.

పాపకి ఆరేళ్ళు నిండాయి. ఎంత వద్దనుకున్నా ఒకోసారి యితరుల పిల్లలతో పోల్చి చూస్తే మా పాప పెంకిగా అన్పించడం మొదలయింది.

ఒక్క క్షణం కుదురుగా కూర్చోదు. కూర్చున్నా, నిల్చున్నా, కాళ్ళూ, చేతలూ డాన్స్ చేస్తూనే ఉంటాయి. ఆఖరికి స్కూల్లో టీచరు కూడా "మీ పాప ఏదన్నా ఆన్సర్ చెప్పేటపుడు కూడా డాన్స్ చేస్తూనే ఉంటుందండీ.."అనేసింది.

ఇదేదో జబ్బో అనుకుని ఓసారి చందూతో అంటే 'అదేం జబ్బు కాదు. పాపలో ఉన్న చైతన్యానికి చిహ్నం...'అని తెలివిగా చెప్పుకొచ్చాడు.

ఇక పడుకునేప్పుడు వాళ్ళ నాన్న పొట్టమీద కాళ్ళూ, చేతులూ పడేసి అతని హృదయ సామ్రాజ్యానికి తనే బుల్లిరాణి అన్నంత దర్జాగా నిద్రపోయేది. ఒకోసారి వాళ్ళ నాన్న పొట్ట నిమురుతూ "నాన్నా! నేను అమ్మ పొట్టలోంచి కాకుండా నీ పొట్టలోంచి వచ్చి వుంటే బాగుండేది"అంటుంటే చందూ మురిసిపోవాలో, నన్ను సముదాయించాలో తోచక సతమతమవుతుంటే నాకు ఆనందంతోపాటు అసూయ కూడా కలిగేది.

మా పక్కింటి గీతకి రెండో కాన్పులో ఆడపిల్ల పుట్టింది. యిద్దరు పిల్లలూ ముత్యాల్లాగా వుంటారు. యింట్లోంచి చిన్న శబ్దం కానీ అల్లరి కానీ విన్పించేదికాదు. వాళ్ళింటికి ఎపుడన్నా వెళితే పిల్లలు చదువుకుంటూ కన్పించేవారు. అటూ యిటూ గెంతడం, పరిగెత్తడం, దూకడం లాంటి మా పాప విద్యలు వాళ్ళు అసలు ప్రదర్శించేవారు కాదు.

మా పాప వుందంటే ఎప్పుడూ వాళ్ళ నాన్న మీదకో, నా మీదకో ఎగిరి ఒళ్ళోకి దూకడం. చందూ నడుస్తుంటే అతన్ని పట్టుకుని వేలాడ్డం.. లాంటి క్రమశిక్షణారహిత చర్యలు చేసేది.

"అసలు దీన్ని పెంచే విషయంలో నిన్ను పాల్గొననివ్వడం పొరపాటయింది. అందుకే యిదిలాతయారయింది. చక్కగా పక్కింటి గీతలాగా నేనే పెంచి వుంటే వాళ్ళ పిల్లల్లాగా యిది కూడా బుద్ధిగా ఉండేది" అతనికి కోపం వస్తుందని కూడా ఆలోచించకుండా అనేశాను.

చిత్రంగా కోపం తెచ్చుకోలేదతను. నవ్వేసి కూతుర్ని గుండెలకి హత్తుకుని "ఆ రోజు నేను నీ కష్టం చూడలేక పాపని ఒళ్ళోకి తీసుకున్నాను. ఆ తర్వాత నుంచీ తెలిసి వచ్చింది. పాప హృదయానికి దారి ఏదో. కన్నతల్లి బిడ్డకి ఏమే పనులు చేస్తుందో అవన్నీ నేనూ చేశాను. తల్లిదండ్రులిద్దరి బాధ్యతాయుతమైన సేవలు, ప్రేమ పొందింది కాబట్టి పాపలో అభద్రతాభావం లేదు. అందుకే ఆ చలాకీతనం... అది క్రమశిక్షణ లేకపోవడంగా నీకనిపిస్తోంది. ఆలోచించి చూడు.

మా కొలీగ్స్, మిగతా ఫ్రెండ్స్ అందరూ పిల్లల పనులు చేయడం నామోషీగా ఫీలవుతారు. కానీ వాళ్ళకి తెలీదు వాళ్ళేం కోల్పోతున్నారో!

ఆ రోజు పాప "నాన్నా ! నేను నీ పొట్టనుంచి వస్తే బావుండును" అని అందంటే అది అల్లరిగానో, వూసుపోక అన్నమాటోకాదు. ఆ మాట వెనుక నా మీద పాప పెంచుకున్న ఓ బలమైన బంధం, నమ్మకం కనిపించడంలేదూ.." అంటూ ఆనందంతో కన్నీళ్ళు పెట్టేసుకున్నాడు.

ఈ చర్చతో ఓ వారం శాంతించినా బ్రష్ చేయడానికీ, మంచి నీళ్ళు తాగడానికి పేచీలు పెడుతూ రాగాలుతీస్తున్న పాప పెంకితనాన్ని భరించలేక దాన్ని గట్టిగా కేకలెయ్యమని చందూకి వార్నింగిచ్చాను.

ఓ ఫైన్ మార్నింగ్ సింక్ దగ్గర సదరు తండ్రి గారి కేకలు గట్టిగా వినబడ్డాయి.

ఈ పిల్లేమో వంటగదిలో నా వెనుక తచ్చట్లాడుతోంది.

"ఏం చేశావేంటి? నాన్న కేకలేస్తున్నారు?"అన్నాను.

"ఏం లేదులేమ్మా లయన్ రోరింగ్"అంది పాప.

"ఏంటి" అర్థంకాక అడిగాను.

"అప్పుడొకసారి జూకెళ్ళినపుడు చెప్పావుగా ! సింహం అడవికి రాజు, గర్జించటం దానికి వుండే లక్షణం. భయపడకూడదు.. అదన్న మాట..."అనేసి చక్కాపోయింది.

నాన్న కేకలేస్తే భయపడటం పోయి చమత్కారంగా విషయాన్ని ఎక్కడినుంచి ఎక్కడికో కలిపేసి తనకొచ్చిన ఉపద్రవాన్ని తప్పించేసుకుంది.

ఇక లాభం లేదనుకుని వాళ్ళ తాతగారికి చెప్పి అదుపు చేయమన్నాను. ఓ రోజు పాప మరీ గొడవ చేస్తుంటే చెయ్యెత్తి "అల్లరి చేశావంటేనా ? కొడతాను"అన్నారే గానీ చెయ్యి గాల్లో ఆడుతోంది తప్ప వీపు మీదకి రాదు.

ఇదేమో ఆయన చెయ్యి వంకా, మొహం వంకా మార్చి మార్చి చూసి "వూరుకోండి తాతగారూ !! మీరు మరీనూ" పెద్దరికంగా అనేసి ఆయన కోపాన్ని పేలపిండిలా ఎగరకొట్టేస్తుంటే ఆయన మాత్రం ఏం చెయ్యగలిగారనీ మొహం పక్కకి తిప్పుకుని ముసి ముసిగా నవ్వుకోవడం తప్ప.

ఈరకంగా తన చిన్ని ప్రపంచంలో తనకి ఎదురయ్యే సవాళ్ళని అత్యంత సమర్థనీయంగా ఎదుర్కొంటూ చిలుకలు వాలిన చెట్టు మా యింట్లో నడుస్తున్నట్లుగా చైతన్యవంతంగా వుండేది పాప.

ఇలాంటి సమయంలోనే నేను చూసిన ఓ సంఘటన నాకు మా పెంపకంపట్ల నమ్మకాన్ని కలిగించింది.

ఓ రోజు గీత వాళ్ళింట్లో ఉన్న కంప్యూటర్‌లోకొత్త సాఫ్ట్‌వేర్ లోడ్ చెయ్యడానికి తనకి అది అర్జెంటని ప్లీజింగ్‌గా అడిగితే కాదనలేక ఉదయం పనులన్నీ చందూకి అప్పగించి వెళ్ళాను.

అప్పటికి గీత యింట్లో పనులతో బిజీగా ఉంది. నన్ను సిస్టమ్ దగ్గర కూర్చోబెట్టి తను పనుల్లో పడిపోయింది. వాళ్ళాయన పేపర్ చదువుకుంటున్నాడు. యిల్లంతా చాలా నిశ్శబ్దంగా ఉంది. ఎవరి పనుల్లో వాళ్ళున్నారు తప్ప ఎవరూ అనవసరంగా ఒక్కమాట కూడా మాట్లాడటం లేదు.

వాళ్ళాయన కూర్చున్న దగ్గర నుంచి కదలకపోవడమే కాక "గీతా కాఫీ.. గీతా నీళ్ళు తోడావా?" అంటూ అడగటం చూస్తుంటే కంపరమెత్తింది.

యింకోపక్క గీత యుద్ధ సన్నాహాల్లో వున్నంత టెన్షన్‌గా

**పాప ఏడుపు మరింతగా పెరిగింది. మూసుకున్న నా కంటి చివర్ల నుంచి నిస్సహాయంగా కన్నీరు జారింది. ఆ సమయంలో ఆ అసహాయస్థితిలో పాప ఏడుపు చటుక్కున ఆగింది. డెట్టాల్ సోప్ వాసన ముక్కుపుటాలని తాకింది. అపుడు ఓ అమృత హస్తం నా తలని మృదువుగా నిమిరింది. ఓ ఆత్మీయమూర్తి ఒడిలో పాప కాళ్ళూ చేతులు విదిలిస్తూ ఆడుకుంటోంది. ఆ ఆపద్బాంధవుడు నా చందూ. తన గంభీర కంఠంతో లాలిపాట మొదలుపెట్టాడు.**

**"నా చిన్నారి తల్లికీ బంగారు వడ్డాణమూ...**
**నా చిట్టి పాపకీ ముత్యాల హారమూ...**
**ఆపాట పాపకో నాకో తెలీదు.. ఆదమరిచి నిద్రపోయాను.**

ఉంది... నిజమే మరి యిద్దరు పిల్లలతో అన్ని పనులూ ముగించుకుని తనూ ఆఫీసుకి వెళ్ళాలంటే ఎంత కష్టం? వర్క్ మధ్యలో ఏదో డౌటొచ్చి అడగడానికి డైనింగ్ రూం వైపు వెళ్ళి అక్కడి దృశ్యాన్ని చూసి తెల్లబోయాను.

గీత కోపంగా కళ్లు పెద్దవి చేసి వాళ్ళ పాపని భయపెడుతూ "వూ! పాలు తాగు.."పంటి బిగువున సాధ్యమైనంత కఠినంగా అంటోంది.

"వద్దమ్మా ! కడుపు నొప్పిగా ఉంది" కడుపు పట్టుకుంటూ భయంగా అంటోంది ఆ పాప.

"కడుపు నొప్పా ? గాడిద గుడ్డా ? స్కూలు ఎగ్గొట్టడానికి యిదో వంక...తాగు..' జబ్బ దగ్గర గుచ్చి పట్టుకుంటూ అంది గీత.

డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చొని టిఫిన్ తింటున్న గీత అత్తగారు "మా కాలంలో అయితేనా... పిల్లలు ఆం అంటే ఆగేవారు. ఓసారి కళ్ళెర్రచేస్తే వుచ్చ పోసేవారు. యిప్పటి పెంపకాలా...?" పుండుమీద కారం జల్లుతూ అంది.

అప్పటి గీత మానసిక పరిస్థితిని వూహించగలను. కానీ అంత వైల్డ్‌గా రియాక్టవుతుందనుకోలేదు.

పిల్ల వీపు మీదా, చెంపల మీదా ఛెళ్ళున చరుస్తూ "వూ! తాగు..లేకపోతే డాడీకి చెపుతాను.. 'రౌద్రంగా అంది. అంతే ఆ పాప మొహంలో విపరీతమయిన భయం.

ముంచుకొస్తున్న ఏడుపుని ఓ చేత్తో నోరు మూసుకుని అదుపు చేసుకుంటూ యింకో చేత్తో గ్లాసందుకుంది.

"ఏంటీ గొడవ...?" యిన్‌షర్ట్ సరిచేసుకుంటూ వచ్చాడతను. కడుపులో లుంగలు చుట్టుకుంటున్న దుఃఖానికో, భయానికో ఆ పాప తాగిన పాలు భళ్ళున వాంతి చేసుకుంటుంటే అది తుళ్ళి అతని మీద పడుతుంటే అతను కూతుర్ని నిర్దాక్షిణ్యంగా తోసేస్తూ "ఛీ ఛీ... వెధవగోల... యిపుడు మళ్ళీ బట్టలు మార్చుకోవాలి..." అని మొహం కంపరంగా పెట్టి వెళ్ళిపోతుంటే తనకి మరింత పనిని పెంచినందుకు గీత మళ్ళీ పిల్లని నాలుగు దెబ్బలు వేసింది.

ఆ సంఘటనకి నిశ్చేష్టురాలినయ్యాను. ఆ పాప కళ్ళలోని అపనమ్మకాన్ని, భయాన్ని చూస్తుంటే కడుపులో దేవేసింది. పాప అన్న చెల్లిని లేపి, మొహం కడిగా మంచి నీళ్ళిచ్చాడు. ఆ బాబు కళ్ళలో చెల్లి పట్ల స్పష్టంగా జాలి కనపడింది. కనీసం ఆ మాత్రం జ్ఞానం అయినా తల్లిదండ్రులకి లేకపోయిందే అన్న బాధ మొదలయింది. వెనుతిరగబోతుండగా చూసింది గీత, నన్ను చూసి బలవంతగా నవ్వుతూ "ఎపుడూ ఉండేదే యిది. పిల్లలెపుడూ నాలుగు తగిలితే కానీ తోవలోకి రారు...' అంది.

నిజమా ! నాలుగు తగిలితే తోవలోకి వస్తారనుకుంటే దానిపట్ల నిబద్ధతతోకొట్టాలి. అత్తగారి మీద కోపాన్ని, తనలోఉన్న అసంతృప్తిని యిలా చూపిస్తే ఎలా ? మనసులోని ఆవేదన బైటకి వచ్చేలోపు యింటికి వచ్చేశాను.

అప్పటికే తండ్రి కూతుళ్ళిద్దరూ ఎవరి పనిమీద వాళ్ళు వెళ్ళిపోయారు. నేనూ అన్యమనస్కంగానే కాలేజికి వెళ్లొచ్చాను.

పాప స్కూలునుంచి రాగానే గుండెలకి హత్తుకున్నాను.

'ఏంటమ్మా...?" నా మొహాన్ని చూసి ఏదో వుందని కనిపెట్టేసి అడిగింది.

"నేను గానీ, నాన్న గానీ ఎపుడన్నా తిడితే నీకు బాధనిపిస్తే కాసేపాగి మాకు చెప్పాలి..' అన్నాను.

"అలాగే.. మీకు బాధేసినా నాకు చెప్పండి"అంది.

నవ్వేసి దాని బుగ్గలు ముద్దాడాను. ఓ అరగంట ఆడుకుని ఆటలు బోర్‌కొట్టి చదువుకుంటానని లోపలికి వెళ్ళింది.

నేను యింటి ముందు తోటలో కలుపు వుంటే తీస్తున్నాను. పక్కింటికీ, మాకూ మధ్య పిట్టగోడ ఎత్తు తక్కువ కావడంతో వాళ్ళ కాంపౌండ్ మాకు స్పష్టంగా కనిపిస్తుంది.

గీత అక్కడ కూర్చుని మొక్కలకి పాదులు చేస్తోంది. యిద్దరు పిల్లలూ ఉదయం జరిగింది మర్చిపోయి స్వేచ్ఛగా నవ్వుతూ ఆడుకుంటున్నారు.

పిల్లలు ఎంత తేలిగ్గా క్షమించగలరు ? నవ్వుకుంటూ తల తిప్పుకోబోతుండగా జరిగిందా సంఘటన.

వీధి చివరి వాళ్లాయన కారు కన్పించగానే గీత కంగారుగా "డాడీ వచ్చేస్తున్నారు.. వెళ్ళండి.. చదువుకోండి...' అంది. పిల్లలు పెద్దపులి నుంచి తప్పించుకోవాలన్న భయంతో పరుగులుపెట్టారు. ఆ హడావుడిలో బాబు కాలికేదో తగులుకుని బొక్కబోర్లా ముందుకు పడ్డాడు. వరండా అంచు నుదుటికి తగిలింది. నుదుటి నుంచి రక్తం కారడం స్పష్టంగా కన్పిస్తోంది.

అయ్యయ్యో ! అంటూ నడవబోయాను. కానీ ఆ బాబు లేచి చేతిని అడ్డుపెట్టుకుని దెబ్బ కనపడకుండా వుండేలా ప్రయత్నిస్తూ వరండాలో వున్న చాపమీద కూర్చుని పుస్తకాలు తెరిచాడు. చిన్న శబ్దం కూడా గొంతు నుంచి రానివ్వలేదు. వాళ్ళ నాన్న వచ్చి చదువుకుంటున్న పిల్లల్ని చూడగానే ఏడుపొచ్చినట్లుంది. గుడ్ల నీళ్ళు గుడ్లకుక్కుకుంటూ చదువుతున్నాడు.

నివ్వెరపోయి చూస్తుండిపోయాను. చెయ్యి కొంచెం గీసుకుంటేనే హంగామా చేసే మా పాప, చందూ గుర్తొచ్చారు. యింతలో చందూ వచ్చిన సూచనగా బైక్ హారన్ వినిపించింది. లోపల హోం వర్క్ చేసుకుంటున్న పాప గెంతుతూ వరండా మెట్లు దూకుతూ వచ్చి నాన్నని చుట్టుకుపోయింది.

గోమాతా, లేగదూడల్లా పరస్పరం నిమురుకునే ప్రక్రియ పూర్తయ్యాక నవ్వుతూ నా వైపు చూశాడు చందూ. పితృత్వపు మాధుర్యాన్ని చవిచూస్తున్న అతనికి యిక పాప గురించి చెప్పేందుకేముంది ? ఈ బంధాలు యిలా బలపడాలని కోరుకోవడం తప్ప.

*(జాజిమల్లి బ్లాగు నుంచి)* ●

# ఆధిపత్య భావజాలం, అణచివేత ధోరణులపై ఆందోళన

- డి రమాదేవి

నిషేధాలతో దేన్నీ ఆపలేరు. నిజాల్ని నిర్భయంగా ఎదుర్కోవాల్సిందే, నిర్భయ ఘటన భూమికగా చేసుకొని నిర్మించిన 'ఇండియాస్ డాటర్' డాక్యుమెంటరీ ప్రసారంపై వివాదం రాజుకుంది. ఒక దారుణాతి దారుణ సంఘటనపై నిర్మించిన డాక్యుమెంటరీ ఇది. ఈ డాక్యుమెంటరీ ప్రసారంపై నిషేధం ఎల్లెడలా విమర్శలకి లోనయింది. ఇక్కడ కేంద్ర ప్రభుత్వం నిషేధం ప్రకటించినా, బిబిసి దానిని ప్రసారం చేసింది. ఆ తర్వాత అది ఇప్పుడు యూట్యూబ్ ద్వారా అందుబాటులోకి వచ్చింది. అయినప్పటికీ చానెళ్ళలో ప్రసారం చేయకూడదన్న నిర్ణయాన్ని ప్రభుత్వం మార్చుకోలేదు. "నిషేధమే పరిష్కారమా" అని విభిన్న వర్గాలవారు ప్రశ్నిస్తున్నారు. ఈ దేశంలోని పురుషాధిపత్య వ్యవస్థల దృక్పథం ఏమిటో ఈ లోకానికి వెల్లడవుతోంది. ముఖేష్‌సింగ్ మాటల్లో ఎలాంటి పశ్చాత్తాపం కనిపించకపోవడం విస్మయకరం. డాక్యుమెంటరీ ప్రసారం ద్వారా అనేక అంశాలు చర్చలోకి రానున్నాయి. కనుక ఆ డాక్యుమెంటరీ ప్రసారాలపై నిషేధాన్ని పలువురు మహిళలు వ్యతిరేకిస్తున్నారు. ఆడపిల్లలు నిర్భయంగా సంచరించే పరిస్థితులు నెలకొనేలా చర్యలు తీసుకోవడం ప్రభుత్వాల బాధ్యత. నేరప్రవృత్తిని రూపుమాపే దిశగా వ్యవహరించడం పాలకుల కర్తవ్యం. ఈ విషయాల మీద ఆలోచించాలే తప్ప నిషేధాలతో సాధించేదేమి ఉండదన్నది వాస్తవం.




'ఇండియాన్ డాటర్' ఇప్పుడు చర్చనీయాంశమైన డాక్యుమెంటరీ చిత్రం. ఉద్విన్ అనే బ్రిటీష్ మహిళా దర్శకురాలు తీసిన ఈ సినిమా సమాజపు వికృత ఆలోచనలను మన ముందు అద్దంలో లాగా నిలబెట్టింది. ఈ చిత్ర ప్రదర్శనను తదుపరి ఉత్తర్వుల వరకు నిలిపివేస్తూ కోర్టు ఆదేశించింది. హోం శాఖ జైళ్ల అధికారిని వివరణ కోరుతూ విచారణకు ఆదేశించింది. ఈ చిత్రం పార్లమెంటులో తీవ్ర చర్చకు దారితీసింది.

నామినేటెడ్ సభ్యురాలైన ఎంపి అనుఅగా (సామాజిక కార్యకర్త) నిషేధం పరిష్కారం కాదని, ఇలాంటి అభిప్రాయాలు మన సమాజంలో బలంగా ఉన్నాయని, వీటిని ఎదుర్కొనాలని బలంగా వాదించారు. బిజెపి సభ్యురాలు మీనాక్షి లేఖ ఈ చిత్రాన్ని నిషేధించటాన్ని సమర్థిస్తూ ఇలాంటి చిత్రాల వల్ల 'టూరిజం' క్షీణిస్తుందని ఆందోళన పడ్డారు.

మొదట నిర్భయ కేసులో నిందితుడిగా ఉన్న ముఖుల్ సింగ్ వ్యాఖ్యలు ప్రముఖంగా పత్రికల్లో, ఛానల్స్‌లో రావడం అందరికీ ఆందోళన కలిగించింది. ఆ తర్వాత పరిణామాలు వేగంగా జరిగాయి. ఢిల్లీ పోలీసులు ఎఫ్ఐఆర్ నమోదు చేయటమేగాక చిత్ర ప్రదర్శనను నిలిపివేయమని కోరుతూ కోర్టులో పిటిషన్ దాఖలు చేయడం, కోర్టు స్టే మంజూరు చేయడం చకచకా జరిగిపోయాయి.

ఉద్విన్ ఈ చిత్రం మీద వివరణ ఇచ్చారు. ఉద్విన్ అత్యాచారానికి గురికాబడిన మహిళ. నిర్భయపై అత్యాచారం, లక్షలాది మంది నిరసనలు కలిగించిన ఆసక్తి, ఆవేదనతో రెండేళ్లపాటు ఇంటిని, పిల్లలను వదిలేసి చిత్రాన్ని రూపొందించానని, దీనిలో సంచనాలు లేవని, లైంగిక అసమానత, అందుకు బాధ్యులైన వారి ఆలోచనా ధోరణి, ఆ ధోరణి మారే వరకు వాటి మీద క్యాంపెయిన్, ఆందోళన అవసరమని ఆమె పేర్కొన్నారు. మీడియాలో ఈ చిత్రంపై సంచలనాత్మక వ్యాఖ్యానాలు రావడం శోచనీయమని ప్రధాన మోడీ జోక్యం చేసుకుని ఈ చిత్ర ప్రసారానికి అనుమతి ఇవ్వాలని కోరారు.

ఏమైనా ఈ చిత్రం ఒక ఝలక్. నిద్ర నటిస్తున్న సమాజాన్ని స్పందించేట్లు చేసింది. మంచి మహిళలు ఎలా ఉండాలో సమాజం నిర్దేశిస్తుంది. నేరస్తుడిలాగానే ఈ సమాజంలో అనేక మంది ఆడవాళ్లపైన నేరపూరితమైన, అగౌరవ వ్యాఖ్యలు చేయడం సర్వసాధారణం. ఆ విధంగా మాట్లాడే వాళ్లు ఏ మత సంస్థలకో, ఖాప్(కుల) పంచాయితీలకో చెందిన వారు మాత్రమే కాదు. అడుగడుగునా అలాంటి వారు కన్పిస్తారు. రాజకీయ నాయకులు, పోలీసులు, న్యాయమూర్తులు, విద్యావేత్తలు

ఒకరేమిటి అనేక మంది పెద్దలు నేరస్తుడి భాషనే మాట్లాడడం మనం చూస్తున్నాం. సుప్రీం కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ రంగనాథ్ మిశ్రా ఆడపిల్లలు ఇంటికి పరిమితం అవ్వడం మన సంస్కృతి అని మాట్లాడారు. మన ఆంధ్ర రాష్ట్ర డిజిపి దినేష్ రెడ్డి ఆడపిల్లల డ్రస్సు మూలంగానే అత్యాచారాలు జరుగుతున్నాయని ఆరోపించారు. కర్ణాటక హైకోర్టు న్యాయమూర్తి మహిళల వస్త్రధారణ మగవాళ్లను రెచ్చగొడుతుందని పేర్కొన్నారు. ఇప్పుడు నిందితుడిగా జైల్లో ఉన్న ఆశారామ్ బాపు "అన్నా అంటూ కాళ్లు పట్టుకుంటే అత్యాచారం జరిగి ఉండేది కాదని" అన్నారు. తాజాగా మధ్యప్రదేశ్ మంత్రి మహిళల వస్త్రధారణపై కేసులు పెడతామంటూ మరో అడుగు ముందుకేశారు. సంస్కృతి, సాంప్రదాయం పేరిట మహిళల ప్రతి అడుగు మీదా ఆంక్షలు విధిస్తున్న సామాజిక ధోరణుల ప్రభావమే ఈ వ్యాఖ్యలన్నీ. ఆడపిల్లల మీద అత్యాచారాలు, వేధింపులు, యాసిడ్ దాడులు, హింస వీటన్నింటికీ ఓ ప్రధాన కారణం ఈ సమాజానికి పట్టిన చీడ భావజాలమేనని స్పష్టమవుతున్నది. ఆడపిల్లల సముచిత స్థానం వంట ఇల్లేనని నమ్ముతున్న వారున్నారు. ఆ తర్వాత బయటకెందుకు రావాలని ప్రశ్నిస్తున్నారు? రెచ్చగొట్టే డ్రస్సులే అత్యాచారాలకు కారణమని ఆడపిల్లలను తప్పుపడ్తున్నారు. వీటన్నింటి ప్రభావమే నిందితుడి ఆలోచనా ధోరణి.

ఈ డాక్యుమెంటరీలో అసలేముంది? ఈ కేసును వాదించిన న్యాయవాదుల కువ్యాఖ్యలు కూడా ఉన్నాయి. డిఫెన్స్ న్యాయవాదులు స్త్రీలు బయటకు రావడం, బాయ్ ఫ్రెండ్స్‌తో తిరగడం లాంటివి చేస్తే సొంత కూతురునైనా తగలబెడతానని వ్యాఖ్యానించారు. నిర్భయను తక్కువ చేయడంగాక ఇలాంటి ఆలోచనా ధోరణులున్న సమాజాన్ని ఢీకొట్టడం అవసరమన్న ఆలోచనను, సందేశాన్ని ఈ డాక్యుమెంటరీ కల్పిస్తుందని చెప్తున్నారు.

నిందితుడి వ్యాఖ్యలు ప్రమాదకరమైనవని చాలా మంది సరిగానే స్పందించారు. ఒక నేరస్తుడి నుంచి వచ్చిన వ్యాఖ్యలు అర్థమైనంతగా మర్యాదస్తులు మాట్లాడే భాష అర్థం కాలేదు. తక్షణ చర్యగా నిందితుల అప్పీల్ పిటిషన్ త్వరగా విచారించి శిక్షలను అమలు చేయాలని కోరుతూనే ఇలాంటి అత్యాచారాలకు మూలకారణాల వైపు కూడా చర్చ సాగుతుంది. మూలాలను నిర్మూలించాలన్న ఆలోచనలు పెరుగు తున్నాయి. ఓ చిన్నపాటి తుపాన్ ఈ డాక్యుమెంటరీ. సమాజంలో రాజ్యమేలుతున్న పురుషాధిక్య భావజాలం, తత్ఫలితంగా మహిళలపై తేలిక భావనలపై, ధోరణులపై పోరాడేందుకు ఈ డాక్యుమెంటరీ ఒక సాధనం అవ్వచ్చు.

ఐద్వా ఈ డాక్యుమెంటరీ డిఫెన్స్ లాయర్లుగా ఉండి అమర్యాదకరమైన, ద్వేషంతో కూడిన అమానవీయ వ్యాఖ్యలపై కేసు దాఖలు చేయాలని, వారిని శిక్షించాలని ఢిల్లీ పోలీసులకు పిటిషన్ ఇచ్చింది. నిర్భయ తండ్రి ఈ డాక్యుమెంటరీని అందరూ చూడాలని కోరుకుంటున్నారు.

## వాస్తవాలు ప్రపంచానికి తెలియాలి




**నిర్భయ** సంఘటన జరిగినపుడు భారతదేశం మొత్తం దానిపై స్పందించింది. దాంతో ఈ దేశంపై అభిమానం ఏర్పడింది. ఆ అభిమానమే నన్ను ఇక్కడి వరకు వచ్చేలా చేసింది. నిర్భయ తల్లిదండ్రులను కలిసినపుడు వారి ఆవేదన చూడలేకపోయా. అందుకే ఈ ఘటనపై జరిగిన నిరసన జ్వాలలను డాక్యుమెంటరీ రూపంలో తీసుకురావాలనుకున్నా. ప్రస్తుతం మన సమాజంలో అత్యాచారానికి గురైన అమ్మాయి సిగ్గుతో బయటకి రావడానికి భయపడుతుంది. నా దృష్టిలో ఆడపిల్లలు కాదు సిగ్గుపడాల్సింది. అత్యాచారం చేసిన వాడు సిగ్గుపడాలి. ఎందుకంటే నేనూ అత్యాచార బాధితురాలినే. ఈ డాక్యుమెంటరీ కోసం అత్యాచారానికి పాల్పడిన వాళ్ళతో మాట్లాడకపోతే పైపై విషయాలు మాత్రమే చూపగలిగేదాన్ని. అసలు వాస్తవాలు బయటకు వచ్చేవి కావు. నిర్భయ నిందితులతోనే కాదు, తీహార్ జైల్లో చాలామంది అత్యాచారాలకు పాల్పడిన వాళ్ళతో మాట్లాడాను. అలా మాట్లాడిన ఫలితంగానే మహిళల పట్లవారి ఆలోచనా విధానం ఎంత దారుణంగా ఉందో అర్థమవుతోంది.

ఈ విషయాలన్నీ బయటి ప్రపంచానికి తెలియాల్సిన అవసరం ఎంతైనా ఉంది. మహిళల పట్ల సమాజ వైఖరిలో మార్పురావాలి. అబ్బాయి పుడితే స్వీట్లు పంచుకోవడం, ఆడపిల్ల పుడితే ఇంట్లో ఏదోకోల్పోయినట్లు భావిస్తారు. ఆడపిల్లలపై వివక్ష ఎంతగానో పెరిగిపోయింది. వారిని పెంచే విధానంలో మార్పురావాలి. ఆ మార్పు ఇంటి నుండే మొదలు కావాలి. ఆడవాళ్లకు సమాజంలో విలువ లేకుండా పోతుంది. అందుకే మగవాళ్ళు ఆడవాళ్ళతో ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. ఈ డాక్యుమెంటరీ ఆడపిల్లలతో ఎలా వ్యవహరించాలో, వారిని ఎలా గౌరవించాలో తెలపడానికి ఎంతగానో ఉపయోగపడుతుందని భావిస్తున్నాను.

నివాళి

# గీతే రాగతి ఆయుధం

- నవ్య



ఆమె తన గీతనే ఆయుధంగా చేసుకుంది. ఆడవాళ్ళు ఆసక్తిగా చదివే వార, మాసపత్రికల్లో ఆమె కార్టూన్లు ఎక్కువగా వచ్చేవి. భార్యాభర్తలు, పండగలు, పబ్బాలు, అల్లుళ్ళు, దొంగలు, పోలీసులు, ప్రేమికులు, ఆఫీసు పనులు, కాలేజీ అమ్మాయిలు, రాజకీయనాయకులు.. ఇలా ఒకటేమిటి అన్నీ ఆమె తన గీతల్లో ఇమిడ్చి, పాఠకుల ముందు చిత్తరువు ఉంచేవారు. దృశ్యం ఆకట్టుకున్నంతగా పెద్ద వ్యాసం ఉండదనేది అందరికీ తెలిసిందే. అందుకే ఆమె గీతనే ఆయుధంగా చేసుకుంది. ఈ రంగంలో సహజంగా పురుషులే ఎక్కువ. మహిళగా ఈ




రంగంలో తనదైన ప్రతిభను చాటుకోవడం ఆమెకే సాధ్యమైంది. తను చనిపోయి కూడా స్ఫూర్తివంతంగా నిలిచిన 'రాగతి పండరి' మన తెలుగుజాతి గర్వించదగ్గ మహిళా కార్టూనిస్టు.

ఆమె తన కార్టూన్ల ద్వారా హాస్యాన్నేకాదు సందేశాన్ని, చురకల్ని అంటిస్తుంటారు. ఈ రంగంలో అగ్రగణ్యులైన బాపు, జయదేవ్, బాబులతోపాటు చెప్పుకునే కార్టూనిస్టు ఆమె. పోలియోతో రెండుకాళ్ళూ సహకరించని స్థితిని అనుకూలంగా మార్చుకున్నారామె. శారీరకంగా చలాకీగా లేకపోయినా, మానసికమైన ఉత్సాహంతో చకచకా కార్టూన్లు గీసి అందరి మన్ననలు పొందారు. ఆమె ఎక్కువగా కుటుంబజీవనం నేపథ్యంగా కార్టూన్లు వేశారు. ఆమె కార్టూన్లలో పదహారణాల తెలుగుతనం ఉట్టిపడుతుంది.

రాగతి ఇంటిపేరు. పండరి ఆమె పేరు. పండరి 1965, జులై 22వ తేదీన విశాఖలో రాగతి గోవిందరావు, శాంతకుమారి దంపతులకు జన్మించారు. ఆమె విద్యాభ్యాసం అంతా ఇంటివద్దే జరిగింది. అతిచిన్న వయస్సులోనే పోలియో బారినపడ్డారు. అయినా ఆమె తన ఆత్మవిశ్వాసానికి కఠోర శ్రమను జోడించి, పట్టుదలతో కార్టూన్ రంగంలో గుర్తింపు పొందారు.

తొలిదశలో జయదేవ్‌కి ఆమె ఓ లేఖ రాస్తూ 'కార్టూన్లు గీయడం ఎలా?' అని అడిగారు. అప్పట్లో ఆయన తనకు తెలిసిన, నేర్చుకున్న వాటినే ఆమెతో పంచుకున్నారు. ఆయన చెప్పిన వాటిని ఆకళింపజేసుకుని, కార్టూన్లను చిత్రించడం కొనసాగించారు పండరి. 'జయదేవ్ తన గురువు' అని చెప్పుకోవడమేకాక, ఆయనకు తన ఇంటిలో గురుపూజ కూడా చేశారు. కుదురైన చిత్రీకరణ, గుండ్రటి రాత, చక్కటి తెలుగులో ఉండే సంభాషణలు ఈమె కార్టూన్లలో ప్రత్యేకతలు.

పండరి కార్టూన్లు మనిషిలోని ద్వంద్వ ఆలోచనా ధోరణిని ఎత్తి చూపేవి. సాంఘిక దురాచారాలపై వాతలు పెట్టేవి. కార్టూన్లు హాస్య ప్రధానమైనవి అయినా, ఆమె సందేశానికి, విమర్శకూ స్థానం కల్పించేవారు. నవ్వుతోపాటు ఆలోచన కూడా రేకెత్తించేలా ఆమె కుంచె కదిలేది.

'జీవితంలో వేదనని కాసేపు పక్కకునెట్టి, నిండుగా నవ్వగలిగే శక్తినిచ్చేవి కార్టూన్లు మనిషికి గ్లూకోజు డోసులాంటివి' అని కార్టూన్ల గురించి పండరి అనేవారు. 'రాగతి పండరి కార్టూన్ సామ్రాజ్యాన్ని మొత్తం తన కైవసం చేసుకున్న ఏకైక మహిళా కార్టూనిస్టు. ఆ విధంగా పేరు ప్రఖ్యాతులు ఆర్జించారు.

1991లో రిపబ్లిక్ డే సందర్భంగా కలెక్టర్ చేతులమీదుగా ప్రశంసా బహుమతి పొందారు. 2001లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి ఉగాది పురస్కారాన్ని అప్పటి గవర్నర్ సి. రంగరాజన్ చేతుల మీదుగా అందుకున్నారు.

1997లో 200ల కార్టూన్ల సమాహార సంపుటిని 'నవ్వుల విందు' పేరుతో ప్రచురించారు. 2008లో తన ఆత్మకథను 'నా గురించి నేను' అని రాసుకున్నారు. ఈ పుస్తకం ప్రముఖ సాహితీవేత్త ద్వానా శాస్త్రి చేతుల మీదుగా విశాఖలో విడుదలైంది. మరణానికి ముందు అవయవదానం చేస్తున్నట్లు ప్రకటించి ఎందరికో స్ఫూర్తిగా నిలిచారు రాగతిపండరి. ఆమెకిదే అక్షర నీరాజనం. చైతన్య మానవి జోహార్లు. ●

పుస్తక పరిచయం

# నీకూ నాకూ మధ్య నిశీధి

## సింగమనేని నారాయణ కథలు

- డా. యం.ప్రగతి

స్త్రీల సమస్యలను, స్త్రీలపై సాగుతున్న వివక్షతనూ, పురుషాధిక్యతను చిత్రించే తెలుగు కథలు కోకొల్లలు. గత నాలుగైదు దశాబ్దాలుగా స్త్రీవాద రచయిత్రులు తమ స్త్రీల అణచివేత పై కలాలను ఎక్కుపెడుతూ వస్తున్నారు. చలం, కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్ వంటి అతికొద్దిమంది రచయితలు మాత్రమే స్త్రీల పక్షాన నిలబడి వారి సమస్యలను తమ రచనల్లో ప్రతిబింబించారు. అదే సాహిత్య వారసత్వాన్ని అంది పుచ్చుకొని నేటి కాలమాన పరిస్థితులలో చైతన్యంతో నిండిన ఆధునిక యువతుల వాణిని పలికించిన రచయిత సింగమనేని నారాయణ. "నీకూ నాకూ మధ్య నిశీధి" 12 కథలతో కూడిన సంకలనం. మధ్య తరగతి కుటుంబాలలో స్త్రీలపై పైకి కనిపించని హింసను, అత్యంత సహజంగా ఆమోదింపబడిన వివక్షనూ, అణచివేతను ప్రస్తావించడంతోపాటు వివేకంతో ఎదుగుతూ సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకోగలిగిన యువతులను తన కథలలో పాత్రలుగా మలిచారు.

ప్రధానంగా మారుతున్న ఆర్థిక సామాజిక పరిస్థితులలో కొత్త పుంతలు తొక్కుతున్న వరకట్న దురాచారాన్ని, స్త్రీలపై పెరుగుతున్న పనిభారాన్ని, గృహహింసను కథా వస్తువులుగా తీసుకున్నారు సింగమనేని. "ఒక అసందర్భం" కథలో పదిలక్షల కట్నం ఇవ్వడానికి సిద్ధపడ్డ లావణ్య తండ్రి మాటలు విన్న మరో సగటు తండ్రి స్వగతంలో ''ఇదేమిటి? పెళ్ళిళ్ళు మరీ ఇంత భయంకరంగా తయారవుతున్నాయి. ఒక భయంకర సామాజిక చట్రంలో ఇంతకన్నా ఇరుక్కుపోవటం వుంటుందా? రేపోమాపో మా అమ్మాయిల పెళ్ళిళ్ళ కోసం నేనూ ఇలా వేటాడవల్సిందేనా? ఎక్కడ దారి తప్పిపోయాం మనం? ఎవరు మనల్ని దారి తప్పించారు?" అని ఆవేదన చెందుతూ, "ఇది కూడా సరళీకృత ఆర్థిక విధానాల పుణ్యమేనా? మానవ సంబంధాలన్నీ ఈ క్రమంలో కలుషితం కావాల్సిందేనా" అంటూ ప్రశ్నిస్తాడు. "జ్ఞాతమూ - అజ్ఞాతమూ" కథలో మరో సగటు తండ్రి రాఘవ పెళ్ళికొడుకులను చూడక మునుపే ''నువ్వెంతలో వున్నావు? అన్న ప్రశ్నతో ఆశ్చర్యపోతాడు. మితిమీరుతున్న వినిమయ సంస్కృతి, తమ కంటే ఉన్నతంగా వున్న వర్గం తాలూకు సంస్కృతీ విలాసాలు తామూ అనుభవించాలని కోరుకునే యువత, స్వశక్తితో తీర్చుకోలేక సులభంగా పరిష్కరించే మార్గం కట్నం!'' అంటూ కారణాలు విశ్లేషిస్తాడు. దీనికి బలి అవుతున్నది ఆడపిల్లల తల్లిదండ్రులు అంటూ ఆవేదన చెందుతాడు. ఇదే కథలో చివరికి ఆ తండ్రి చనిపోతే నిజాన్ని దాచి, పెళ్లి జరిపించేసి ఆపైన వెల్లడించడం సగటు మధ్య తరగతి కుటుంబపు నిస్సహాయతను చాటుతుంది. "దృశ్యమూ "అదృశ్యమూ" కథలో రియల్ ఎస్టేట్ లో ఇంతింతై, వటుడింతై అన్నట్లుగా ఎదిగిన నరసింహం స్నేహితుడు మూర్తి కూతురు పెళ్లి ఖర్చు నిమిత్తం సాయం చేస్తున్నట్లుగా భూమిని అమ్మమంటూ సులభమైన పరిష్కారం సూచించడం ప్రస్తుతం నడుస్తున్న ఈజీ మనీ సిద్ధాంతాన్ని ప్రతిబింబిస్తుంది.

ఈ మూడు కథలకు భిన్నంగా పెళ్ళిళ్ళు ఎలా కుదిరితే బాగుంటుందో చెప్పే కథలు "ఒక గతి ఒక శ్రుతి" "వాసంత తుషారం". కోడల్ని వెతుకుతూ అనుకోకుండా పాత స్నేహితుడి ఇంటికి అతిథిగా వెళ్లి "ఏ



సింగమనేని నారాయణ

బైండింగ్సూ లేకపోతే నీ కూతుర్ని నా కోడలుగా చేసుకుంటాను'' అంటూ మగపిల్లల తండ్రులకు ఆదర్శంగా నిలిచే రామకృష్ణ కథ "ఒక గతి, ఒక శ్రుతి". పెళ్లి చూపులంటే అబ్బాయి అమ్మాయిని చూడటానికి వాళ్ళింటికి వెళ్ళడమనే తతంగాన్ని తలక్రిందులు చేస్తూ అబ్బాయిని చూడటానికి వాళ్ళింటికి వెళ్తారు పెళ్ళికూతురు, ఆమె స్నేహితురాలు "వాసంత తుషారం" కథలో. ఎటొచ్చీ వీళ్ళ ధోరణికి పెళ్ళికొడుకు తండ్రి ఆశ్చర్యాగ్రహాలతో నిలువు గుడ్లేస్తే, తల్లి మాత్రం "బోడి ఎప్పుడూ మగపిల్లలేనా ఆడపిల్లల్ని పెళ్లి చూపులు చూసేది. ఏం? ఆడపిల్లే పెళ్లి ఎందుకు చూడకూడదు?'' అంటూ నవ్వేయడం ఆడవాళ్ల మనసులో అంతర్గతంగా ఒకేలా ఆలోచిస్తారని, వసంత , తుషారలకు అపురూపంగా తోస్తుందామె. ఇలాంటి వివేకవంతులైన, పరిణతి చెందిన యువతులే "నిషిద్ధం" "ఒక అసందర్భం" కథల్లోనూ కనిపిస్తారు. "నిషిద్ధం" కథలో నేలబారు

అభిరుచులు, సంస్కార రాహిత్యం వున్న భాస్కరాన్ని నిశ్చితార్థం తరువాత కూడా తిరస్కరించడానికి వెనుకాడని ఆధునిక యువతి మమత. "ఒక అసందర్భం" కథలో కనీసం తన అభిప్రాయాన్ని తెలుసుకోకుండా తండ్రి నిర్ణయించిన పెళ్లిని నిరసిస్తూ నిశ్చితార్థం రోజున అదృశ్యమైన పరిణీత లావణ్య.

ఇక సంకలనం శీర్షిక కథ "నీకూ నాకూ మధ్య నిశీధి" లో చొరవ, కలుపుగోలుతనం, ధైర్యం కలిగిన డాక్టర్ సుధ పెళ్లి ప్రతిపాదన చేసిన సురేంద్రతో కొద్దిరోజుల పరిచయానికే ప్రేమా దోమా అని పేర్లు పెట్టుకోకుండా వాస్తవ ప్రపంచంలోకి రమ్మంటుంది. "నేను ప్రాక్టికల్ మనిషిని" క్షణికమైన ఆవేశాల్ని, ఉద్రేకాల్ని నమ్మను. ఈ ప్రేమల కంటే బలీయమైనది జీవిత వాస్తవికత. అంటూ సురేంద్రలోని బల హీనతను, పిరికితనాన్ని పాఠకుల ముందు నిరూపించి చూపిస్తుంది.

మహిళలపై జరిగే గృహహింస మీద ఎక్కుపెట్టిన రెండు కథలు "జవాబు, గ్రక్కున విడువంగ వలయు". పిల్లాణ్ణి కొట్టిందని భార్యను భర్త చితక బాదటం, ఎంత హింసించినా ఆమె నోరెత్తక పోవడం అతనికి మరీ అవమానంగా తోస్తుంది. చివరికతను ఆమె నోటి వెంట విన్న సమాధానం భార్యలు అనునిత్యం తమ గురించే ఆలోచిస్తారనే ఇంగితజ్ఞానం లేని భర్తలందరికీ జవాబు. అలాగే భర్త దౌష్ట్యానికి రూపురేఖలే మారిపోయిన సుశీల ఆ హింస నుండి బయటపడి ''మేమిచ్చిన కట్నమూ, బంగారమూ ఒక బిచ్చగాడికి అపాత్రదనం చేశామనుకుంటాం.'' అంటూ చీదరించుకోవడం "గ్రక్కున విడువంగ వలయు" కథ.

> పెళ్లి చూపులంటే అబ్బాయి అమ్మాయిని చూడటానికి వాళ్ళింటికి వెళ్ళడమనే తతంగాన్ని తలక్రిందులు చేస్తూ అబ్బాయిని చూడటానికి వాళ్ళింటికి వెళ్తారు పెళ్ళికూతురు, ఆమె స్నేహితురాలు "వాసంత తుషారం" కథలో. ఎటచ్చీ వీళ్ళ ధోరణికి పెళ్ళికొడుకు తండ్రి ఆశ్చర్యాగ్రహాలతో నిలువు గుడ్లేస్తే, తల్లి మాత్రం "బోడి ఎప్పుడూ మగపిల్లలేనా ఆడపిల్లల్ని పెళ్లి చూపులు చూసేది. ఏం? ఆడపిల్లే వెళ్లి ఎందుకు చూడకూడదు?" అంటూ నవ్వేయడం ఆడవాళ్లు మనసులో అంతర్గతంగా ఒకేలా ఆలోచిస్తారని, వసంత , తుషారలకు అపురూపంగా తోస్తుందామె.

ఇంతి చేసే ఇంటెడు చాకిరీ గురించి మూడు కథల్లో ప్రస్తావించారు సింగమనేని. "ఇంటింటి కథ" "శ్రమైక జీవన" "తరగతి గదిలో తల్లి" ఈ మూడు కథలలో ఇంటి పనికి విలువ లేదని, ఇంటి చాకిరీ చేస్తున్న మహిళలకు విలువ లేదని ఆవేదన చెందుతారు. "ఇంటింటి కథ"లో చాకిరీ తో క్రుంగిపోయిన సరోజకు భర్తను, పిల్లలను ఇంటిపనిలో భాగస్వాములను చేయమని సలహా ఇస్తుంది ఆమె స్నేహితురాలు ప్రమీల. 'మగవాళ్ళను మనమే సగం సోమరులుగా తయారుచేస్తున్నాము. పాతకాలం ఫ్యూడల్ భావజాలంతో పురుషాధిక్యతను మనమే ఎగదోస్తాం! ఎవరి పనులు వాళ్ళే చేసుకొనేలా మనమే తయారుచేయాలి' అంటూ కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంది. "శ్రమైక జీవన" కథలో ఇంటి పనంతా ఇల్లాలి కొదిలేసి, భర్త-పిల్లలు వాళ్ళు తగ్గించుకోవడానికి జాగింగ్ పేరుతో కాలక్షేపం చేయడం శ్రమ సంస్కృతి పట్ల గౌరవం లేకపోవడం, ఇంటి పనుల పట్ల తేలిక భావం వుండటం వల్లేనని తేల్చి చెబుతారు. ఇక "తరగతి గదిలో తల్లి" కథలో "ఆడపని, మగపని అని వేర్వేరుగా చూడకూడదు" అంటూ తల్లి గొప్పదనాన్ని పొగడ్తలతో సరిపెట్టడం కాక, తల్లి మోసే భారాన్ని పిల్లలకు కన్విన్సింగా ఉపాధ్యాయుడు ప్రభాకరం చేత చెప్పించారు.

మొత్తంగా కథలన్నీ ఒక సానుకూల (పాజిటివ్) దృక్పథంతో రూపొందించ బడ్డాయి. స్త్రీల పట్ల రావాల్సిన సంస్కార దృష్టిని సింగమనేని పాఠకులకు అందించారు. ఓల్గా మాటల్లో చెప్పాలంటే క్రొత్త సామాజిక నేపథ్యంలో ధైర్యసాహసాలతో, వివేకంతో ఎదుగుతున్న స్త్రీలను సింగమనేని ఒక పితృ వాత్సల్యంతో, మిత్ర సాన్నిహిత్యంతో తన కథలలో పాత్రలుగా మలిచారు. ప్రతి ఆధునిక మహిళా తప్పకుండా చదివి తీరాల్సిన కథలివి. ●

---

*(20వ పేజీ తరువాయి )*

ఈ విధానం వలన కేవలం 1000 నుండి 1500 మందిని మాత్రమే పనిలో ఉంచి మిగిలినవారిని ఇండ్లకు పంపుతారు. వారికి ఉపాధి ఉండదు. ఇదేనా పాలకులు చెప్పే మహిళాభివృద్ధి ? 5 నెలలుగా జీతాలు లేకపోయినా 3 నెలలుగా బిల్లులు లేకపోయినా అప్పులుచేసి పిల్లలకు భోజనాలు పెడుతుంటే ఆపాటి బాధ్యత కూడా పాలకులకు లేదా?

**ముగింపు :-** బడుగు బలహీన వర్గాల పిల్లలకు చదువును దూరం చేసి బాలికలకు విద్య అందుబాటులో లేక ఇప్పటివరకు మౌలిక వసతుల కోసం, భవనాల కోసం ఖర్చుపెట్టిన ప్రజాధనం దుర్వినియోగం చేసి, మధ్యాహ్న భోజన కార్మికులకు ఉపాధులు లేకుండా చేసి నిరక్షరాస్యతను పెంచే విధానం, ప్రైవేటు, కార్పొరేట్ సంస్థలకు చొరబాటు కల్పించే ఈ విధానం, ఇన్ని నష్టాలకు దారితీసే ఈ క్లస్టరు పాఠశాలలను మేము అమలు చేసి తీరుతామని అంటే పాలకులు కార్పొరేట్ సంస్థల పక్షాన ఉన్నారా ? బడుగు బలహీన, సామాజిక ప్రజల పక్షాన ఉన్నారా ? తేల్చుకోవలసిన సమయం ఆసన్నమైంది. క్లస్టరు స్కూల్సును వెనక్కు తీసుకోకపోతే ప్రజాపోరాటాలు విస్తరిస్తాయని పాలకులు గుర్తెరగాలి.

అవగాహన సందర్భం

# 'స్త్రీ ఒక పనిముట్టు'

- డా॥ శిలాలోలిత


అందరి తిండితిప్పలూ, రోగాలొస్తే సేవలు, ఇంటి ఖర్చుల్లో పొదుపులు, చుట్టాల రాకపోకల మర్యాదలు, అందరి బాక్సుల్లో వారి వారి ఇష్టనైవేద్యాలు, ఒకానొక దశలో తన బాక్స్‌లో పెట్టుకోను సమయం లేకపోవడం, మర్చిపోవడం షరామామూలే. నువ్వు తిన్నావా ? ఎలా ఉన్నావ్. నేను సాయం చెయ్యనా ? నాకమ్మాడా బాధ్యతుందికదా ! నువ్వుకూడా సాటి మనిషివేకదా ! నీకూడ రెస్ట్ ఉండాలికదా? నువ్వుకూడా తొందరగా నిద్రపోవాలికదా! నువ్వుకూడా మందులేసుకోవాలికదా? నువ్వుకూడా డాక్టర్ చెకప్‌కి వెళ్ళాలికదా? లాంటి లక్షల మాటల్ని ఒక్కసారన్నా వినాలనుకునే కోర్కె తీరని స్త్రీల సంఖ్యే ఎక్కువ.


ఈ మధ్యకాలంలో జరిపిన సర్వేలో భారతదేశంలో స్త్రీలే ఎక్కువగా వ్యాధులబారినపడ్తున్నారని తేలింది. ఎందుకు ఇక్కడే ఎక్కువగా రోగగ్రస్థులవుతున్నారు? మరణాల సంఖ్య ఎక్కువగా ఎందుకుంటోంది? తొందరగా వృద్ధాప్య ఛాయలు ప్రతిఫలిస్తున్నాయి. అనే విషయాలను మనం పరిశీలిస్తే....

తన గురించి తానేమాత్రం ఆలోచించని స్త్రీనే కనబడుతోంది. మనకి మనం విలువను ఇచ్చుకోకుండా ఉంటుంటే ఎదుటివారు కూడా ఖచ్చితంగా ఇవ్వరు. కుటుంబాలలో స్త్రీది ప్రముఖమైన పాత్ర. అందరి ఆలనా పాలనా ఆమెది. మన శాస్త్రాల్లో, ధర్మాల్లో కుప్పలు కుప్పలుగా స్త్రీలకు విధించబడిన బాధ్యతల చిట్టాలెన్నో ఉన్నాయి. త్యాగమూర్తి, సహనశీలి, ఉత్తమురాలు (?) మాతృమూర్తి, ఎట్సెట్రా ఎట్సెట్రాల బరువుల్ని మోసీ మోసీ శిలువను తనకు తానే వేసుకున్న స్త్రీలు కనబడుతున్నారు. వారి గాయాలు కానీ, ప్రవహిస్తున్న నెత్తురుగానీ, వేసుకున్న బంధనాలు కానీ, ఊపిరాడని వారి స్థితిని గానీ ఎవరూ గమనించట్లేదు. తెలిసినా తెలియనట్లే ఉండిపోతున్నారు. పట్టించుకుంటే బాధ్యతల్ని కూడా పంచుకోవాల్సి ఉంటుంది. తెలియనట్లుగా వుంటే దానంత సుఖం లేదు. ఈ పట్టనితనమే స్త్రీలకు హానికరమౌతోంది.

అందరి తిండితిప్పలూ, రోగాలొస్తే సేవలు, ఇంటి ఖర్చుల్లో పొదుపులు, చుట్టాల రాకపోకల మర్యాదలు, అందరి బాక్సుల్లో వారి వారి ఇష్టనైవేద్యాలు, ఒకానొక దశలో తన బాక్స్‌లో పెట్టుకోను సమయం లేకపోవడం, మర్చిపోవడం షరామామూలే. నువ్వు తిన్నావా? ఎలా ఉన్నావ్. నేను సాయం చెయ్యనా? నాకమ్మాడా బాధ్యతుందికదా! నువ్వుకూడా సాటి మనిషివేకదా! నీకూడ రెస్ట్ ఉండాలికదా? నువ్వుకూడా తొందరగా నిద్రపోవాలికదా! నువ్వుకూడా మందులేసుకోవాలికదా? నువ్వుకూడా డాక్టర్ చెకప్‌కి వెళ్ళాలికదా? లాంటి లక్షల మాటల్ని ఒక్కసారన్నా వినాలనుకునే కోర్కె తీరని స్త్రీల సంఖ్యే ఎక్కువ.

ప్రతి మధ్యతరగతి ఇంట్లో ఇద్దరు పనిమనుషులుంటారు. ఒకరు జీతానికి సేవచేస్తే, మరొకరు జీవితానికి సేవచేస్తారు. పనిమనిషి మానేస్తే ఇంట్లో ఎవరికీ ఇబ్బంది కలగదు. పట్టింపూ ఉండదు. రోజులాగే అన్ని సౌకర్యాలూ జరిగిపోవాలి. ఉన్న పాత్రలకి తోడు ఎమెర్జెన్సీ పాత్రగా ఆమె పనిమనిషి పాత్రలోకి తర్జుమాఅయిపోతుంది. ఉదయం 5 గం॥ల నుంచి రాత్రి 11 గంటల వరకూ, గృహిణి, ఉద్యోగి పాత్రల్లో ఆమె చేసే శ్రమను గమనిస్తే భరించలేం, ఇన్ని ఒత్తిడిల మధ్య, ఇంత తీరికలేనితనం మధ్య, తనెవరికీ అక్కర్లేదని తెలుస్తూనే వున్నా, అంగీకరించలేనితనంతో "నేను కూయందే తెల్లారదు అని ఇంటికోడి అనుకుంటుంది". షుగర్లు, బీపీలు, ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్లు, హెర్నియాలు, స్పాంటిలైటిస్‌లు, హృద్రోగాలు, గర్భాశయ సమస్యలు, మెనోపాజ్ ఒత్తిళ్ళు, చర్మవ్యాధులు, మెదడు నరాలు చిట్లిపోవడాలు, ఎముకలు అరిగిపోయిన వైనాలు, అరికాళ్ళు, అరిచేతులే కాదు ఒళ్ళంతా పగిలిన దృశ్యాలు ఒకటేమిటి అన్ని ఇళ్ళలోపల కొండచిలువలను చుట్టుకున్న స్త్రీలే ఎక్కువున్నారు.

ఇన్ని ఘర్షణలను దాటుకొని, ఇన్ని ఊహామూర్తుల సంకెళ్ళు ఛేదించుకొని, నేనుకూడా మనిషినే, నాకమ్మాడా ప్రాణముంది. నాకూ ఒక మనసుంది. నా శరీరాన్ని నేను రోగాల బారినుండి రక్షించుకోవాలి. ఆరోగ్యంగా హాయిగా బతగ్గలగాలి అనుకునే స్థితి ఎప్పటికొస్తుంది?

మానసిక, శారీరక సమస్యలేగాక, పౌష్టికాహారలోపం వల్లకూడా స్త్రీలు వ్యాధుల బారినపడ్తున్నారు. ఉన్న మంచి ఆహారాన్ని అందరికీ పంచుతూ, అదే తృప్తి అనుకుంటూ, తిన్నావా లేదా అని అడగని కుటుంబ సభ్యుల్ని ఉదారంగా క్షమించేస్తూ త్యాగమూర్తిని నేనని మురిసిపోయే తల్లులు మారాలి. డబ్బులులేవని, మిగలలేదని, ఇంకోసారి మందులు కొనుక్కోవచ్చులే అనే వాయిదాతనాల వల్ల కూడా ఎప్పటికీ తగ్గని స్థితిలోకి నెట్టివేయబడుతున్నారు.

ఆలోచించండి మీ గురించి మీరు కొంచెమన్నా పట్టించుకోండి. మీరు ముందు మానసిక శారీరక ఆరోగ్యాల్ని పొందితేకదా! ఏమన్నా సాధించగలిగేది ?

ఈ మానవ నిర్మిత, గ్రంధస్థ భావజాలాల నుండి బయటపడి ఆరోగ్యవంతురాళ్ళయిన స్త్రీలు నిండిన సమాజం కోసం కలగంటున్నాను. ●

కథ

# సృష్టికి మూలం...

- డి. అమర్‌నాథ్

నేడు అందరూ మగపిల్లలే కావాలంటూ కలలు కంటూ దేవాలయాలు, ఆస్పత్రులు, డాక్టర్ల చుట్టూ, జ్యోతిష్యుల చుట్టూ తిరుగుతూ ఆడపిల్ల పుడితే పురిట్లోనే చంపేయటం, లేదంటే వదిలి వెళ్లిపోవటం మనం చూస్తునే ఉన్నాం. మగపిల్లలైతేనే కావాలంటూ తనను కన్నతల్లి మహిళే అన్న కనీస జ్ఞానం లేకుండా మూర్ఖంగా ప్రవర్తిస్తున్న వారు ఎంతో మంది మనకు కన్పిస్తున్నారు.

అసలే చలికాలం.. ఉదయం తొమ్మిది గంటలైనా విపరీతమైన చలి. మా అమ్మాయిని స్కూల్‌కి తీసుకెళ్లటానికి గబాగబా తయారై ఇద్దరం బయల్దేరాం. చలి ఎక్కువగా ఉండటంతో చలిబట్టలు వేసుకున్నాం. మా అపార్ట్‌మెంట్‌కి స్కూల్‌కి దాదాపు కిలోమీటరు దూరం. ఇంటి నుంచి పాఠశాలకు వెళ్లేదారంతా పచ్చని పైర్లు, చెట్లతో ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. దారి మధ్యలో అచ్చం ట్యాంక్‌బండ్‌ను తలపించేలా జాతీయ నాయకుల విగ్రహాలు దర్శనమిస్తాయి. మేము నడుచుకుంటూ వెళ్లేదారిలో నా బాల్యమిత్రుడు వసంతరావు కన్పించాడు. అతన్ని చూసిన నేను 'ఏవయ్యా వసంతరావు బాగున్నావా'? అంటూ పలకరించాను. 'ఆ బాగానే ఉన్నారా.. నువ్వెలా ఉన్నావ్?' అన్నాడు. 'నేను కులాసానే. ఏం సంగతులు?' అని ప్రశ్నించాను. 'ఏంలేద్రా' అంటూనే నాపక్కనే ఉన్న మాపాపను చూసి 'ఏరా మీపాపేనా?' అని అడిగాడు.. అవునని సమాధాన మిచ్చాను. 'మీకెంతమంది పిల్లల్రా?' అని అడిగాడు.. 'ముగ్గురు' అన్నాను. 'ఎంతమంది అబ్బాయిలు?' అని అడిగాడు. 'లేదు.. లేదు.. ముగ్గురు అమ్మాయిలే వసంతరావు. ఇంతకీ నీకెంత మంది పిల్లలు'? అని అడిగాను.. 'నాకు ఇద్దరూ అమ్మాయిలే' అంటూ కొంత నీరసంగా చెప్పాడు. 'ప్రస్తుతం ఉన్న లాంఛనాలు(వరకట్నం)తో అమ్మాయిలంటే కష్టంరా' అని అన్నాడు. 'అవునులే కానీ ఏంచేస్తాం' అనేశా! 'అవున్రా మళ్లీ అబ్బాయి కోసం చూస్తున్నారా' అని అడిగాడు. 'లేదు వసంతరావు' అన్నాను. 'ఇంకేమిటి భూములు , ఆస్తులు ఏమైనా ఉన్నాయా?' అని అడిగాడు. ఉన్నాయని బదులిచ్చా. 'ఉంటే సరే లేకపోతే చాలా కష్టంరా..! ఇప్పుడున్న పరిస్థితుల్లో అమ్మాయి పెళ్లి తలకు మించిన భారమవుతుంది' అని అంటూనే 'ఉన్నంతలో అమ్మాయే నయంరా' అన్నాడు. 'రేపు మనం పోతే ఏడ్చేది వాళ్లే కదా..మనం చనిపోయినప్పుడు కన్నీళ్లు కార్చేది వారే కదా' అని మళ్లీ అన్నాడు. వెంటనే నా మదిలో ఏదో ఆలోచన.. హృదయం తరుక్కుమంది. వసంత రావు మాట్లాడుతూ 'మనం మగాళ్లం ఎవరైనా పోతే ఏడుస్తామా ! ఆడపిల్ల ఇంటికి లక్ష్మిరా అని మనసులో మాటను చెప్పాడు. ఎంతైనా మగపిల్లలకంటే ఆడపిల్లలే నయంరా. కట్నం ఇచ్చి పెళ్లి చేయటం మినహాయిస్తే రేపు మనకు ఏ ఆపద వచ్చినా ఆదుకునేది, ఆప్యాయంగా పలకరించేది, మన పట్ల మనసుతో ఆలోచించేది వాళ్లే కదరా' అంటూ బయల్దేరాడు. అప్పట్నుంచి నా మదిలో ఒకటే ఆలోచన మొదలైంది. అది వాస్తవమే కదా అనిపించింది. నేడు అందరూ మగపిల్లలే కావాలంటూ కలలు కంటూ దేవాలయాలు, ఆస్పత్రులు, డాక్టర్ల చుట్టూ, జ్యోతిష్యుల చుట్టూ తిరుగుతూ ఆడపిల్ల పుడితే పురిట్లోనే చంపేయటం, లేదంటే వదిలి వెళ్లిపోవటం మనం చూస్తునే ఉన్నాం. మగపిల్లలైతేనే కావాలంటూ తనను కన్నతల్లి మహిళే అన్న కనీస జ్ఞానం లేకుండా మూర్ఖంగా ప్రవర్తిస్తున్న వారు ఎంతో మంది మనకు కన్పిస్తున్నారు. అబ్బాయిలైతే ఉన్నత చదువులు చదివించి, కావాల్సినవి కొని ఇచ్చి గారాబంగా చూసే వారు అమ్మాయి విషయంలో మాత్రం దానికి భిన్నంగా ప్రవర్తిస్తున్నారు. అబ్బాయిలను ఉన్నత చదువులు చదివించి ఉద్యోగాలు ఇప్పించి పెళ్లిచేస్తే పెళ్లైన తర్వాత వేరే కాపురాలు పెట్టి తల్లిదండ్రులను అనాథులుగా చేసే వారెంతో మంది ఉన్నారు. తల్లిదండ్రులని పట్టించుకోకుండా వృద్ధాశ్రమాల్లో చేరుస్తున్న వారిని ఎంతోమందిని రోజూ టివిలో చూస్తూనే ఉన్నాం. కన్న కొడుకులే తమను పట్టించుకోవటం లేదని, గారాబంగా పెంచి పెద్దచేస్తే మమ్మల్ని అనాథులుగా చేశారంటూ రోదించే వారినెంతోమందిని చూస్తున్నాం. గతంలో వృద్ధాశ్రమాలు, అనాథాశ్రమాలు అరుదుగా ఉండేవి. నేటి యాంత్రిక జీవనంలో ఏమూల చూసినా అలాంటి ఆశ్రమాలు కోకొల్లలుగా పుట్టుకొస్తున్నాయి. రెక్కలు తెగిన పక్షుల్లా తమ శేష జీవితాల్ని బిక్కు బిక్కు మంటూ వెళ్లదీస్తున్న వారెందరినో చూస్తున్నాం. కొడుకు పుడితే మా వంశోద్ధారకుడు పుట్టాడని గర్వంగా చెప్పుకుంటాం. కానీ వృద్ధాప్యంలో తల్లిదండ్రులను ఏకాకిని చేస్తూ కన్నవారికి కడుపుకోతను మిగులుస్తున్న వారెందరో. అమ్మాయి పుడితే మన స్థాయిలో పేదోడికైనా కట్టబెట్టి ఒక ఇంటికి పంపిచవచ్చు. వారు ఎక్కడున్నా చివరి దశలో మనం మరణిస్తే వచ్చి నాలుగు కన్నీళ్లు బొట్లు రాల్చేది అమ్మాయే కదా అనిపించింది. మనం చనిపోతే ఆస్తుల కోసం తగదాలు పడే అబ్బాయిలు ఎంతో మందిని మనం చూస్తున్నాం. ఈస్థితిలో అమ్మాయిలే నయమనిపించింది.

ఇలా ఆలోచించుకుంటూ పాఠశాలకు చేరుకున్నాం. బడి గంట మోగింది. పాపను స్కూల్లో వదిలి ఇంటికి తిరుగు ప్రయాణ మయ్యాను. తిరుగు ప్రయాణంలోనూ నా మిత్రుడు వసంతరావు మాటలు నామదిలో మెదులుతూనే ఉన్నాయి. పిల్లలంటే ఎవరైనా ఒకటే. ఆడపిల్ల లేకపోతే ఈసృష్టే లేదు. సృష్టికి మూలం స్త్రీ. అటువంటి అమ్మాయిని వద్దనుకుంటే ఈసృష్టే ఉండదు. ●

చట్టాలు

# లీగల్ సర్వీసెస్ అథారిటీ యాక్ట్ 1987

- ఆర్. దుర్గాప్రసన్న
అడ్వకేట్



మనం ఏదైనా ఒక వస్తువును గానీ, సేవను గానీ పొందాలంటే దానికి కొంత మూల్యం (డబ్బు) చెల్లించాలని మనకందరకూ తెలుసును. మనకు ఏదైనా అన్యాయం జరిగినపుడు లేదా మన హక్కులకు విఘాతం కలిగినపుడు న్యాయం కోసం న్యాయస్థానాన్ని ఆశ్రయించక తప్పదు. న్యాయస్థానంలోకి అడుగుపెట్టాలంటే ఎన్నో వ్యయ ప్రయాసలకు సిద్ధపడాలని చాలామందికి భయం. ఇక మహిళలకు ఇది మరింత సాహసమే అవుతుంది. ఆర్థిక స్వాతంత్ర్యంలేని మహిళలకు న్యాయ పోరాటానికి కావలసిన ఆర్థిక, అంగబలాన్ని సమకూర్చే న్యాయ సహాయమే కాకుండా ఉచితంగా బడుగు బలహీనవర్గాల వారికి సామాజిక, ఆర్థిక న్యాయాలు కల్పించడమే ఈ చట్టం యొక్క ధ్యేయం. అదే లీగల్ సర్వీసెస్ అథారిటీ యాక్టు, 1987లో చట్టరూపం దాల్చినప్పటికీ 1994లో కొద్దిపాటి సవరణలతో అమలు చేయబడినదీ చట్టం.

సాధారణంగా న్యాయస్థానాన్ని అశ్రయించే వారు న్యాయ నిబంధనల ప్రకారం కొంత మొత్తాన్ని కోర్టు ఫీజుల రూపంలో చెల్లించాలి. అంతేకాక న్యాయవాదులకూ కొంత ఫీజు చెల్లించాల్సి ఉంటుంది.

మన దేశంలో మహిళలూ, పిల్లలూ ఎక్కువశాతం పురుషుల మీద ఆర్థికంగా ఆధాపడి జీవిస్తూ ఉన్నారు. ఎటువంటి సంపాదన లేకుండా వారిసేవలను కుటుంబానికి, కుటుంబంలోని వ్యక్తులకూ వెచ్చిస్తున్నారు. ఇటువంటి స్థితిలో ఉన్న స్త్రీలనూ నిరుపేదలుగానే ఈ చట్టం గుర్తించింది. భర్తనుండి మనోవర్తి తప్ప ఏ విధమైన ఆర్థిక వనరులూ లేని స్త్రీలను కొద్దిపాటి నగలువున్నా కూడా వాటిని స్త్రీ ధనంగా పరిగణించి వారిని 'ఇండీజెంట్ పర్సన్' గా గుర్తించింది. ఇండీజెంట్ పర్సన్ - అని కోర్టుకి ఫీజు చెల్లించలేమని వారు న్యాయస్థానానికి దరఖాస్తు చేసుకోవాలి.

కోర్టు ఫీజులు చెల్లించడానికి అవసరమైన వనరులు వారికి ఉన్నాయా? లేదా? అనే విషయాన్ని న్యాయస్థానం పరిశీలించి నిర్ణయిస్తుంది. సంబంధిత అధికారి వారి దరఖాస్తులను పరిశీలించి వారికి న్యాయవాదులను సమకూర్చి కోర్టుఫీజుల నుండీ వారిని మినహాయిస్తూ అడ్వకేట్ సేవలకయ్యే అడ్వకేట్ (నామమాత్రపు ఫీజులు) ఫీజులను కూడా వారే చెల్లిస్తారు.

**ఇక ఈ చట్టం ప్రకారం**

- మహిళలు, పిల్లలు
- షెడ్యూల్డ్ కులము లేక తెగకు చెందినవారు
- మానవ అక్రమ రవాణా బాధితులు, యాచకులు
- మానసిక, శారీరక వైకల్యముతో బాధపడేవారు
- సామూహిక విపత్తులు, హింసాకాండలు, కులవైషమ్యాలు, అతివృష్టి, అనావృష్టి, భూకంపాలు, పారిశ్రామిక విపత్తులు వంటి అనేక వైపరీత్యాల వలన బాధితులైనవారు.
- పారిశ్రామిక కార్మికులు
- వార్షిక ఆదాయము రూ.50,000/ లకు మించని పేదలు కూడా ఈ ఉచిత న్యాయసహాయం పొందడానికి అర్హులు. అంతేకాదు వీరు వాదులుగా ఉన్నా ప్రతివాదులుగా ఉన్నాకూడా న్యాయ సహాయాన్ని పొందవచ్చును.

అర్హులైన వారంతా కూడా తమంత తాముగా ఉచిత న్యాయ సహాయానికి అర్హులమని తెలియచేస్తూ తమకు ఏ అంశంలో న్యాయ సహాయం కావాలో వివరిస్తూ ఆఫిడవిట్‌ను దాఖలు చేయవలసి ఉంటుంది. ఉచిత న్యాయ సహాయం కోరేవారు తమజిల్లా కేంద్రంలోని జిల్లా కోర్టులలోను, జిల్లా న్యాయ సేవా అధికారి సంస్థలలోకానీ, రాష్ట్ర హైకోర్టులోని 'రాష్ట్ర న్యాయసేవా అధికార' సంస్థలో కానీ దరఖాస్తు చేసుకోవచ్చును.

విద్యా, ఉద్యోగం, వైద్యం లాగనే న్యాయాన్ని పొందడం, న్యాయ సహాయాన్ని అర్థించగలగడం ఒక హక్కు. ఆర్థికస్వేచ్ఛ లేని స్త్రీలు, వ్యక్తిగతమైన స్వేచ్ఛలేని స్త్రీలు మన సమాజంలో ఎందరో. న్యాయ స్థానానికి ఎలా వెళ్ళాలో ఎందుకు వెళ్ళాలో తెలియక, తమ హక్కులేమిటో తాము తెలుసుకోలేక అనేక విధాల అన్యాయానికి, దోపిడికి గురవుతున్నారు. అటువంటి స్త్రీలు ధైర్యంగా ఉచిత న్యాయ సహాయాన్ని కోరుతూ దరఖాస్తు చేసుకున్నట్లైతే వారికి నిపుణులైన న్యాయవాదులతో న్యాయపరమైన సలహాలనిప్పిస్తారు. కోర్టు ఖర్చులను వారే భరించి బాధిత మహిళలకు న్యాయ సహాయం అందిస్తారు.

మనోవర్తి, పెన్షన్, ఆస్తి హక్కులు, దత్తత, విడాకులు, వివాహ హక్కులు పునరుద్ధరణ ఇంకా అనేక స్త్రీల సమస్యలపై వారియొక్క న్యాయ పోరాటానికి, హక్కు పొందడానికి అన్ని సివిల్ క్రిమినల్ న్యాయస్థానాల్లోనూ కూడా ఈ చట్టంద్వారా న్యాయాన్ని పొందవచ్చును. ●

మీడియా

# అనవసర రాద్ధాంతం

– కె. సమత

రక రకాల జాతులు, మతాలు, ఇంకెన్నో భేదాలు. దేన్నీ ప్రశ్నించకుండా సమాజం సృష్టించిన లోకజ్ఞానం అనే ఒక తెరలో సాధారణంగా అందరితోపాటు మనంగా అన్నీ నమ్ముతుంటాం, పాటిస్తుంటాం. అసలు లోక జ్ఞానం లేని ఒక గ్రహాంతర వాసి ఈ లోకంలోకి ప్రవేశిస్తే ఎలా ఉంటుంది? మనిషి నమ్మకాలతో మొదలు మూఢ నమ్మకాల దాకా అన్నిటిని ప్రశ్నిస్తూ పోతే ఏం జరుగుతుంది? వీటికి సమాధానం కావాలంటే పీకే చూడాల్సిందే...

రాజ్‌కుమార్ హిరాని దర్శకత్వంలో అమీర్‌ఖాన్, అనుష్క శర్మ ప్రధాన పాత్రలుగా నిర్మించిన 'పికె' దేశంలో సినీ పరిశ్రమనే కాదు మత రాజకీయాల్ని కూడా ఒక ఊపు ఊపింది. మతాన్ని కించపరుస్తూ ప్రజల మనోభావాలను దెబ్బతీసే విధంగా సినిమా ఉందంటూ సెన్సార్ బోర్డ్ పైన విరుచుకుపడ్డ సంఘ్ పరివార్ నేతలు, కోర్టులో కేసు వేసి పికె సినిమాను నిలిపివేయాలంటూ రౌడీ మూకలతో థియేటర్‌లను ధ్వంసం చేసిన కొన్ని మత సంస్థలు, వీళ్లంతా కలిసి పికెను వివాదాస్పదం చేసిన విషయం అందరికీ తెలిసిందే. అయితే నష్టపోయిందెవరు? అప్రతిష్ట ఎవరికి? సినిమా రిలీజ్ అయిన వారం రోజులకి మేల్కొన్న మన సంఘ్ పరివార్ కార్యకర్తలు సినిమాకు మరింత కలెక్షన్ పెంచడంలో తోడ్పడ్డారు. థియేటర్లపై దాడి చేసి విధ్వంసం సృష్టించిన ఒక అతివాద గ్రూపుగా మిగిలారు. మత ఛాందసవాద సంస్థలకు చెందిన వీళ్లంతా నిజంగా సినిమా చూశారా అని అనుమానం వస్తుంది. ఒకవేళ వాళ్ళంతా హిందూ ప్రజల మనోభావాలను దెబ్బ తీసేలా సినిమా ఉంటే వాళ్ళకి లేదా ప్రజల మద్దతు? ఏ ప్రజల మనోభావాల కోసం ఆందోళన చేశామన్నారో ఆ ప్రజలే పికెని ఆదరించి మళ్ళీ మళ్ళీ చూశారు.

ఒక గ్రహాంతరవాసిగా తాను పోగొట్టుకున్న లాకెట్‌ని వెతుక్కుంటూ రాజధానిలో అడుగు పెట్టిన పికె వేషధారణ, భోజపురి భాష నేర్చుకుని తన సమస్య గురించి అందరికీ చెప్పుకొని పరిష్కారం వెతుక్కునే సమయంలో అందరూ కామన్‌గా చెప్పే మాటలు 'నీ సమస్యకు ఈ దేవుడే దిక్కు" చాలా సీరియస్‌గా తీసుకుని మతంతో సంబంధం లేకుండా కనిపించిన ప్రతి భగవంతుడిని ప్రార్థించడం మొదలు పెట్టాడు. ఎంతకీ తన సమస్య పరిష్కారం కాకపోయేసరికి దేవుడిపైన మిస్సింగ్ కేసు పెట్టి ఏ మూలైనా దొరుకుతాడని వెతుక్కుంటూ ఉంటాడు. ఈ క్రమంలో టివి రిపోర్టరుగా పని చేసే జగ్గు తనకి పరిచయం అవుతుంది. పికె వేసే ప్రశ్నలు అందరికి చేరుకునేలా ఒక చర్చా వేదిక ఏర్పాటు చేస్తుంది. చివరికి తన లాకెట్ ఒక దొంగ దగ్గర ఉందని తెలుసుకున్న పికె దాన్ని సంపాదించడం కోసం బాబా దగ్గరికి వెళ్లినా ప్రతిసారి అతను సమాధానం చెప్పలేని చిక్కు ప్రశ్నలు వేసి రాంగ్ కాల్ అనే ఒక కాన్సెప్ట్‌తో దేశ వ్యాప్తంగా అందరూ తమ మూఢ నమ్మకాల గురించి ఆలోచించేలా చేస్తాడు. ఒక్కొక్క మతం ఒక్కో కంపెనీ అని, కంపెనీలో లాగా ఒక్కొక్క మతానికి ఒక్కో యూనిఫారమ్, నియమ నిబంధనలు, నమ్మకాలు అన్నీ వేరు వేరుగా ఉంటాయని వర్ణించిన సీన్ ప్రేక్షకుల్ని ఆకట్టుకుంది. సూటిగా ఉండే ప్రశ్నలై, వాటికి ఒకే కోణంలో జవాబులు ఇవ్వకుండా దానికి సమాధానం మీరే వెతుక్కోండి అన్నట్లు ప్రేక్షకులకే వదిలేసి మార్పు కోసం చేసిన ఒక మంచి ప్రయత్నం పికె. ప్రస్తుతం ఉన్న ఈ రాజకీయ వ్యవస్థలో బలం పుంజుకుంటున్న బాబాలు, మత గురువులు అందరికీ ఒక చురుకు తగిలేలా చాలా సున్నితంగా విషయాన్ని తెరకి ఎక్కించారు.

**మతాన్ని కించపరుస్తూ ప్రజల మనోభావాలను దెబ్బతీసే విధంగా సినిమా ఉందంటూ సెన్సార్ బోర్డ్ పైన విరుచుకుపడ్డ సంఘ్ పరివార్ నేతలు, కోర్టులో కేసు వేసి పికె సినిమాను నిలిపివేయాలంటూ రౌడీ మూకలతో థియేటర్‌లను ధ్వంసం చేసిన కొన్ని మత సంస్థలు, వీళ్లంతా కలిసి పికెను వివాదాస్పదం చేసిన విషయం అందరికీ తెలిసిందే. అయితే నష్టపోయిందెవరు? .....ఎవరికి? సినిమా రిలీజ్ అయిన వారం రోజులకి మేల్కొన్న మన సంఘ్ పరివార్ కార్యకర్తలు సినిమాకు మరింత కలెక్షన్ పెంచడంలో తోడ్పడ్డారు. థియేటర్లపై దాడి చేసి విధ్వంసం సృష్టించిన ఒక అతివాద గ్రూపుగా మిగిలారు. మత ఛాందసవాద సంస్థలకు చెందిన వీళ్లంతా నిజంగా సినిమా చూశారా అని అనుమానం వస్తుంది.**



అవగాహన

# స్వైన్ ఫ్లూ

– డా॥ ఎం. రమాదేవి

దగ్గు, తుమ్ములు వచ్చినప్పుడు కర్చీఫ్‌కానీ, శుభ్రమైన గుడ్డగాని అడ్డుపెట్టుకోవాలి. ఎక్కడపడితే అక్కడ ఊయకూడదు. దగ్గు, జలుబు ఉన్నవారికి దూరంగా ఉండాలి. ఎక్కువ మంది గుంపు చేరే చోటికి (జాతర్లు, సినిమాలు, మీటింగ్‌లు) వెళ్ళకూడదు. మూకుమ్మడిగా మాస్క్‌లు ధరించడం వల్ల వ్యాధి వ్యాప్తి నిరోధించబడుతుందనేది వాస్తవం కాదు. కేవలం స్వైన్‌ఫ్లూ రోగులకు సమీపంగా వెళ్ళే ప్రమాదం ఉన్నప్పుడు మాత్రం మాస్కులు వేసుకోవచ్చు. దీనికన్నా ఇతర జాగ్రత్తలు అంటే గుంపులో వెళ్లకపోవడం, జలుబు, దగ్గు, జ్వరం ఉన్న వాళ్లను కలువకపోవడం వల్ల ఉపయోగం ఉంటుంది.

స్వైన్‌ఫ్లూ రాష్ట్ర వ్యాపితంగా ప్రజలను భయభ్రాంతులకు గురి చేస్తున్నది. ఈ సందర్భంగా అనుభవజ్ఞులైన డాక్టర్లు చేస్తున్న సూచనలను పాటించాలి.

స్వైన్‌ఫ్లూ (హెచ్1ఎన్1) అన్ని శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్ల వంటిదే తప్ప, భయంకరమైన వ్యాధి కాదు. జ్వరం, జలుబు, దగ్గు, గొంతునొప్పి, ఒళ్ళు నొప్పులు ఇవి స్వైన్‌ఫ్లూ లక్షణాలు.

ఆరోగ్యవంతమైన వారిలో హెచ్1 ఎన్ 1 వస్తే దానికదే ఒకవారం, పది రోజులకు తగ్గిపోయే అవకాశం అత్యధికం. ఇతర జబ్బులతో దీర్ఘరోగులుగా (గుండె, కిడ్నీ, షుగర్, ఆస్తమా) ఉన్న వారిలో కొంత మందికి కాంప్లికేషన్లు రావచ్చు.

ఈ వ్యాధి గాలి ద్వారా, స్పర్శద్వారా వ్యాపిస్తుంది. దగ్గు, తుమ్ములు, చేతులు, వస్తువుల ద్వారా ఒకరి నుండి మరొకరికి సోకుతుంది.



దగ్గు, తుమ్ములు వచ్చినప్పుడు కర్చీఫ్ కానీ, శుభ్రమైన గుడ్డగాని అడ్డుపెట్టుకోవాలి. ఎక్కడపడితే అక్కడ ఉమ్మి ఊయకూడదు. దగ్గు, జలుబు ఉన్నవారికి దూరంగా ఉండాలి. ఎక్కువ మంది గుంపు చేరే చోటికి (జాతర్లు, సినిమాలు, మీటింగ్‌లు) వెళ్ళకూడదు. మూకుమ్మడిగా మాస్క్‌లు ధరించడం వల్ల వ్యాధి వ్యాప్తి నిరోధించబడుతుందనేది వాస్తవం కాదు. కేవలం స్వైన్‌ఫ్లూ రోగులకు సమీపంగా వెళ్ళే ప్రమాదం ఉన్నప్పుడు మాత్రం మాస్కులు వేసుకోవచ్చు. దీనికన్నా ఇతర జాగ్రత్తలు అంటే గుంపులోకి వెళ్లకపోవడం, జలుబు, దగ్గు, జ్వరం ఉన్న వాళ్లను కలువకపోవడం వల్ల ఉపయోగం ఉంటుంది. చేతులు బాగా కడుక్కోవాలి. అంటే 15 నుంచి 20 సెకన్ల పాటు బాగా నురుగ వచ్చేటట్లు సబ్బుతో కడుక్కోవాలి. అన్ని వైపులా రుద్దుకోవాలి. ఇలా చేయడం వల్ల వైరస్ నశిస్తుంది.

హెచ్ 1 ఎన్ 1 వైరస్ సోకిన వారంతా ఆసుపత్రిలో చేరాల్సిన అవసరం లేదు. నూటికి ఒకరిద్దరికి మాత్రమే అవసరమవవచ్చు. ఆ అవసరాన్ని డాక్టర్ నిర్ణయిస్తారు. మిగిలిన 97 మంది ఇంట్లోనే వైద్యం చేసుకోవడం శ్రేయస్కరమని సైన్స్ చెబుతుంది.

ఐదేళ్ళలోపు పిల్లలు, 65యేళ్ళపైబడిన వృద్ధులు, గర్భిణులు, దీర్ఘకాలిక జబ్బులున్నవారికి దీనివల్ల కాంప్లికేషన్లు వచ్చే అవకాశం ఉంది. కాబట్టి వీరు మాత్రం ఎక్కువ జాగ్రత్తలు తీసుకోవాలి. ఈ క్యాటగిరీ వాళ్లు జబ్బు చేస్తే వైద్యుల సలహాతో "టామిఫ్లూ" లాంటి మందులు వాడాల్సి రావచ్చు.

**ప్రమాద సంకేతాలు :** జలుబు, దగ్గు, జ్వరం మూడునాలుగు రోజుల తర్వాతకూడా తీవ్రమైతే డాక్టరు దగ్గరికి వెళ్ళాలి. ఈ క్రింది లక్షణాలు కనిపిస్తే వెంటనే వైద్యం చేయించుకోవాలి.

**పిల్లలలో :** ఆయాసం, వేగంగా శ్వాస పీల్చుకోవడం, చర్మం నీలిరంగులోకి మారడం, మగతగా ఉండడం, మచ్చలతో జ్వరం రావడం, జబ్బు తగ్గిపోయినట్టే ఉండి ఉన్నట్టుండి ఎక్కువ కావడం.

**పెద్దవారిలో :** ఆయాసం, వేగంగా గాలిపీల్చుకోవడం, ఛాతిలో నొప్పి, కడుపులో నొప్పి, తల తిరగడం, అయోమయంగా ఉండడం, తీవ్రమైన వాంతులు.

**అందరూ పాటించాల్సిన ఆరోగ్య సూత్రాలు:** స్వైన్‌ఫ్లూ ఒకరినుంచి మరొకరికి సోకుతుంది కాబట్టి స్వైన్‌ఫ్లూ వచ్చినా, మామూలు జలుబు వచ్చినా క్రింది ఆరోగ్య సూత్రాలు పాటించాలి.

1) చేతులు బాగా కడుక్కోవాలి (2) ఇంట్లో పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి (3) మంచి పోషకాహారం, మంచినీరు, నిద్ర అవసరం. ఎటువంటి పథ్యం అవసరం లేదు (4) గుంపుకూడే ప్రాంతాలకు వెళ్ళకూడదు (5) దగ్గినా, తుమ్మినా కర్చీఫ్ అడ్డుపెట్టుకోవాలి.

**అందరికీ రక్త పరీక్షలు అవసరం లేదు :** జలుబు, జ్వరం, దగ్గు ఉన్న వారందరూ రక్త పరీక్షలు చేయించుకోవాల్సిన అవసరం లేదు. అనుమానితుల్లో 30శాతం మందికి మాత్రమే పరీక్షలు అవసరం కావచ్చు. హోమియో, నీలగిరితైలం, ఆకుమందు లాంటి పద్ధతుల ద్వారా జబ్బురాకుండా నిరోధించుకోవచ్చనే విషయానికి శాస్త్రీయ ఆధారం లేదు.

**స్వైన్‌ఫ్లూ వ్యాక్సిన్ :** స్వైన్‌ఫ్లూ వాక్సిన్ అందరికీ అవసరం లేదు. ఇప్పుడు వేసుకున్నా పనిచేయదు. ఎందుకంటే వాక్సిన్ వేసుకున్నాక యాంటీబాడీలు తయారు కావడానికి కనీసం నెల రోజుల సమయం కావాలి. ఈ లోగా స్వైన్‌ఫ్లూ తగ్గిపోతుంది. అదీ ఆరు నెలలు మాత్రమే ప్రభావం ఉంటుంది. సీజన్‌కు రెండు నెలల ముందే వాక్సిన్ వేసుకుంటే ప్రయోజనం ఉంటుంది. కానీ ఇప్పుడు ఉండదు. ●

కేస్‌స్టడీ

# వాళ్ళిద్దరూ ఒక్కటయ్యారు

- శాంతిశ్రీ



**వాళ్ళిద్దరూ పెద్దల్ని కాదని ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. వాళ్ళ ప్రేమానుబంధాలకు ప్రతిరూపంగా ఓ బాబు కూడా. ఆ బాబుకి ఇప్పుడు పదేళ్లు. అతనికి ఇప్పటికీ సరైన ఉద్యోగం లేదు. ఆమె మాత్రం చిన్న ఉద్యోగమైనా మానకుండా పనిచేస్తూ ఇల్లు గడుపుకొస్తుంది. ఈ మధ్య అతన్ని తల్లిదండ్రులు మరో పెళ్ళి చేస్తాం, కట్నం బోలెడంత వస్తుందని ఆశ చూపారు. దీంతో అతను ఆమెను వదిలించుకునే ప్రయత్నం చేశాడు. అందుకు పెళ్ళికి ముందు సంగతుల్ని అనుమానిస్తూ, ఆమె ఒప్పుకోనంటే కొడుతూ వేధించడం మొదలుపెట్టాడు. దీంతో ఆమె తల్లిదండ్రుల్ని వెంటబెట్టుకుని ఐద్వా లీగల్‌సెల్‌కు వచ్చింది. చివరకు ఆమెకు న్యాయం జరిగింది. అదెలా అంటే...**

ఆమెకు సుమారు మూడుపదుల వయస్సు ఉంటుంది. పదేళ్ళ కొడుకును, తల్లిదండ్రుల్ని వెంట తీసుకుని ఐద్వా లీగల్‌సెల్‌కు వచ్చి, సమస్యల వివరాల పత్రాన్ని పూర్తి చేసిచ్చి, తన సమస్యను వివరించింది ఇలా..

"నా పేరు స్వప్న. నా భర్త పేరు శేఖర్. మా ఇద్దరిది ప్రేమ వివాహం. మేమిద్దరం పెద్దలు వద్దన్నా పెళ్ళి చేసుకున్నాం. ఇద్దరం పదో తరగతి చదివేటప్పుడు స్నేహితులం. ఆ సమయంలోనే ప్రేమించుకున్నాం. నేను ఇంటర్‌లో చేరే స్థోమత లేక కంపెనీలో ఉద్యోగానికి చేరాను. అయినా శేఖర్‌కూ, నాకూ మధ్య ప్రేమ కొనసాగుతూనే ఉంది. ఏడాది తర్వాత ఏమయ్యాడో శేఖర్ అడ్రస్ లేకుండా వెళ్ళిపోయాడు. ఫోన్ చేస్తే స్విచ్ఛాఫ్. దీంతో కొన్నిరోజులు ఏడ్చాను. కానీ నేను పనిచేయనిది గడవని పరిస్థితి మాది. అందుకే ఉద్యోగం మాత్రం మానుకోలేదు. అయితే, పదో తరగతిలో మా ఇద్దరితో స్నేహంగా ఉండే శరత్ ఒకసారి కలిశాడు. శేఖర్ గురించి అడిగాడు. నేనూ అతని గురించే ఎదురుచూస్తున్నానని చెప్పాను. 'వాడు నిన్ను మోసం చేసి, వెళ్ళిపోయాడు' అన్నాడు శరత్. 'నా శేఖర్ అలాంటివాడు కాదని' అన్నాను. ఆరోజు శరత్ నా దగ్గర నంబరు తీసుకున్నాడు. తరుచూ ఫోనులు చేస్తుండేవాడు. శేఖర్ రాకపోవడం, శరత్‌తో రోజూ మాట్లాడుతుండటంతో అతనంటే ఇష్టం కలిగింది. ఒకరోజు ఇద్దరం సినిమాకు వెళ్లాం. కొన్నిరోజుల తర్వాత శరత్ 'నిన్ను పెళ్ళి చేసుకుంటాను. మరి నీ అభిప్రాయం ఏమిటి' అన్నాడు. శేఖర్ రాడని అర్థమైంది. నా జీవితం ఎందుకు పాడుచేసుకోవడం అని, అన్నీ తెలిసిన శరత్ అయితేనే మంచిదని అనుకున్నా. 'సరే' అని నా అంగీకారం తెలిపాను. అయితే శరత్ తల్లిదండ్రులు ఒప్పుకోలేదంటూ నాతో మాట్లాడటం మానేశాడు.

దీంతో నామీద నాకే అసహ్యం వేసింది. చనిపోవాలనిపించింది. కానీ అమ్మానాన్న గుర్తొచ్చి ఆ ఆలోచన మానుకున్నా. నా దారి నేను ఉద్యోగం చేసుకుంటూ ఉన్నాను. ఇలా ఏడాది కూడా గడవకముందే శేఖర్ తిరిగి వచ్చాడు. నన్ను పెళ్ళిచేసుకుంటానన్నందుకు అతని తల్లిదండ్రులు ఇంట్లోనే బంధించారనీ, ఫోను కూడా తీసేసుకున్నారనీ చెప్పాడు. ఎలాగో తప్పించుకుని వచ్చినట్లు చెప్పాడు. నేను కూడా శేఖర్ మాటలు విని, నేనే శరత్ చేసుకోవాలని తప్పుగా ఆలోచించాననుకుని, నన్ను నేనే తిట్టుకున్నా. శేఖర్ పెళ్ళి చేసుకుందాం అనగానే, వెంటనే ఒప్పేసుకుని, పెళ్ళి చేసుకున్నాం.

మా జీవితం ఆనందంగా గడిచిపోతోంది. మా పెళ్లయ్యి ఏడాది తిరిగేలోపే మాకో బాబు పుట్టాడు. శేఖర్ మాత్రం ఏ ఉద్యోగంలో చేరకుండా తిరిగి వస్తూండేవాడు. నేను మాత్రం అదే కంపెనీలో పనిచేస్తున్నా. బాగా పనిచేయడంతో అక్కడే నాకు ప్రమోషన్ వచ్చింది. బాబు పెద్దవుతున్నా, శేఖర్ ఉద్యోగంలో చేరకపోవడంతో మా ఇద్దరి మధ్య చిన్న చిన్న గొడవలు రావడం ప్రారంభమైంది. అంతేకాదు నేను కంపెనీ నుండి కొంచెం ఆలస్యమైనా అనుమానించడం, ఇంటికి రాగానే ఫోన్ తీసుకుని, చెక్ చేయడం చేస్తుండేవాడు. నేను ఎదిరిస్తే చేయి చేసుకోవడం కూడా మొదలుపెట్టాడు. అలా బాబుకి పదేళ్లు వచ్చే వరకూ కొనసాగింది.

ఈ మధ్య శరత్ గురించి నన్ను గుచ్చి గుచ్చి అడగడం మొదలుపెట్టాడు. తను లేనప్పుడు అతనితో ఎలా ఉంది? ఏ సినిమాకు వెళ్ళింది. అతన్ని ముద్దు పెట్టుకున్నావా? అంటూ వేధించేవాడు. అవేమీ లేవన్నా వినేవాడు కాదు. మా ఇద్దరి మధ్య అలాంటి అనుబంధం ఉందని ఒప్పుకునే వరకూ కొట్టడం మొదలుపెట్టాడు. ఈ బాధలు నేను తట్టుకోలేకపోతున్నా. బాబుని తీసుకుని అమ్మావాళ్ళ దగ్గరకు

వచ్చేశాను. మీరే నాకు న్యాయం చేయాలి' అంటూ ఏడ్చింది.

బాధ్యులు స్వప్న మాటలు విని, శేఖర్‌కు పై వారం రమ్మంటూ లేఖ పంపారు.

పైవారం శేఖర్ వచ్చాడు. స్వప్న కూడా బాబుని, తల్లిదండ్రుల్ని వెంటబెట్టుకుని వచ్చింది.

శేఖర్‌ని లోపలికి పిలిచి మాట్లాడారు. "నాకు స్వప్న అంటే ఇష్టమే. కానీ తనతో మొదట్లో వలే ఉండలేకపోతున్నా. ఆమెకూ శరత్‌కూ సంబంధం ఉందని అనిపిస్తోంది. మా అమ్మావాళ్ళు వచ్చేయమంటున్నారు. మళ్ళీ పెళ్లి చేస్తామంటున్నారు" అన్నాడు.

"అసలు కారణం ఇది. నువ్వు సరైన ఉద్యోగం లేకుండా, ఇప్పటికే నీ వల్ల ఇద్దరు ఇబ్బందిపడుతున్నారు. వాళ్ళను గాలికి వదిలి, మళ్ళీ మీ అమ్మానాన్న కట్నం కోసం పెళ్ళి చేస్తానంటే సిద్ధమవుతున్నావు. ఆడపిల్లను నాకెందుకు అని అనుకోకుండా, ఉద్యోగం చేసి, నిన్నూ, నీ కొడుకుని పోషిస్తున్నందుకు ఆమెను ఏ విధంగా తప్పు పట్టాలో అర్థంకాక, ఇలా ఖాళీగా కూర్చొని ఆమెను వేధించడం పనిగా పెట్టుకున్నావు. ప్రేమించడం అంటే సినిమాలో చూపించినట్లు కాదు. మీకు ఇలాంటి ఆలోచనలన్నీ వాటిని చూసే వస్తున్నాయి. ఆ అమ్మాయి నీకు దొరకడం నీ అదృష్టం. చాలా మంచి అమ్మాయి. తన కాళ్ళ మీద తాను నిలబడగలదు. నిన్ను పెళ్ళి చేసుకున్న దగ్గర నుంచి నీ గురించి, కొడుకు గురించి తపనపడుతున్న ఆ అమ్మాయిని నువ్వు వదిలేసి వెళ్ళిన సమయంలో ఆమె ఎవరితో ఎలా ఉందో అంటూ ఆలోచనలు చేస్తూ, ఆమెను వేధించడం తగనిపని. నువ్వు కూడా చిన్న ఉద్యోగమైనా ఒకటి చూసుకో. నీకు వారం రోజులు సమయం ఇస్తున్నాం. ఏవిషయం ఆలోచించుకుని రా!" అన్నారు బాధ్యులు.

పైవారం ఇద్దరూ, బాబుని తీసుకుని వచ్చారు.

శేఖర్ మాట్లాడుతూ "మేమిద్దరం మంచిగానే ఉంటాం. మా విషయంలో ఇరువైపుల తల్లిదండ్రుల జోక్యం ఉండకూడదు. నేను నా తల్లిదండ్రుల్ని రానివ్వను. స్వప్నను కూడా వాళ్ళ తల్లిదండ్రుల్ని జోక్యం చేసుకోవద్దని చెప్పండి" అన్నాడు.

"నువ్వు ఆ అమ్మాయిని కొట్టి, వేధిస్తుంటే వాళ్ళ తల్లిదండ్రులు జోక్యం చేసుకున్నారు. నువ్వు మంచిగా ఉంటే వాళ్లెందుకు జోక్యం చేసుకుంటారు? నువ్వు నీ భార్యను కొట్టినా, వేధించినా, అనుమానించినా మేము ఊరుకోం. మీ తల్లిదండ్రులు ఎవ్వరూ జోక్యం చేసుకోరు. నువ్వు ఉద్యోగం చూసుకున్నావా?" అని బాధ్యులు అడిగారు.

"షాపింగ్‌మాల్‌లో బిల్లింగ్ పనిలో చేరాను" అన్నాడు శేఖర్.

"నన్ను అనుమానించడం, కొట్టడం చేయకూడదు" అంది స్వప్న.

"ఇక అలాంటివేమీ ఉండవు" అన్నాడు శేఖర్.

ఆ మేరకు రిజిష్టర్‌లో రాసి, సంతకాలు చేయించుకున్నారు. ఇద్దర్నీ పదిహేను రోజులకు ఒకసారి ఎలా ఉంటున్నదీ వచ్చి చెప్పి, సంతకాలు చేసి వెళ్ళమన్నారు.

ఇద్దరూ అంగీకరించారు. సంతోషంగా బాబుని తీసుకుని బాధ్యులకు థ్యాంక్స్ చెప్పి ఇంటికి పయనమయ్యారు.

## అభ్యుదయ వాది 'ప్రగతి హనుమంతరావు'కు నివాళి



ఇటీవల మరణించిన ప్రగతి ప్రింటర్స్ అధినేత హనుమంతరావు గారికి **ఐద్వా ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కమిటీ నివాళ్లులు** అర్పిస్తోంది.

1948లో జరిగిన సాయుధ తెలంగాణా పోరాటంలో పాల్గొని మూడేళ్ళ జైలు శిక్ష అనుభవించి తదనంతరం ప్రింటింగ్ రంగంలో అడుగుపెట్టి అతికొద్ది కాలంలోనే ఆ రంగంలో ప్రముఖ వ్యక్తిగా ఎదిగారు ఆయన. ఎదిగిన కొద్దీ ఒదిగి ఉండే లక్షణంతో తుదివరకు అభ్యుదయ భావాలతో ముందుకు సాగారు అనడానికి ఉదాహరణ ఆయన మహిళా చైతన్యానికి తనవంతు సహాయ సహకారాన్ని అందించడం. అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం నుండి వెలువడే సాహిత్యాన్ని ప్రజలముందుకు తీసుకువెళ్ళేందుకు ఆర్థికంగానూ తమ ముద్రణా సంస్థ ద్వారా కావలసిన సహాయ సహకారాలను అందించారు. అట్లే మోటూరు ఉదయం ట్రస్టు ఏర్పాటుకు, ట్రస్టు భవనానికి తమ వంతు సహాయాన్ని మాత్రమే కాకుండా తమ పరిచయస్తుల ద్వారా కూడా తోడ్పాటునందించారు.

ప్రజానాట్యమండలి కళాకారుడుగా తన ప్రస్థానాన్ని ప్రారంభించి ఉద్యమాల్లో పాల్గొని ప్రగతి పబ్లిక్ చారిటముల్ ట్రస్టు ద్వారా పేద ప్రజలకు ఆరోగ్య సేవలు అందించేందుకు కృషిచేసిన హనుమంతరావుగారు ధన్యజీవి. ఈ సందర్భంగా ఆయన కుటుంబ సభ్యులకు సానుభూతిని తెలియజేస్తూ ఆయన మృతికి ఐద్వా జోహార్లు అర్పిస్తోంది.



# P.V.K.K. INSTITUTE OF TECHNOLOGY

An ISO 9001 : 2008 Certified Institute

Approved by A.I.C.T.E, Affiliated to JNTUA, Ananthapuramu.



Dr. PALLE RAGHUNATHA REDDY, M.Sc., M.Phil., Ph.D.
Chairman, Sri Balaji Educational Society
MINISTER FOR IT,NRI,TA & MINORITIES, A.P.

LET YOUR JOURNEY TO SUCCESS BEGIN HERE







POLYCET / EAMCET / ICET CODE
**PVKK**

- Just 3 kms from heart of Ananthapuram city
- Uncompromised discipline
- Well experienced and qualified faculty
- Innvovative teaching and learning proces
- Effective proctor system to counsel the students
- Emphasis on guest lectures by eminent personalities from industries and academia
- Fully equipped laboratories, workshops. Air conditioned seminar hall
- Standby power generators (125 kva)
- 10 MbPS Internet connectivity
- Ragging Free campus
- Separate hostels for Boys and Girls in the campus
- Special attnetion on employable skills

**Diploma Courses :** Civil, EEE, Mech., ECE

**B.Tech., Courses :** Civil, EEE, Mech., ECE, CSE

**P.G. Courses :** M.Tech. (ECE, EEE, CSE, Civil, Mech.), M.B.A

**SRI BALAJI P.G. COLLEGE (MCA),** Ananthapuramu. (Code : SBLJ) : 9441984345

**SRI BALAJI P.G. COLLEGE (MBA),** Ananthapuramu. (Code : ABLJ) : 9440429977

**BALAJI COLLEGE OF PHARMACY,** Ananthapuramu. (Code : BALA) : 944094489

FOR DETAILS CONTACT

Phones : **9550616861, 8688810055, 8886630031 / 32 / 24**

Sanapa Road, Rudrampet, **ANANTHAPURAMU** - 515 001. Ph : 08554-200466, Fax : 248094

ఆదర్శవనిత

# సావిత్రిబాయి పూలే జీవితమే ఒక సామాజిక ఉద్యమం

- ఎం.రేణుక

భారతదేశ మొదటి సామాజిక విప్లవకారిణి, తొలి ఆధునిక కవయిత్రి, ప్రథమ ఉపాధ్యాయిని సావిత్రిబాయి పూలే. ఈమె జీవితమే ఒక ఉద్యమంగా ఆమె చనిపోయేవరకు కొనసాగించింది. ఆనాటి సామాజిక నియమాలు, మతవిశ్వాసాలు సాంప్రదాయక విధానాలకు వ్యతిరేకంగా అజ్ఞానాన్ని బానిసత్వంగా గుర్తించి దాన్ని రూపుమాపేందుకు నిరంతర పోరాటాన్ని నడిపిన మహిళ. తన సత్యదీక్షతో అసత్యవాదులందరిని అధిగమించిన మహిళ ఆమె సావిత్రిబాయిపూలే.



మహారాష్ట్రలోని సతారా జిల్లాకు చెందిన నైగావ్‌లో ది.03.01.1831న సావిత్రిబాయి పూలే జన్మించారు. 1840లో జ్యోతిరావుతో వివాహం జరిగినది. ఈ దంపతులు మొదటిసారిగా సమగ్రమైన కుల వ్యతిరేక సిద్ధాంతానికి రూపకల్పన చేసి ఆదిపత్య విలువలకు వ్యతిరేకంగా గొప్ప ప్రజా ఉద్యమాలను నిర్మించారు. స్త్రీలు, శూద్రులు, అతిశూద్రులు అందరినీ ఒక తాటి మీదకు తీసుకురావటమే ఈ ఉద్యమ లక్ష్యం.

విప్లవకారుడైన తన భర్తతో కలిసి సావిత్రిబాయి పూలే దాదాపు 66 సం॥లపాటు చేసిన పోరాటాలు, ఎదుర్కొన్న సమస్యలు తగిన గుర్తింపు పొందడానికి కారణం. ఆధునిక భారతదేశంలో మొట్టమొదటి ఉపాధ్యాయురాలిగా పేదప్రజలు ముఖ్యంగా స్త్రీల విద్యాభివృద్ధికై కృషిచేసిన ఉద్యమకారిణిగా, స్త్రీ విముక్తి పోరాట నాయకురాలిగా, కవయిత్రిగా కులము, పితృస్వామ్యము అనే శక్తులపై యుద్ధానికి పూనుకున్న సాహసిగా సావిత్రిభాయి ఒక స్వతంత్ర అస్థిత్వాన్ని నిర్మించుకున్న వ్యక్తి.

ఈ ప్రపంచాన్ని మరింత మానవీయంగా, సంఘటితంగా, ప్రేమపూరితంగా రూపొందించాల్సిన అవసరమూ, అవకాశమూ సావిత్రిబాయి విశ్వాసం. ఆమె అంకితమైన తీరు అసామాన్యమైనది. అదే ఆమెను ఒక విశిష్టమైన వ్యక్తిగా నిలిపింది.

భారతదేశంలో మొట్టమొదటి మహిళా పాఠశాలను స్థాపించిన సావిత్రిబాయి. 1852లో "మహిళా సేవామండల్" అనే మహిళా సంఘాన్ని కూడా నెలకొల్పింది. పీడిత ప్రజలను భౌతికంగాను, ఆర్థికంగాను విముక్తి చేయడమే సావిత్రిబాయి పోరాటాల లక్ష్యం. ఈ ఆదర్శాన్ని ఆమె కేవలం మాటల్లో వల్లించలేదు. జీవితాంతం ఆచరించి చూపింది.

"శ్రమించి పనిచేయండి, శ్రద్ధగా అధ్యయనం చేయండి, మంచి మార్గంలో నడవండి" అనేది సావిత్రిబాయి నినాదం. మానవుల అభివృద్ధికి విద్య, శ్రమ ఎంత అవసరమైనవో ఆమె పదేపదే నొక్కి చెప్పుతుండేది. స్త్రీలు, పురుషులతో అన్ని విధాల సమానులే తప్ప వారికి బానిసలు కాదని స్త్రీలకు విద్య అత్యంత ఆవశక్యమని ఆమె బలమైన విశ్వాసం.

పూలే దంపతులకు పిల్లలు కలగకపోవడంతో వంశాంకురం కోసం మళ్ళీ వివాహం చేసుకోమని పూలేను ఆయన బంధువులు వత్తిడి చేయసాగారు. ఆయన వాళ్ళకు ఇలా జవాబిచ్చారు. "ఏ దంపతులకైనా సంతానం కలగకపోతే అందుకు స్త్రీని బాధ్యురాలిని చెయ్యటమూ, గొడ్రాలని నిందించటం అన్యాయం. లోపం భర్తలోనూ కూడా ఉండే అవకాశం ఉంది. అలాంటి సందర్భాల్లో ఆ స్త్రీ మరో వివాహం చేసుకుంటానంటే భర్త అంగీకరించగలుగుతున్నాడా? అది తనను అవమానించడమని భావించాడా? అందుకే పిల్లలు కలగనంత మాత్రాన పురుషులు మరొక వివాహానికి పూనుకోవడం దుర్మార్గపు చర్య. పూలేకు సావిత్రిబాయి మీద ఉన్న ప్రేమకు, గౌరవానికి ఆయన చెప్పిన మాటలే సాక్ష్యాలు. ఒక బ్రాహ్మణ వితంతువుకు పుట్టిన పిల్లవాన్ని 1874లో పూలే దంపతులు దత్తపుత్రుడుగా స్వీకరించారు. పూలే దంపతులు పెంచిన ఆ పిల్లవాడు వారి కుమారుడిగానే పెరిగి డాక్టర్ అయినాడు. వితంతువులకు శిరోముండనం చేయబోము అంటు క్షురకులు తిరుగుబాటు చేసేటట్లుగా వారిని చైతన్యపరిచి 1860లో ఒక సమ్మెను నిర్వహింపజేసింది. సత్యశోధక సమాజపు మహిళావిభాగం సావిత్రిబాయి ఆధ్వర్యంలో నడిచేది. వివాహాల వంటి శుభకార్యాలను పురోహితులు లేకుండా నిర్వహించే విధానాన్ని ఆ సంస్థ ప్రారంభించింది. ఆనాటి సమాజంలో ఇటువంటి సంఘటనలకు ఉన్న ప్రాముఖ్యత ఎలాంటిదో ఈ 21వ శతాబ్దంలోని మన ఊహకు అందకపోవచ్చు. 1897లో పూనెలో అంటువ్యాధులు విజృంభించాయి. రోగులకు సేవ చేయడంలో సావిత్రిబాయి రాత్రింబవళ్ళు పనిచేసింది. ఆ పనిలో భాగంగా ఆమెకు ప్లేగువ్యాధి సోకింది. చివరికి 1897 మార్చి 10వ తేదీన ఆమె కన్నుమూసింది. కుమారుడు యశ్వంత్ ఆమె అంత్యక్రియలను నిర్వహించినాడు. 19వ శతాబ్దంలో ఆమె సాగించిన కృషి ముందు కులం, వర్గం, లింగ వివక్ష వంటి శక్తులన్ని తలవంచక తప్పలేదు.

**(మార్చి 10 సావిత్రిబాయి పూలే వర్ధంతి సందర్భంగా ...)**

## అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలతో...





## శ్రీ సాకే శైలజానాథ్

మాజీ విద్యాశాఖా మంత్రివర్యులు

అనంతపురం జిల్లా

వీరవనిత

# విప్లవ పోరాటంలో వికసించిన 'పద్మం'

- సలీమ

**భూ**మి కోసం, భుక్తి కోసం, పేదప్రజల విముక్తికోసం వీరతెలంగాణా విప్లవ పోరాటంలో ప్రాణాలకు తెగించి పోరాడిన వీరులు ఎందరోఉన్నారు. వారిలో పురుషులతో సమానంగా అదరక బెదరక ఉద్యమంలో పాల్గొన్న మహిళలు ఉన్నారు. అనేక చిత్రహింసలకు, అత్యాచారాలకు గురైన వీరవనితలు ఉన్నారు. ఎన్నో త్యాగాలు చేసి పోరుబాటలో నిలిచిన వీరవనితల్లో పద్మ ఒకరు.

**బాల్య జీవితం**

పద్మ1932వ సంవత్సరం మెదక్‌జిల్లా, గజ్వేల్ తాలూకా, పాములపర్తిలో దొరల కుటుంబంలో జన్మించారు. కృష్ణారెడ్డి, రాధమ్మల చివరి సంతానం పద్మ. తల్లిదండ్రులు ఆమెకు పెట్టిన అసలు పేరు ప్రమీల. తల్లిదండ్రులు, తోడబుట్టినవారు కాలు కిందపెడితే కందిపోతుందన్నంత సుకుమారంగా పెంచారు. తోటిపిల్లలతో ఆటకు వెళ్ళినా, గడీలకు వెళ్ళినా పెరటి తోటలోకి వెళ్ళినా, గ్రామంలోని వీధిబడికి వెళ్ళినా ఒక నౌకరు వెంట ఉండాల్సిందే.



**కోదండ రాంరెడ్డితో వివాహం**

ఆమెకు 12వ ఏట కొమ్మిడి కోదండ రాంరెడ్డితో వివాహం జరిగింది. ఈ వివాహం ఆమె జీవితాన్ని ఒక మలుపు తిప్పింది. ఈ మలుపు ఊహించినది కాదు. కోదండరాం రెడ్డిది నల్గొండ జిల్లా భువనగిరి తాలూకా, బ్రాహ్మణపల్లి గ్రామం. ఎంతో మంచి మనసు కలిగిన వ్యక్తి. అప్పటి ఆయన రాజకీయ జీవితం గురించి ఆమె పట్టించుకోలేదు. విప్లవోద్యమాలకు అప్పటికే ఆయన ఆకర్షితుడయ్యాడు. నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా కొనసాగుతున్న అన్ని రకాల ప్రజా ఉద్యమాలలో పాల్గొనేవారు.

**అప్పటి హైద్రాబాద్ సంస్థాన పరిస్థితులు**

హైదరాబాద్ సంస్థానం దాదాపు నాలుగు శతాబ్దాలుగా అసఫ్‌జాహీ వంశీయుల పాలనలో వుంది. రైతులపై విపరీతమైన పన్నుల భారం, లేవీ వసూళ్ళు, వెట్టిచాకిరి, కొట్టడం, తిట్టడం, ఎదురుతిరిగితే చంపడం సర్వసాధారణమైపోయింది. ప్రజల శ్రమకు, ప్రాణాలకు విలువలేదు. రకరకాల పన్నులు చెల్లించలేక ప్రజలు చెప్పరాని బాధలు పడేవారు. ఈ నిజాం నిరంకుశ పరిపాలనలో ప్రజలకు ఎలాంటి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలుండేవి కావు. ఇలాంటి సమయంలోనే కమ్యూనిస్టు ఉద్యమం నైజాం స్టేట్‌లోకి ప్రవేశించింది. కోదండరాంరెడ్డి గ్రామాల్లో రజాకార్ల ఆగడాలను సహించలేకపోయాడు. తాను భూస్వామి కుటుంబంలోని వాడైనా భూస్వాముల దౌర్జన్యాలను సహించేవాడు కాదు. తన గెరిల్లా దళాలతో భూస్వాములు, మిలటరీ, పోలీసు, రజాకార్లపై దాడులకు సిద్ధమయ్యాడు.

**ఉద్యమ పాఠాలు నేర్చుకున్న సమయం**

అప్పటికీ బయట ప్రపంచం గురించి తెలియని పద్మకు భర్త రాజకీయ జీవితం గురించి ఏమీ అర్థమయ్యేది కాదు. అయినా భర్తంటే ఎంతో అభిమానం. అవే ఆమెను తన భర్త కార్యాచరణకు తోడు నిలిచేవిధంగా చేశాయి. కోదండరాంరెడ్డి చిన్న చిన్నగా పద్మకు రాజకీయ పాఠాలు నేర్పడం మొదలుపెట్టారు. 1948 సెప్టెంబర్‌లో యూనియన్ సైన్యం ప్రవేశించిన తర్వాత కమ్యూనిస్టులపై దాడులు ప్రారంభమయ్యాయి. దాంతో కోదండరాంరెడ్డి రహస్య జీవితం ప్రారంభమయ్యింది. భర్త దేనికోసం రహస్య జీవితం గడుపుతున్నాడో, ఆ పార్టీ సిద్ధాంతాలేమిటో చాలా వరకు పద్మ గ్రహించారు. ప్రజలకు అండగా నిలుస్తున్న పార్టీ పట్ల అభిమానాన్ని పెంచుకున్నారు. 1948 సెప్టెంబర్ 20న పద్మ, కోదండరాంరెడ్డిలకు కొడుకు పుట్టాడు. వారిని చూసుకోవటానికి వీలుగ చిల్కలగూడా 'డెన్'లో ఉంచారు. ఇలా పద్మకు మొదటి సారి 'డెన్' జీవితం ప్రారంభమయ్యింది.

**తుపాకీ చేత పట్టిన వేళ**

1949 జూన్ 6వ తేదీన యూనియన్ సైనికుల తుపాకీ గుళ్ళకు కోదండరాంరెడ్డి బలైనట్లు పద్మకు సమాచారం అందింది. ఆ తరువాత పద్మ జీవితం ఇంకొక మలుపు తిరిగింది. ఆమెను చిల్కలగూడ నుండి సిక్ విలేజ్‌లో వున్న కొత్త 'డెన్' లోకి మార్చారు. ఆమె ఎప్పుడూ దుఃఖంతో కుమిలిపోయేవారు. డెన్‌లో ఉన్న మిగిలిన మహిళా కామ్రేడ్స్ ఆమెను ఓదార్చే వారు. భర్త మాటలను గుర్తుచేసుకున్నారు. క్రమంగా ఆమె తన కర్తవ్యమేమిటో గుర్తించారు.

తానొక రాజకీయ విద్యార్థినని భావించారు. రాజకీయాలంటే ఏమిటో, పార్టీ అంటే ఏమిటో, గెరిల్లా పోరాటం అంటే ఏమిటో, ఆ దళాల పని ఏమిటో తెలుసుకోవాలనే నిర్ణయానికి వచ్చారు. డెన్‌లోని కామ్రేడ్స్ చర్చలు, మీటింగ్‌లు, సంభాషణలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. కామ్రేడ్ ఆర్.యన్(రావి నారాయణరెడ్డి) గారి

రాజకీయ క్లాసులకు ఆమె హాజరై తన అనుమానాలను దూరం చేసుకున్నారు. ఈ డెన్‌లో ఎస్.వి.కె ప్రసాద్, మఖ్దూం మొహియుద్దీన్, రాజ్‌బహదూర్ గౌర్, భీంరెడ్డి నర్సింహరెడ్డి వంటి కామ్రేడ్స్ రాజకీయ తరగతులు నడిపారు. వీరి ద్వారా అనేక విషయాలు తెలుసుకున్న పద్మలో ప్రజా శత్రువులపై పగతీర్చుకోవాలనే ఆరాటం ప్రారంభమయింది.

'పద్మా నువ్వు గుండె గట్టిచేసుకోవాలి పార్టీ ప్రతిష్టను నిలబెట్టాలి' అన్న భర్త మాటలు గుర్తుకు వచ్చాయి. భర్త ఆశయ సాధనకు గెరిల్లా దళాలలో చేరడమే మార్గమని పద్మ దృఢంగా నిశ్చయించుకున్నారు. రహస్య స్థావరం వదిలి పోరాట ప్రాంతానికి వెళ్ళటానికి నిర్ణయించుకున్నారు.

తుపాకులూ, రైఫిళ్లు గురిపెట్టి కాల్చడం, తుపాకీలో మందు కూర్చటం, రైఫిళ్లు శుభ్రం చేయడం, తూటాలు సరిచేసి ఎక్కించడం, చేతి బాంబు (హేండ్ గ్రేనైడ్స్) విసరటం వంటి సాహసకృత్యాలన్నీ అభ్యసించారు. ఒకసారి కామ్రేడ్ సుందరయ్య శిబిరానికి వచ్చారు. పద్మ గురించి తెలుసుకొని ఆమెను అభినందించారు. దాడికి వెళ్ళవలసిన సమయం రానేవచ్చింది. బాబును వదిన దగ్గర వదిలి పోరాటంలో పాల్గొన్నారు. ఒక దాడి సమయంలో పరుగెత్తుతున్న పద్మ భుజానికి తూటా తగిలింది. డాక్టర్ రామదాస్ పద్మ భుజానికి తగిలిన గుండును బయటకు తీసి కట్టుకట్టారు.

**కామ్రేడ్ గౌతమ్‌తో పరిచయం, వివాహం**

ఒక సారి డెన్‌పై దాడి జరిగింది. దాంతో కొత్త డెన్ నిర్వహణ బాధ్యతను పద్మ, గౌతమ్‌లకు పార్టీ అప్పగించింది. కాని పరాయి వ్యక్తికి భార్యగా నటించడం పద్మకు మింగుడు పడలేదు. కాని పార్టీ నిర్ణయాన్ని గౌరవించారు.

అక్కడ కూడా పద్మ భర్త, కొడుకు జ్ఞాపకాలతో అప్పుడప్పుడు బాధపడడం డెన్‌లోని సీతాదేవి గమనించింది. పద్మతో సీతాదేవి తన అనుభవాలను పంచుకుంది. ఉద్యమంలో పనిచేస్తున్న స్వరాజ్యం, రాములమ్మ,రంగమ్మ, తిరుమలమ్మ, కమలక్క, సుశీల, కోయ వెంకటమ్మ, లచ్చక్క, నాగక్కల గురించి కూడా చెప్పింది. ఈ విషయాలు విన్న పద్మ ఆలోచనలలో గతం కంటే చాలా మార్పు వచ్చింది. ఎంతో ఉత్సాహంగా చర్చలల్లో పాల్గొనేవారు. అక్కడే పద్మకు గౌతమ్‌పైన ఒక మంచి అభిప్రాయం ఏర్పడింది. పద్మతో గౌతమ్ ఎన్నో పుస్తకాలు చదివించేవాడు. అతని స్నేహంతో ఆమె కొంత ఊరట చెందారు. ఇద్దరూ పార్టీ సహకారంతో 1950 ఏప్రిల్ 19న ఒకటయ్యారు.

వివాహం జరిగిన మూడు నెలలకు మిలిట్రీ దాడులు ప్రారంభమయ్యాయి. పోరాటాన్ని విస్తరింపచేయాలనే దృష్టితో ఒక దళంతో గౌతమ్‌ను బస్తర్ పంపించాలని నిర్ణయించారు. పద్మ తను కూడా గౌతమ్‌తో వెళతానని అన్నది. పద్మ అప్పటికే గర్భవతి. దాంతో పార్టీ ఆమెను పంపటానికి ఒప్పుకోలేదు. గౌతమ్ బస్తర్ వెళ్ళిపోయాడు.

విజయవాడ ఆసుపత్రిలో పద్మకు పుట్టిన బిడ్డను పార్టీ నిర్ణయం ప్రకారం నర్స్ వేరేవారికి అప్పగించేసింది. ఒక కొరియర్ సహాయంతో పద్మ తన అన్నల వద్దకు చేరుకుంది. గౌతమ్ క్షేమసమాచారాలు తెలుసుకోవాలని చాలా ప్రయత్నించింది. అన్నలు సహకరించేవారు కాదు. అతి కష్టం పైన ఒక సమాచారాన్ని తెలుసుకుంది. బస్తర్ వెళ్ళిన దళంలో చనిపోయిన వారిలో గౌతమ్ కూడా ఉండొచ్చని అనుమానాన్ని వ్యక్తం చేశారు. దాంతో పద్మ గుండెలు పగిలిపోయేలా ఏడ్చారు. నిజానికి గౌతమ్ చనిపోలేదు.

**పోరాట విరమణ అనంతరం**

వీర తెలంగాణా పోరాట విరమణ తరువాత బస్తర్ అడవుల నుండి గౌతమ్ హైదరాబాద్ చేరుకున్నారు. పద్మ ఎక్కడ ఉందో తెలియలేదు. ఆమెను కలవటానికి ఎన్నో ప్రయత్నాలు చేశారు. పార్టీ వారు ఎవరూ పద్మను కలవకుండా అన్నలు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశారు. ఎన్నో కష్టాలు పడి చివరకు గౌతమ్‌ను కలుసుకున్నారు. కొన్ని రోజులు పార్టీ సభ్యుల ఇండ్లల్లో తలదాచుకున్నారు. ఆ తరువాత పార్టీ సహాయంతో గోషామహల్‌లో ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నారు. ఎన్నో ఆర్థిక సమస్యలను ఎదుర్కొన్నారు. ఐనా వారు పార్టీని ఎప్పుడూ మరిచిపోలేదు. వారి శక్తి మేరకు చందాలు ఇవ్వడం, కార్యక్రమాలలో పాల్గొంటూ ఉండేవారు.

**రాజకీయాలంటే ఏమిటో, పార్టీ అంటే ఏమిటో, గెరిల్లా పోరాటం అంటే ఏమిటో, ఆ దళాల పని ఏమిటో తెలుసుకోవాలనే నిర్ణయానికి వచ్చారు. డెన్‌లోని కామ్రేడ్స్ చర్చలు, మీటింగ్‌లు, సంభాషణలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. కామ్రేడ్ ఆర్. యన్(రావి నారాయణరెడ్డి) గారి రాజకీయ క్లాసులకు ఆమె హాజరై తన అనుమానాలను దూరం చేసుకున్నారు. ఈ డెన్‌లో ఎస్.వి.కె ప్రసాద్, మఖ్దూం మొహియుద్దీన్, రాజ్‌బహదూర్ గౌర్, భీంరెడ్డి నర్సింహరెడ్డి వంటి కామ్రేడ్స్ రాజకీయ తరగతులు నడిపారు. వీరి ద్వారా అనేక విషయాలు తెలుసుకున్న పద్మలో ప్రజా శత్రువులపై పగతీర్చుకోవాలనే ఆరాటం ప్రారంభమయింది.**

పద్మ గారి జీవితం నేటి యువతకు ఎంతో స్ఫూర్తి దాయకం. భూస్వాముల కుటుంబంలో పుట్టి ఉద్యమంతో తన జీవితాన్ని మమేకం చేశారు. ప్రజలను పట్టి పీడిస్తున్న రజాకార్ల అంతుచూడాలనే ఆమె దృఢ నిశ్చయం ముందు కష్టాలు, కడగండ్లు ఓడిపోయాయి. ●

కవిత

# తేడాలు - బేడీలు తెంచుదాం సమానత్వం పెంచుదాం

- మహేష్ దుర్గే



ఏయ్! నువ్వెక్కడికే?
వాడంటే మగ పిల్లోడు...
ఇవి అమ్మ పలుకులు
చిరుప్రాయపు లేత మనస్సుల్లో
అడుగడుగునా వెదజల్లే
వ్యత్యాసపు చెరుగులు
క్రికెట్ బ్యాటు
బంతి-కారు- పిస్తోలు
తమ్ముడి ఆటబొమ్మలు
వంట పాత్రలు- కూర పిందెలు
తొక్కుడు బిల్లలు- ముగ్గుల గీతలు
బొమ్మా బొరుసులూ
నా ఆటలు...
తేడా ఇక్కడే ఉంది - మన ఇంటే ఉంది
ప్రైవేటు స్కూలు-బూటు-సూటు
నాలుగంకెలు మించిన ఫీజులు
బర్త్‌డే కేకు-పాకెట్‌మనీ వేటు
తమ్ముడి వాటా
అక్షరజ్ఞానం చాలు
ఒంటినిండి ముసుగేమేలు
ఇంకా ఎదిగితే పెంచుకోలేని వ్యయాలు
కోరినంత ఇచ్చుకోలేమన్న భయాలు
నాకెదురయ్యే మాట
తేడా ఇక్కడే ఉంది- మన ఇంటే ఉంది.
ఈ మాటలు పలికేది అమ్మనోట
ఇది కానేకాదు మనసులోని మాట
తనకు వాళ్ళమ్మ- అమ్మమ్మ
తాతమ్మలు చెప్పారు
అమ్మైనా, అమ్మమ్మైనా- తాతమ్మైనా
వారి భావాలు కావు
వారి పురుషులకు లోబడ్డ
అంధవిశ్వాస- బానిసత్వపు
దుఃసంస్కారాలవి
పురుష అహంభావ బీజాలు
నాటుకుపోయిన సంకెళ్లవి..
ఇంత వివక్షలోనూ అమ్మ నాకు తోడుంది
అయినా అమ్మ మాట చెల్లకుంది
ఎందుకంటే తేడా ఇక్కడే ఉంది-మన ఇంటే
ఉంది
అందుకే అమ్మ గొంతునేటి వరకు
మూగబోయింది...
ఇప్పుడు నేనున్నానమ్మా నీతోడు
కలిసి ప్రశ్నిద్దాం
మనలాంటి వారందరినీ కలుపుకుందాం
వివక్షను అంతం చేద్దాం
సాధికారతను సాధిద్దాం...

# నాయుడమ్మ అవార్డు గ్రహీతలు ఈ ఆణిముత్యాలు

అతివలకు అవకాశాలు కల్పిస్తే అన్ని రంగాల్లో రాణిస్తారు. అణువు నుండి అంతరిక్షందాకా దూసుకెళ్ళారు ఈ ఇద్దరు మహిళా శాస్త్రవేత్తలు. ఇటీవల ప్రకటించిన నాయుడమ్మ అవార్డును అందుకున్న క్షిపణి శాస్త్రవేత్త టెస్సీ థామస్, ఉపగ్రహ సమాచార వారధి గీతా వరదన్‌లే ఇందుకు నిలువెత్తు నిదర్శనం.



టెస్సీ థామస్, గీతా వరదన్

టెస్సీ థామస్ డిఆర్‌డివో అడ్వాన్స్‌డ్ లేబోరేటరీ డైరెక్టర్. ఈమె స్వస్థలం కేరళ రాష్ట్రంలోని అలెప్పీ. 1963లో జన్మించారు. తల్లిదండ్రులు టిటి థామస్, కుంజమ్మ. ఆరుగురు తోబుట్టువుల్లో టెస్సీ ఒకరు. అందరూ విద్యావంతులే. వివిధ రంగాల్లో ఉన్నత హోదాల్లో పనిచేస్తున్నారు. టెస్సీ మెట్టినిల్లు ఒడిశా. ఎంటెక్‌లో సహాధ్యాయి కమాండర్ సరోజ్ కుమార్ పటేల్‌ను వివాహం చేసుకున్నారు. నౌకదళాధికారిగా పనిచేస్తున్నారాయన. ఎంటెక్‌లో చేరేవరకు రక్షణ రంగంలోకి వస్తాననుకోలేదు. గైడెడ్ మిస్సైల్ టెక్నాలజీలో ఎంటెక్ చేయడానికి డిఆర్‌డివో నిర్వహించిన ప్రవేశ పరీక్షకు హాజరయ్యారు. ఆ సంస్థ ఎంపిక చేసిన పదిమందిలో ఒకరుగా పూణేలోని డిఫెన్స్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఆర్మమెంట్ టెక్నాలజీలో ఎంటెక్ పూర్తి చేశారు. ఏడాదికాలం బోధకురాలిగా పనిచేసి 1988లో హైదరాబాద్‌లోని రక్షణ పరిశోధన, అభివృద్ధి సంస్థ(డిఆర్‌డివో)లో శాస్త్రవేత్తగా చేరారు. ప్రఖ్యాత శాస్త్రవేత్త అబ్దుల్ కలామ్ ఆమెను అగ్ని ప్రాజెక్టులో నియమించారు. ఇక అక్కడి నుంచి ఆమె వెనుదిరగలేదు. ప్రతిభ, పట్టుదల, క్రమశిక్షణతో ఆమె ఈ రంగంలో ఉన్నత శిఖరాలకు చేరుకున్నారు. ఆమె కృషికి గుర్తింపుగా 2001లో ప్రతిష్టాత్మక అగ్ని సెల్ఫ్ రిలయన్స్ అవార్డు వరించింది. ఆ తరువాత అవార్డులే అవార్డులు. తన పరిశోధనలు శాంతికి మాత్రమే ఉపయోగపడాలనేది ఆమె ఆకాంక్ష. నేను ఈ క్షిపణిని నిరోధకంగా ఉపయోగించాలని మాత్రమే కోరుకుంటున్నానని ఆమె చెబుతారు.

ఇస్రోలోని అగ్రశ్రేణి శాటిలైట్ కమ్యూనికేషన్ శాస్త్రవేత్తల్లో డాక్టర్ గీతా వరదన్ ఒకరు. ప్రస్తుతం ఇస్రో కేంద్ర కార్యాలయంలో స్పెషల్ ప్రాజెక్టులకు ప్రాజెక్టు డైరెక్టర్‌గా గీతా వరదన్ వ్యవహరిస్తున్నారు. డాక్టర్ గీతావరదన్ జన్మస్థలం హైదరాబాద్. 1951లో జన్మించారు. తండ్రి ప్రైవేటు ఉద్యోగి, తల్లి గృహిణి. ఆరుగురు సంతానంలో రెండో బిడ్డ గీతా వరదన్. అబ్బాయిలతో సమానంగా అమ్మాయిలు ఉన్నత చదువులకు వెళ్ళాలనే తండ్రి పట్టుదల కారణంగా అందరూ చదువుకోగలిగారు. గీతా వరదన్ అప్పటి ప్రియూనివర్శిటీ (పియుసి) కోర్సులో ఆంధ్ర ప్రదేశ్ అంతటికీ అమ్మాయిల్లో మొదటి ర్యాంకును సాధించి బంగారు పతకాన్ని అందుకున్నారు. 1973లో మొదట్లో బిఎస్సీలో చేరినా ఆప్తుల సలహాతో ఎలక్ట్రానిక్ అండ్ కమ్యూనికేషన్ ఇంజనీరింగ్‌లో చేరారు. ఇంజనీరింగ్ డిస్టింక్షన్‌లో ఉత్తీర్ణులయ్యారు. అప్పట్లో కంప్యూటర్ ఇంజనీరింగ్‌లో పిజి ఒక్క బెంగుళూరులోని ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లోనే ఉండేది. అప్పట్లో ఆ కోర్సులో చేరిన గీతా వరదన్ ఒక్కరే మహిళ.

భారత రక్షణ, పరిశోధన అభివృద్ధి సంస్థ (డిఆర్‌డివో) ఆధ్వర్యంలో పనిచేసే ఎలక్ట్రానిక్ రీసెర్చ్ ఎస్టాబ్లిష్‌మెంట్ (ఎల్‌ఆర్‌డివో)లో ఇంజనీరుగా 1976లో తన ఉద్యోగ జీవితాన్ని ఆరంభించారు. తర్వాత హైదరాబాద్‌లో డిఫెన్సు ఎలక్ట్రానిక్స్ రీసెర్చ్ లేబోరేటరీ (డిఎల్‌ఆర్‌ఎల్)కి బదిలీ చేయించుకున్నారు. తర్వాత కొద్ది కాలానికే 1979లో ఇస్రోలోచేరారు. ఇస్రో క్రింద పనిచేసే నేషనల్ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీలో ఆమె ప్రస్థానం మొదలైంది. 1985లో దేశంలో తొమ్మిది ప్రాంతీయ రిమోట్ సెన్సింగ్ సర్వీస్ కేంద్రాల ఏర్పాటు బాధ్యతను గీతా వరదన్‌కు అప్పగించారు. కొన్ని నెలలపాటు అమెరికాలో శిక్షణ పొందిన తర్వాత భారత్ తిరిగొచ్చిన ఆమె రిమోట్ సెన్సింగ్ సర్వీస్ కేంద్రాలను ఏర్పాటు చేసుకుంటూ వెళ్ళారు.

అటు గృహ బాధ్యతలు ఇటు వృత్తి పరిశోధనలను సమర్థవంతంగా నిర్వహిస్తూ సాంకేతిక ప్రపంచంలో తనదైన ముద్ర వేశారు. దేశంలోనే సమాచార శాస్త్రవేత్తగా నిలిచారు. 2008లోనే ఇస్రో మెరిట్ అవార్డును అప్పటి ప్రధానమంత్రి మన్‌మోహన్‌సింగ్ నుండి అందుకున్నారు. ఆ అవార్డును గెలుచుకున్న మొదటి మహిళా శాస్త్రవేత్తగా చరిత్రకెక్కారు. ఆస్ట్రోనాటికల్ సొసైటీ ఆఫ్ ఇండియా నెలకొల్పిన ఉత్తమ మహిళా శాస్త్రవేత్త అవార్డును అందుకున్న తొలి శాస్త్రవేత్త గీతావరదన్. 2012లో భువనేశ్వర్‌లో జరిగిన 99వ ఇండియన్ సైన్స్ కాంగ్రెస్‌లో మిలీనియమ్ ఆనర్‌ను అప్పటి ప్రధాని నుంచి స్వీకరించారు. అంతకుముందు 2011లో ఇస్రో ఎక్స్‌లెన్స్ అవార్డును అందుకున్నారు. తనకు నచ్చిన అయిదుగురు మహిళా శాస్త్రవేత్తల్లో గీతా వరదన్ ఒకరని అబ్దుల్ కలామ్ ప్రశంసను అన్నిటికీ మించిన అవార్డుగా ఆమె భావిస్తారు. అంచెలంచెలుగా ఎదుగుతూ అగ్రశ్రేణి ఉపగ్రహ సమాచార శాస్త్రవేత్తగా నిలిచారు.

- మానవి డెస్క్

ఇంటర్వ్యూ

# తిరోగమన భావాల్ని అడ్డుకోవాలి



"సమాజంలో ఉన్న అనేక ప్రభావాలు, భావాలు మహిళల్ని ఎందుకూ కొరగాకుండా చేస్తున్నాయి. ఒకవైపు మహిళలు మెగా టీవీ సీరియల్స్‌కు బానిసలైపోతున్నారు. మరోవైపు భావప్రకటనా స్వేచ్ఛకు ఆటంకం కలుగుతోంది. ఇంకోవైపు మహిళలకు ఉపాధి లేక జీవనం అస్తవ్యస్తంగా ఉంది. తమ వాణిని వినిపించేందుకు చట్టసభల్లోకి మహిళల్ని అడుగుపెట్టనివ్వకుండా నేటికీ మహిళా రిజర్వేషన్ బిల్లును అడ్డుకుంటున్నారు. ఇవన్నీ మన సమాజంలో మహిళల్ని తిరోగమన భావాలవైపు నెట్టేస్తున్నాయి" అని అంటున్న ఐద్వా అఖిలభారత ఉపాధ్యక్షురాలు యు. వాసుకితో.

**నేడు మహిళలపై టీవీ సీరియల్స్, వాణిజ్య ప్రకటనల ప్రభావం ఎలా ఉంది? దీన్ని అరికట్టడం ఎలా?**

మెగా టీవీ సీరియల్స్ సంఖ్య ప్రధానంగా మా తమిళనాడులోనే ఎక్కువ. అక్కడి నుండే తెలుగు, తదితర రాష్ట్రాల్లో ఈ సీరియల్స్ విస్తృతంగా వ్యాపిస్తున్నాయి. మరికొన్ని ఆయా రాష్ట్రాల్లో తయారవుతున్నాయి. ఈ సీరియల్స్‌కి మహిళలు ఎక్కువగా ఆకర్షితులవుతున్నారు. ఈ సీరియల్స్ ఎలా ఉన్నాయో ఒక్కసారి పరిశీలిస్తే, మహిళ తనంత తానుగా ఏ నిర్ణయం తీసుకోకూడదని చెప్తున్నాయి. ఆమె ఎప్పుడూ ఇంట్లో వాళ్లందరికీ సేవకురాలిగా ఉండడానికి, త్యాగానికి మారు పేరుగా ఉండాలని చెప్తున్నాయి. అంతేకానీ, ఇంట్లో మహిళ ఉదయం లేచిన దగ్గర నుంచి రాత్రి పడుకునే వరకూ చేస్తున్న పనికి గుర్తింపు లేదు. అలాగే మూఢవిశ్వాసాల్ని, కుల, మతతత్వభావాల్ని వ్యాప్తి చేస్తున్నాయి. మళ్లీ మనం వెనక్కిపోయామా అన్నట్లు బహుభార్యత్వాన్ని ప్రోత్సహిస్తున్నాయి. మహిళలకు ఆత్మగౌరవం లేనట్టు చూపిస్తున్నాయి. అక్కాచెల్లెళ్ళు, అమ్మాకూతుళ్ళు ఒకరిపై ఒకరు కుట్ర పన్నుతున్నట్లు చూపిస్తూ, మానవసంబంధాల్ని దెబ్బతీస్తున్నాయి. ధైర్యంగా, ఆర్థికంగా నిలదొక్కుకునే మహిళల్ని విలన్లుగా చిత్రీకరిస్తున్నారు. వీటిని చూసి మహిళలు ఏమి నేర్చుకోవాలి, వ్యతిరేక భావాలు తప్ప. మహిళల్లో ఆత్మస్థయిర్యాన్ని పెంపొందించేలా సీరియల్స్ ఉండాలి. ఆ మేరకు ఒత్తిడి తీసుకురావాలి.

వాణిజ్య ప్రకటనల వల్ల మహిళలు రెండు రకాల ఇబ్బందుల్ని ఎదుర్కోవల్సి వస్తోంది. ఒకటి వ్యాపార ప్రకటనల్లో ఆమె శరీరాన్ని వాడుతూ ఆమెనో వస్తువులా ప్రదర్శిస్తున్నారు. దీనివల్ల సమాజంలో మహిళని వస్తువుగా చూస్తున్న దృష్టి పెరిగిపోతోంది. రెండూ వినిమయదారీతత్వం పెరిగిపోతోంది. అవసరమున్నా, లేకపోయినా వస్తువుల్ని కొనుక్కోవాలనే ధోరణి అధికమవుతోంది.

వీటన్నింటి ప్రభావాలు మహిళలపై పడకుండా వారిని చైతన్యపరచాలి. అంతేకాదు, అవసరమైన సందర్భాల్లో తక్షణ, దీర్ఘకాల కార్యాచరణకు పూనుకోవాలి. సినిమాల్లో వచ్చే అశ్లీల సాహిత్యంపై ఎప్పటికప్పుడు మహిళల్ని కూడేసి, పోరాటాలు నిర్వహించాలి.

**మురగన్ ఉదంతాన్ని మీరెలా చూస్తున్నారు ?**

ఆయన మంచి అభ్యుదయ రచయిత. ఆయనపై, ఆయన రచనలపై దాడి చేయడం భావప్రకటన స్వేచ్ఛను అడ్డుకోవడమే. వాళ్లు చెప్తున్నదేమిటంటే ఎవరికీ అభ్యంతరకరంగా లేకుండా రచయితల రచనలు ఉండాలని. ఆయన రాసిన రచనలు కొందరికి ఆమోదయోగ్యంగా ఉండొచ్చు, మరికొందరికి అభ్యంతరకరంగా అనిపించవచ్చు. అందరికీ ఆమోదయోగ్యంగా ఏ రచయితా రచన చేయలేడు. ఆయన పట్ల, ఆయన కుటుంబం పట్ల, రచనల పట్ల అలా వ్యవహరించడం అమానవీయం. ఆయన రాసిన వాటిల్లో కొందరికి నచ్చని అంశాలు ఉంటే ఆ సంగతిని వెల్లడించవచ్చు. అంతే తప్ప ఆయనపై దాడిచేసి, రచనలను తగలబెట్టే హక్కు ఎవరికీ లేదు. భావ ప్రకటనా స్వేచ్ఛను, విమర్శించే హక్కును రాజ్యాంగం మనందరికీ కల్పించింది. రచయితలపై దాడిని ఐద్వా ఖండిస్తోంది. అసలు కేంద్రంలో మోడీ ప్రభుత్వం వచ్చాక ఇలాంటివి

ఎక్కువగా జరుగుతున్నాయి. ఇటీవల పికె చిత్రంపై వ్యవహరించిన తీరే అందుకు నిదర్శనం. మురగన్‌కు తమిళనాడులో మేధావులు, రచయితలు అండగా ఉన్నారు. ఆయనకు మొట్టమొదట మద్దతుగా నిలిచింది ఐద్వా. ఆయన్ని రచనలు కొనసాగించమని మేము విజ్ఞప్తి చేస్తున్నాం.

**ఉపాధి హామీ పథకం ప్రస్తుత పరిస్థితి ఏమిటి?**

వామపక్షాల వల్లే ఉపాధి హామీ పథకం వచ్చిందన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. నేడు పథకం అమల్లో అనేక తప్పులు జరుగుతున్నాయి. కూలీల శ్రమకు తగ్గ వేతనాలు ఇవ్వడం లేదు. ఈ దోపిడీ దేశవ్యాప్తంగా కొనసాగుతోంది. ప్రధానంగా ఈ పథకం ద్వారా ఎక్కువమంది మహిళలే ఉపాధి పొందుతున్నారు. పనిరోజులు తగ్గించడంతో వారి జీవనం అగమ్యగోచరంగా ఉంది. ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాల్లో పోరాటాలు జరుగుతూనే ఉన్నాయి ఈ సమస్యపై పోరాడుతూనే క్షేత్రస్థాయిలో సమస్యలపై అధ్యయనం జరగాలి.. ఈ పథకంలో ఎన్ని అక్రమాలు జరుగుతున్నాయో చెప్పేందుకు ఉదాహరణ, తమిళనాడులో మదురై జిల్లాలోని గ్రామంలో జరిగిన సంఘటనే. ఈ గ్రామంలో మహిళలకు రోజుకూలీ రూ. 25 మాత్రమే చెల్లించారు. దీనిపై ఐద్వా అందర్నీ కూడగట్టి పోరాడగా రూ. 100 చొప్పున చెల్లించడం ప్రారంభించారు. తమిళనాడులో కనీస వేతనం రూ. 119 ఉన్నా, అది ఇవ్వకుండా ఇప్పటికీ ప్రభుత్వం, అధికార యంత్రాంగం కూలీల్ని శ్రమదోపిడీ చేస్తున్నాయి. కనీస వేతనాల అమలుతో పాటు, ఉపాధి కల్పించాలని పోరాటాలు చేయాల్సిన అవసరం మన ముందుంది.

**అధికఫీజులతో మధ్యతరగతి విద్యార్థుల పరిస్థితి అస్తవ్యస్తంగా ఉంది. మీ రాష్ట్రంలో పరిస్థితిఎలా ఉంది ?**

విద్య ప్రయివేటీకరణ అయ్యాక మధ్యతరగతి కుటుంబాలు అధిక ఫీజులు చెల్లించాల్సి వస్తోంది. దీనితో ఆ కుటుంబాలు అప్పుల పాలవుతున్నాయి. అధిక ఫీజులకు వ్యతిరేకంగా విద్యార్థి, యువజన, మహిళా సంఘాలు కలిసి పోరాడాలి. గతంలో ఈ విధంగా పోరాడిన ఫలితంగా తమిళనాడులో 'గోవిందరాజు, రవిరాజు పాండే కమిటీ'లను వేసేలా చేయగలిగాం.

**మీ రాష్ట్రంలో ప్రస్తుత మహిళల పరిస్థితి ?**

మహిళలపై హింస పెద్దఎత్తున కొనసాగుతోంది. అత్యాచారాలు, లైంగిక వేధింపులపై పోలీసులు సరైన రీతిలో వ్యవహరించడం లేదు. దీనిపై ఐద్వా ఆందోళన చేసి, కేసులు నమోదయ్యేలా చేసింది. దీనికి ప్రధాన కారణాల్లో మద్యం ఒకటి. మొదట మహిళలు, పిల్లలు ఎక్కువగా ఉండే స్కూల్స్, బస్టాప్స్ తదితర ప్రాంతాల్లో మద్యం షాపులకు వ్యతిరేకంగా ఐద్వా పోరాడి సాధించింది. ఐద్వా ఆధ్వర్యంలో కొన్ని ప్రతిపాదనల్ని తమిళనాడు ప్రభుత్వం ముందు ఉంచాం. మద్యాన్ని ఆర్థిక వనరుగా చూడకూడదు. ఇది సరైన విధానం కాదు. ఒకసారి దాన్ని పెద్దమొత్తంలో ఉత్పత్తి చేశాక, దాని అమ్మకం జరుపుతారు. అందుకే ప్రభుత్వం మొదట దీన్ని ఉత్పత్తి చేయడాన్ని, అమ్మకాల్ని నియంత్రించాల్సిన అవసరం ఉంది. మద్యం తాగొద్దని ప్రచారం పెద్దఎత్తున చేయాలి. అలాగే మద్యానికి బానిసలైన వారికి వాళ్లంతట వాళ్లే మారేలా కౌన్సిలింగ్ కేంద్రాలు ఏర్పాటు చేయాలి.

**33 శాతం రిజర్వేషన్ బిల్లు నేటికి ఆమోదం పొందక పోవడానికి కారణం? అసలు ఈ రిజర్వేషన్లు ఏవిధంగా ఉండాలి?**

33 శాతం రిజర్వేషన్ బిల్లు ఆమోదం పొందకపోవడానికి కారణం పురుషాధిక్య భావజాలమే. వద్దనే వారంతా వేర్వేరు ప్రతిపాదనల్ని తీసుకొస్తున్నారు. వాళ్లు చెప్పినట్లు చేస్తే, గెలిచే స్థానాల్లో పురుషుల్ని, ఓడిపోయే స్థానాల్లో మహిళల్ని పెట్టే అవకాశాలు ఉన్నాయి. ఈ బిల్లు ఎన్నికల ప్రయోజనాల కోసం కాకుండా చట్టసభల్లోకి మహిళలు వచ్చేందుకు ప్రోత్సహించేలా ఉండాలి. ఎస్సి, ఎస్టి నియోజకవర్గాల్లో సీటు రిజర్వ్ చేసినట్లు మహిళలకు కూడా సీట్లు రిజర్వ్ చేయాలి. అప్పుడు ఏ పార్టీ అయినా ఆ స్థానంలో మహిళనే పోటీకి నిలబెడుతుంది.

**అమ్మే స్ఫూర్తి...**

మాది రాజకీయ కుటుంబం. నా చిన్నప్పటి నుంచి అమ్మానాన్న ఇద్దరూ పూర్తిగా రాజకీయాల్లోనే ఉండేవాళ్లు. నాన్న ఎక్కువగా ఢిల్లీలోనే ఉండటం వల్ల అమ్మతోనే నాకు అనుబంధం ఎక్కువ. నా చిన్నప్పుడే అమ్మ నన్ను ఒక ఎన్నికల బహిరంగసభలో కాగితంపై రాసిచ్చి చదవమంది. వేదికలపై మంచి ఉపన్యాసం ఎలా చేయాలో అమ్మే నాకు నేర్పింది. అమ్మ ఏ రంగంలో పనిచేసిన అక్కడ మహిళల గురించి ప్రత్యేకశ్రద్ధ చూపేది. అమ్మ తను పాల్గొనే పోరాటాలకు, కార్యక్రమాలకు నన్ను, అక్కను తీసికెళ్లేది. ఇతరులతో కూడా అలా పిల్లల్ని తీసుకురావాలని చెప్పేది. ఇలా అమ్మ చేసే ప్రతిదీ నాకు స్ఫూర్తిదాయకమే అయింది. అందుకే బ్యాంకు మేనేజర్ ఉద్యోగం కూడా వదులుకుని, అమ్మ మార్గంలో అడుగులు వేస్తూ ఈ స్థాయికి ఎదిగాను.

**- శాంతిశ్రీ**

# ఉద్యమాల బాటలో...

**నవంబరు 14 చిల్డ్రన్స్ డే సందర్భంగా :**

బాలల దినోత్సవం సందర్భంగా స్కూలు విద్యార్థుల్లో సమాజం పట్ల అవగాహన పెంచేందుకు, వారి ఆలోచనా విధానాన్ని మెరుగుపరిచేందుకు, పర్యావరణం, జాతీయ నాయకుల గురించి, వ్యాసరచన పోటీలు, ఆటలు పోటీలు నిర్వహించి బహుమతులు ఇవ్వడమైంది. ప్రకాశం, విశాఖ, పశ్చిమగోదావరి, కర్నూలు జిల్లాల్లో సంక్షేమ హాస్టల్స్‌లో విద్యార్థులకు నిర్వహించడమైంది.

**నవంబరు 25 రైట్ టు మై ఛాయిస్ కార్యక్రమం :**

మహిళలపై రోజు రోజుకూ హింస రక రకాల రూపంలో పెరిగిపోతుంది. ఆందోళనకరమైన ఈ పరిస్థితుల్లో ఆడపిల్లల నిష్పత్తి కూడా తగ్గిపోతుంది. ఆడపిల్లల పుట్టుక, చదువు, పెళ్ళి, కుటుంబ నిర్ణయాల్లో ఆమె వివక్షతను ఎదుర్కొంటున్న ఈ పరిస్థితుల్లో ఐద్వా సెంట్రల్ కమిటి నవంబర్ 25 హింసా వ్యతిరేకం దినం సందర్భంగా "రైట్ టు మై ఛాయిస్" అను స్లోగన్‌తో దేశవ్యాప్తంగా ప్రచారం చేసేందుకు పిలుపునిచ్చింది. ఈ సందర్భంగా ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని జిల్లాల్లో పట్టణాల్లో గ్రామాల్లో, జిల్లా కేంద్రాల్లో విస్తృతంగా చేపట్టిన కార్యక్రమాలు విజయవంతంగా జరిగాయి. ఆడపిల్లలకు చదువు, భవిష్యత్తులో అన్ని విషయాల్లోనూ తమకు ఎంపిక చేసుకునే హక్కు కావాలని, ఆ హక్కు కోసం పోరాటం ఇంటి నుండి మొదలు పెట్టవలసి ఉందని తెలియచేస్తూ కాలేజీల్లో కార్యక్రమాలు జరిగాయి. వేల సంఖ్యలో విద్యార్థులు హాజరయ్యారు.



పశ్చిమగోదావరి


పశ్చిమగోదావరి



చిత్తూరు

**డిశంబరు 10 మానవ హక్కుల దినం :**

మానవ హక్కులు మహిళల హక్కులే అనే నినాదంతో నవంబరు 25 హింసా వ్యతిరేక దినం నుండి డిశంబరు 10 మానవహక్కుల దినం వరకు పక్షం రోజులపాటు ర్యాలీలు, 2కె రన్, ప్రతిజ్ఞ కార్యక్రమాలు, సదస్సులు జరిగాయి. విజయనగరం-



విశాఖపట్నం

51 అనంతపురం-5, విశాఖ జిల్లా- 4, విజయవాడ, గుంటూరులలో 2కె రన్, పశ్చిమగోదావరి-10సెంటర్స్, తూర్పుగోదావరి, కర్నూలులలో ర్యాలీ, సదస్సులు జరిగాయి. మహిళలు విద్యార్థులు విస్తృతంగా పాల్గొన్నారు.



గుంటూరు

**సావిత్రిబాయి పూలే జయ.ంతి సభలు :**

భారతదేశ మొదటి సామాజిక విప్లవకారిణి, తొలి ఆధునిక కవయిత్రి, ప్రథమ ఉపాధ్యాయిని సావిత్రిబాయి పూలే. ఈమె జీవితమే ఒక ఉద్యమంగా ఆమె చనిపోయేవరకు కొనసాగించింది. ఆనాటి సామాజిక నియమాలు, మతవిశ్వాసాలు సాంప్రదాయక విధానాలకు వ్యతిరేకంగా అజ్ఞానాన్ని బానిసత్వంగా గుర్తించి దాన్ని రూపుమాపేందుకు నిరంతరం పోరాటాన్ని నడిపిన సావిత్రిబాయి పూలే జయంతి జనవరి 3. ఈ సందర్భంగా ప్రకాశం, నెల్లూరు, అనంతపురం, విశాఖ, కృష్ణాజిల్లాల్లో రౌండ్‌టేబుల్ సమావేశాలు, సదస్సులు జరిగాయి.

**సంక్రాంతి ఆటలపోటీలు :**

సంక్రాంతి పండుగ సందర్భంగా ప్రతి ఏడాది నిర్వహించే విధంగానే ఈ ఏడాది కూడా ఐద్వా, డివైఎఫ్ఐ ఆధ్వర్యంలో ఆటల పోటీలు నిర్వహించడమైంది. ముగ్గులు, మ్యూజికల్ చైర్స్, పిల్లలకు



నెల్లూరు



ప్రకాశం

లెమన్‌స్పూన్, రన్నింగ్, ఖోఖో, కబడ్డి, క్రికెట్ క్రీడల్లో పోటీలు జరిగాయి. విజయనగరం-10సెంటర్స్, ప్రకాశం-83, అనంతపురం- 11, కడప-1, నెల్లూరు-80, పశ్చిమగోదావరి-82సెంటర్స్, విశాఖ-3, కృష్ణాజిల్లా-140 సెంటర్స్‌లో ఆటలపోటీలు జరిగాయి. చిత్తూరు -3, తూర్పు గోదావరి-2 . కర్నూలులో 30 సెంటర్స్‌లో 5రకాల ఆటలపోటీలు నిర్వహించారు. వేల సంఖ్యలో మహిళలు, పిల్లలు, యువత పాల్గొన్నారు.

**స్థానిక సమస్యలపై :**

పెన్షన్స్ : వృద్ధాప్య, వితంతు పెన్షన్స్ కొరకు కడపలో కలెక్టరేట్ వద్ద ధర్నా జరిగింది. కృష్ణాజిల్లాలో-5సెంటర్స్‌లో అధికారులకు మెమోరాండమ్స్ ఇవ్వడమైనది.

**కోడి పందేలకు వ్యతిరేకంగా :**

సంక్రాంతి పండుగ రోజుల్లో ముఖ్యంగా ఉభయ గోదావరి జిల్లాల్లో కోడిపందేలు ఎక్కువగా జరుగుతుంటాయి. అయితే ఇది ఒక వ్యసనంగానూ, కోట్ల రూపాయలు ఈ పందేల్లో పెట్టడం, చిన్న,




పశ్చిమగోదావరి

మధ్య తరగతి నుండి బడా వ్యాపారస్తుల వరకూ ఈ పందేల్లో పాల్గొనటం జరుగుతుంది. ప్రజలకు ఆదర్శంగా ఉండవలసిన ప్రజా ప్రతినిధులు ఎటువంటి జంకూ లేకుండా ఈ పందేల్లో పాల్గొనటం జరిగింది. ఈ కోడి పందేలకు అలవాటుపడి గ్రామీణ ప్రాంతాల్లో యువత కష్టపడకుండా వచ్చే ఇటువంటి వాటిలో పాల్గొనటం, వారికున్న కొద్దో గొప్పో ఆస్తులను నష్టపోవటం జరుగుతుంది. ఈ కోడి పందేలను నిరశిస్తూ పశ్చిమగోదావరిలో 48 కేంద్రాల్లో సదస్సులు, రౌండ్ టేబుల్స్-4, ధర్నాలు-4 సెంటర్స్, పిటిషన్లు-6, ఇవ్వడమైనది.

**స్వైన్ ఫ్లూ పై అవగాహన :**

ఈ మధ్య కాలంలో రాష్ట్ర వ్యాప్తంగా విజృంభించిన స్వైన్ ఫ్లూ పై ప్రజల్లో అవగాహన పెంచేందుకు ఐద్వా ఆధ్వర్యంలో కార్యక్రమం చేట్టడమైంది. వ్యాధి విస్తరించకుండా ఉండేందుకు మాస్కులు పంపిణీ చేయడమైంది.



పశ్చిమగోదావరి

**నగదు బదిలీ పథకంపై :**

గత యుపిఎ ప్రభుత్వం ప్రవేశపెట్టిన నగదు బదిలీ పథకానికి సర్వత్రా ప్రజావ్యతిరేకత వచ్చినందున ఆ పథకాన్ని నిలిపివేయడం జరిగింది. గత ఏడాది జరిగిన ఎన్నికల అనంతరం అధికారంలోకి వచ్చిన బిజెపి ప్రభుత్వం మరలా ఆ పథకాన్ని 2015 జనవరి నుండి అమల్లోకి తీసుకువచ్చింది. దీన్ని నిరశిస్తూ జివో కాపీని భోగి మంటల్లో వేసి తగులబెట్టడం జరిగింది.

**డ్వాక్రా రుణమాఫీకై :**

డ్వాక్రా మహిళలకు రుణమాఫీ చేస్తానని ఎన్నికల్లో వాగ్దానం చేసి పదవిలోకి వచ్చిన తరువాత ఒట్టి చేతులు చూపిస్తున్న తెలుగు దేశం ప్రభుత్వం విధానాన్ని నిరశిస్తూ కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో 75మందితో కొవ్వొత్తుల ప్రదర్శన జరిగింది. మధ్యాహ్న భోజన పథకం వర్కర్లుకి బిల్లులు రిలీజ్ చేయాలని ర్యాలీ, మానవహారం విశాఖజిల్లా అనకాపల్లిలో జరిగింది.

**శ్యామిలీ గుప్తా వర్ధంతి సభలు :**

ఐద్వా వ్యవస్థాపకుల్లో ఒకరు జాతీయ అధ్యక్షురాలు ఉండి గత సంవత్సరం మరణించిన శ్యామిలీ గుప్తా ప్రథమ వర్ధంతి



నెల్లూరు

సభలు ఐద్వా ఆధ్వర్యంలో జరిగాయి. ఐద్వా జాతీయ మహాసభలు బుద్ధగయలో జరిగిన చివరి రోజున నవంబరు 25న శ్యామిలీ గుప్తా మరణించారు. హింసా వ్యతిరేకదినం కూడా అయిన నవంబరు 25న "మతోన్మాదం, మహిళలపై హింస అనే అంశంపై సదస్సులు అన్ని జిల్లాల్లోనూ జరిగాయి.

**మహిళలపై హింస సంఘటనలపై :**

విశాఖ జిల్లా చింతపల్లిలో ఉపాధ్యాయురాలిపై హోంగార్డ్ హత్యాయత్నం కేసులో బాధితురాలికి మెరుగైన వైద్యం అందించాలని, దోషిని అరెస్టు చేసి కఠినంగా శిక్షించాలని ఐద్వా,గిరిజనసంఘం ఆధ్వర్యంలో రాస్తారోకో జరిగింది. ఈ ఘటనపై ఎస్.పి.ని కలిసి వినతిపత్రం ఇవ్వడమైనది. చిత్తూరు జిల్లాలో మెటర్నిటి ఆస్పత్రిలో ఆడపిల్ల అదృశ్యంపై హాస్పటల్ ముందు ధర్నా జరిపి ఇటువంటి ఘటనలు పునరావృతం కాకుండా ఉండేందుకు ఆస్పత్రిలో సిసి కెమెరాలు ఏర్పాటు చేయాలని, గట్టి భద్రతా వ్యవస్థను ఏర్పాటుచేయాలని డిమాండ్ చేయడమయినది. చిత్తూరు జిల్లాల్లో అధిక వడ్డీ చెల్లించలేక మహిళ మృతిచెందిన ఘటనపై డిజిపిని కలిసి చర్యలు తీసుకోవలసిందిగా వినతిపత్రం ఇవ్వడమైనది. తూర్పు గోదావరిలో ముగ్గురు విద్యార్థినులపై అత్యాచారం చేసిన వ్యక్తిని అరెస్ట్ చేయాలని డిమాండ్ చేస్తూ పోలీస్ స్టేషన్ వద్ద ధర్నా చేసి నిర్భయ కేసు పెట్టించడమైనది. దోషికి బెయిల్ ఇవ్వకూడదని, అతని తరుపున ఏ న్యాయవాది కూడా పనిచేయకూడదని డిమాండ్ చేయడమైనది.

**నూతన సంవత్సర గ్రీటింగ్స్ :**

ఆడపిల్లల నిష్పత్తి రోజు రోజుకూ తగ్గిపోతున్న ఈ రోజుల్లో ఆడపిల్లల పట్ల వివక్షకూడా పెరిగిపోతుంది. ఈ సందర్భంగా ఐద్వా చేపట్టిన రైట్ టు మై ఛాయిస్" అనే నినాదాన్ని ప్రజల వద్దకు తీసుకువెళ్ళేందుకు నూతన సంవత్సర శుభాకాంక్షలు రాష్ట్ర మహిళలకు తెలుపుతూ "చదువు, భవిత, బతుకు అన్నింటా ఆంక్షలా? తన ఎంపిక హక్కుగా ఆత్మగౌరవానికి ప్రతీకగా ఆడపిల్ల ఎదగాలి అనే సందేశాన్ని ఇస్తూ నూతన సంవత్సర గ్రీటింగ్స్ రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లోను పంచడమైంది. ప్రజల నుంచి మంచి స్పందన వచ్చింది.


చిత్తూరు


గుంటూరు

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు...

# మనిషిలో మార్పు రావాలేగానీ చట్టాలలో కాదు

**"సమస్తకోటి జీవరాసులలో ఉత్తమ జన్మ మానవ జన్మ"** అయితే అలాంటి మనిషే మృగంలా ప్రవర్తిస్తే సభ్యసమాజం యొక్క జీవనమే ప్రశ్నార్థకం. ఎటువైపు దారితీస్తుంది యువత పయనం. ఏమైంది మానవత్వం. **'అ' అంటే అమ్మ, అనురాగం, ఆప్యాయతలకు ప్రతీక.** తన బిడ్డకు నాలుగు మెతుకులు తినిపించాలనే ఆతృతతో తన బిడ్డ ముందుకు తేలేని చందమామను అమాయకంగా పిలుస్తూ గోరుముద్దలు తినిపిస్తుంది. తనబిడ్డకు కడుపు నిండినదో లేదో అని ఆలోచిస్తూనే బ్రతుకుతుంది. అలాంటి బిడ్డ పెరిగి పెద్దవాడై ఆ తల్లికి నాలుగు మెతుకులు పెట్టడానికి ఆలోచిస్తున్నాడు. చిన్నతనంలో తన ఆకలి గుర్తించి తన తల్లి కడుపు నింపిన విషయం మచ్చుకైనా గుర్తుకు రాదా ! ప్రతి వ్యక్తి ఇతర స్త్రీని తన తల్లి, చెల్లి భావనతో చూడాలి. ఢిల్లీలో జరిగిన నిర్భయ సంఘటనతో సభ్యసమాజం తలదించుకొంది. అసలు మనదేశం మహాత్ముడు పుట్టిన దేశమేనా అని ప్రశ్నించుకోవలసి వస్తుంది. ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు నివసిస్తారు అనే సందేశం ఏమైంది. అదే నిర్భయ నీ తల్లో, చెల్లో అయివుంటే నీ బాధ ఏమిటి ? ఇప్పటికైనా మించి పోలేదు. అలాంటి సంఘటనలు పునరావృతం కాకుండా ప్రతి ఒక్కరు నడుము బిగించాలి. అలాంటి సంఘటనలు జరగకుండా ఆపడానికి ముందుకు నడవాలి. ప్రతిమనిషి జీవితం శాశ్వతం కాదు. తానుచేసే మంచి, చెడులే శాశ్వతం. సమాజంలో స్త్రీలపట్ల జరుగుతున్న ఆకృత్యాలను చూసి ఎదురించలేకపోతే మానవ జన్మ నిస్సార్థకం. ఏ అడవిలో చెట్టుగానో, పుట్టగానో పుట్టేదినయం. బ్రిటిష్ సైనికుల నుండి స్త్రీల మాన, ప్రాణాలు కాపాడడానికి, తన ప్రాణాన్నే త్యాగం చేసిన గూళిపాళ్యం హంపన్న గారిని ఆదర్శంగా తీసుకోండి. నేరము జరగకుండా నిలుపుదల చేయడమే ముఖ్యం (Prevention is better than cure) మన భారతదేశంలో కట్టుబాట్లు, వివాహ సంప్రదాయాలు ఇతర దేశస్తులు ఆకర్షితులు అయ్యే తరుణంలో సభ్యసమాజం తలదించుకొనే విధముగా మానవమృగాలు స్త్రీల పట్ల ప్రవర్తించే తీరు భారతీయులుగా తలదించుకోవలసి వస్తుంది. "అందుకే మనిషిలో మార్పురావలే గాని చట్టాలలో కాదు" స్త్రీల సమస్యల పట్ల స్త్రీల పైన జరుగుచున్న ఆకృత్యాల పట్ల నిరంతరం పోరాడుతున్న ఐద్వా (All India Democratic Womens Association) పదికాలాల పాటు పనిచేయాలని వారికి మన అందరి సహకారం, ఆశీస్సులు ఉండాలని కోరుకుంటూ....

అభినందనలతో...

మీ

**శ్రీ కె. గోరంట్లమాధవ్,** ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్

అనంతపురం వన్‌టౌన్ మరియు సిబ్బంది.

అంతర్జాతీయ మహిళా దినోత్సవము శుభ సందర్భముగా
శుభాకాంక్షలతో...

# మహిళా అభ్యున్నతి కొరకు అనంతపురం జిల్లా ప్రజా పరిషత్ ద్వారా చేపట్టబడిన మహిళా సంక్షేమ కార్యక్రమాలు




- ★ 2013-2014 సంవత్సరమునకు గాను బి.ఆర్.జి.ఎఫ్. పథకము క్రింద అంగన్‌వాడి భవనాల నిర్మాణము మొదలైన 140 పనులకు గాను రూ॥ 2.56 కోట్లు మంజూరు.
- ★ మహిళా సంక్షేమము కొరకు జిల్లా పరిషత్ సాధారణ నిధుల నుండి 15% కేటాయింపు.
- ★ 2013-2014 సంవత్సరమునకు గాను 12.00 లక్షల అంచనా మొత్తముతో 5 పనుల మంజూరు.

డి. చమన్ సాబ్, ఛైర్మన్
జిల్లా ప్రజా పరిషత్, అనంతపురము

50

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : D. Rama Devi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A146 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |